'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇవీ సంగతులు

28

## హాస్యం - సంగీతం







'సెంటర్ స్ప్రెడ్'లో - 'యువరత్న' 'ఖడ్గం' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: సదా

అక్టోబరు రెండో సంచికలో షమ్మీకపూర్ గురించి రాసారు. చాలా సంతోషం.'ఇద్దరు మిత్రులు' నవల చాలా బాగుంటోంది. పద్మనాభం ఆత్మకథ కూడా!. ఆనాటి వారి మంచితనాన్ని, దాతృత్వాన్ని చూస్తుంటే ఎంతో మంచి కాలం మనం మిస్సయ్యాము అనిపిస్తోంది.

**కె.ఎ(స్రామారావ్,విజయనగరం.**

'హాసం' పత్రిక మొట్టమొదట చూడగానే నాకు నా చిన్నతనం గుర్తుకొచ్చింది. లలిత సంగీతం సినిమా పాటలు పాతవి, క్రొత్తవి వాటి రాగాలు. ఇవన్నీ చూస్తుంటే అప్పుడే అయిపోయిందే అనిపిస్తుంది. కొత్త సంచిక మళ్ళీ ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూసేలా చేస్తుంది.

**లక్ష్మీనారాయణ,**

16-31 అక్టోబరు సంచికలో కొడవగంటి కుటుంబరావుగారి కథ 'వింతభూకంపం' కడుపుబ్బ నవ్వించింది. సత్యమూర్తి గారి చదువు(లావు, నండూరి పార్థసారధి గారి రాంబాబు మమ్మల్నెంతో నవ్విస్తున్నారు. నవ్వడం ఓ భోగం అన్నారు జంధ్యాల గారు. ఆ భోగాన్ని మా చే అనుభవింపజేయుచున్న 'హాసం'కు కృతజ్ఞతలు. బాపూ గారి కార్టూన్లకు...ఒక పేజీ కేటాయించి ప్రచురించగలరని మనవి. బాపూ రమణీయంలో 'ఇద్దరు మిత్రులు' సినీ నవల చదువుతుంటే సినిమా చూస్తున్న భావన కలుగుతుందనడంలో అతిశయోక్తి లేదు. పాఠకులచే నిర్వహించబడుతున్న 'చౌచౌచౌరస్తా' శీర్షిక చాలా బావుంటోంది.

**-కె.శ్రీనివాస్, మానెంవారిపాలెం.**

మీ పత్రికలో ప్రచురించిన రచనలన్నీ బాగున్నాయి. జనరల్ అందరికీ నచ్చటంతో పాటు, ఎవరి అభిరుచి, ఆసక్తిని బట్టి వారికి నచ్చేవి కూడా చాలా ఉన్నాయని నా అభిప్రాయం.

**కొడవటిగంటి వరూధిని**
**చెన్నయ్.**

కొద్ది నెలలుగా మీ 'హాసం' పత్రికను రెగ్యులర్ గా తెప్పిస్తున్నాను. అందులో మీరు క్రొత్త సినిమాకు సంబందించి 2 పాటల పుస్తకాలు ఇస్తున్నారు. నెలకు 4 పుస్తకాలు(15రోజులకు 2 కాపీలు) మాత్రమే ఇస్తున్నారు. కానీ ఒక నెలకు దాదాపు 9లేక 10 సినిమాలు రిలీజ్ అవుతున్నాయి. కనుక దయచేసి ఒక్కో కాపీకి 4 కొత్త సినిమాల పాటలైనా ఇవ్వండి. అలా కుదరని పక్షంలో ఎట్ లీస్ట్ కాపీకి 3 కొత్త సినిమాలైనా ప్రింట్ చేయండి.

**తోట శ్రీనివాసరావు**
**మాకాపూర్.**



"మంచి పత్రిక "హాసం" నిరంతరం పత్రికల్లో వస్తున్న పోటీని తట్టుకుంటూ అన్నివర్గాల ప్రేక్షకులని అలరిస్తున్న హాసం రియల్లీ గ్రేట్..! అచిర కాలంలోనే అన్ని వర్గాల పాఠకులకి ప్రియమైన పత్రికగా ఎదిగిన ఈ సంగీత సంప్రదాయ విలువల మణిహారం ఇంకా ప్రగతి సాధించాలని కోరుకుంటున్నాము. ఆనాటి నటుల జీవిత విశేషాలు, పాత సినిమాల ముచ్చట్లు బావుంటున్నాయి.

**కోనే సతీష్‌కుమార్**
**శ్రీకాకుళం.**

1-15 నవంబర్ 'హాసం' సంచిక ఆర్తి అగర్వాల్ ముఖచిత్రంతో ఆకర్షణీయంగా ఆకట్టుకొనే విధంగా ఉంది. ఈ సంచికలో ఎప్పటిలా అన్ని శీర్షికలతో పాటు, డా॥దాశరథి వర్ధంతి సందర్భంగా అందించిన వ్యాసం, ఫోటోలు, పాటలు వండర్‌ఫుల్‌గా ఉన్నాయి. మా ఫేవరేట్ కవులలో ఒకరైన డా॥దాశరథి పాటలలో 'నీకేలా ఇంత నిరాశ' అనే 'ఆరాధన' చిత్రంలోని పాటంటే మాకెంతో ఇష్టం. ఆపాట కూడా ఇచ్చిఉంటే చాలా బాగుండేది.

**ఎం.డి.ముస్తఖీమ్**
**కొల్లాపూర్.**

నా చిన్నప్పుడు చిట్టిబాబు గారు చేసిన కచేరీ చూసిన నాకినాటికీ నిత్యనూతనమే. 1996 ఫిబ్రవరి 9 న ఆయనిక లేరన్న వార్త విన్న నా హృదయం ద్రవించగా రాసినవీ అక్షరాల అంజలులు. పంపించడానికి సందర్భంలేక డైరీలోనే చిక్కుకు పోయాయి. ఇపుడు హాసం ప్రచురిస్తే చాలా సంతోషమే.

ఘంటసాల గారి కథ ముగింపు చదివాక గుండె బరువెక్కి కళ్ళు వర్షించాయనడం ఎవరికైనా సహజమేననుకోండి. అపుడే అయిపోయి మరీ బాధ పెట్టించారు సావిత్రి గారు.

'హాసం' ఆల్బమ్ పత్రికా ప్రపంచంలోనే తొలి ప్రయోగమనుకుంటాను. ఏమైనా అన్నీ ప్రత్యేకలే 'హాసం'కు.

**ఒక పాఠకుడు,బూరుగుపల్లి.**

1-15 నవంబరు 'హాసం'లో డాక్టర్ దాశరథి గారి కొన్ని పాటల 'జన్మ రహస్యాలు' దాశరథి సినీగీతాలు చదివి మీకు కృతజ్ఞతలు తెలియచేయకుండా వుండలేకపోతున్నాను. 'చిరంజీవులు' సిన్మా పాటలు, ఫోటోలు, తనికెళ్లభరణి 'ద్వారం' వారిపై వ్యాసం, నాగేష్ సూక్తులు, రావికొండలరావు గారి హ్యూమరథం, ఇంకా పేరడీలు, చిలిపికవితలు, హ్యామర్‌బాక్స్, నవ్వుటద్దాలు చాలాచాలా బాగున్నాయి.

**-డి.రాములు**
**ఏలూరు**

'హాసం' దీపావళి సంచిక దివ్యంగా ఉంది. సంగీత, సాహిత్య పుష్పాలు రెంటిని, పాఠకలోకానికి పండుగ కానుకగా ప్రసాదించారు. తొలి పుష్పం సంగీత కళానిధి, కళాప్రపూర్ణ, పద్మశ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు గారు అయితే, మలి పుష్పం శ్రీ దాశరథీ కవితా పయోనిధి.

హరికథా పితామహులు శ్రీ ఆదిభట్ల వారి ఆశీర్వచన వాక్కులు వయోలీన్ విద్వాంసుడు కమ్మని, ప్రొఫెసర్‌గా నియమించినతీరు విన్నవారికి నాడే కాదు. నేడు కూడా ఆశ్చర్యచకితుల్ని చేస్తుందంటే అతిశయోక్తి కాదు. ఆంధ్రమాత పుత్రుల్లో ఓ మణిపూస. సాహితీరత్నం, శ్రీ దాశరథి. నిజంగా ఓ కవితా పయోనిధి. సినీ ప్రపంచంలో చిరస్మరణీయులు. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న ఓ కవిసామ్రాట్. భారతావనిని, పరదేశీయుల కబంధహస్తాల నుంచి విడదీయ తన కవితా ఖడ్గాన్ని ఝుళిపించిన సాహసి. వారి దేశభక్తికి నిదర్శనం పారితోషికం లేకుండా పాట రాస్తాననడం. కాదా? సాహితీ సేవలో కూడా శ్రీ వైష్ణవ సాంప్రదాయాన్ని విసర్జించక పురుషకార పద్ధతిని ప్రవేశింపచేస్తూ వ్రాసిన పాటను ప్రతి ఇంటా ఇప్పుడూ పాడుకుంటాం. కీ॥శే॥ నార్ల చిరంజీవి గారి గురించి కూడా ఓ నాలుగు మాటలు వ్రాయండి. వారి పాటలు కూడా వరాల మూటలు.

**శ్రీమాన్ శ్రీకాశ్యప్,**
**సింహాచలం.**

సంపుటి : 2 సంచిక: 4

16-30నవంబరు 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200



The one and only Magazine devoted to Humour & Music




# హాసం

## హాస్య-సంగీత పత్రిక

28


మేనేజింగ్ ఎడిటర్

ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్

రాజా

రిఫరెన్స్ కర్టెసీ

డా॥ కె.వి.రావు

జె.మధుసూదన శర్మ


ఓ పదేళ్ళపాపకు పాటలంటే ప్రాణం. హాయిగా పాడుతూ ఉండటంతో చదువు ఆశించినంతస్థాయికి రాలేదు. 'ఆశించినంత అంటే ఆ పాప ఆశించినంత' అనేదికాదు. ఆమె అమ్మానాన్న ఆశించినంత అని అర్థం. ఆశాభంగం చెందిన అమ్మా, నాన్నా తలలు పట్టుకున్నారు. తలలు ఒక చోటికి చేర్చారు. ఈ పాటల పిచ్చే పాప చదువుకి అవరోధం అని తేల్చారు. ఆమె సేకరించిపెట్టుకున్న సినిమా పాటల పుస్తకాలను, రేడియోలో విని రాసుకున్న లలిత, శాస్త్రీయ సంగీతాల పుస్తకాలను కట్టకట్టి పట్టుకెళ్ళి నూతిలో పడేశారు. 'హమ్మయ్యా, అమ్మాయి చదువుకి ఇక ఏ ఢోకాలేదు' అనుకున్నారు.

పాప పెద్దదయింది. పెళ్లయింది, తల్లయింది. మధ్య వయస్సు వచ్చిపడింది. అయినా చిన్నప్పుడు పాడుకొన్న పాటల మీద ప్రేమ తగ్గలేదు. గుర్తుకు తెచ్చుకుని మళ్ళీమళ్ళీ పాడుకునేది. కానీ కొన్ని చరణాలు గుర్తుకు రావటం లేదు. సరిచూసుకుందామంటే పాటల పుస్తకాలు లేవు. పాటల పుస్తకాలు గుర్తుకు వచ్చినప్పుడల్లా తల్లితండ్రులు పారేసిన సంఘటన గుర్తుకు వచ్చి కన్నీళ్ళపర్యంతం అయ్యేది. రోజులిలా గడుస్తుండగానే ఆవిడకు ఓ పత్రిక తారసిల్లింది. తనెంతో అభిమానించిన, ఆరాధించిన పాటల లిరిక్స్ మాత్రమేకాక వాటి వివరాలు, విశ్లేషణలు కనబడ్డాయి ఆమెకు. పోగొట్టుకున్న పెన్నిధి వడ్డీతోసహా తిరిగివచ్చినట్టనిపించింది ఆమెకు.

ఆ పత్రిక ప్రతీ సంచిక సేకరించి పెట్టుకోసాగిందామె. అన్ని సంచికలు ఆమెకు అపురూపమే. అప్పట్లో తనకు దొరకని పాటలు కూడా చక్కగా, అందంగా ఫోటోలతోసహా ప్రింటుచేసి అందిస్తుంటే ఆమె పొంగిపోసాగింది. ఇంటికి వచ్చిన అందరికీ ముచ్చటగా చూపించి మురిసిపోయేది. ఇంట్లో షోకేషులో ఆ పుస్తక సంపదను ప్రదర్శించేది.

మరి ఎలా జరిగిందో ఏమో, ఎవరి కన్ను పడిందో ఏమోకానీ సేకరించి పెట్టుకున్న ముత్యాలసరాలలో ఒకటి కనుపించకుండా పోయింది. చిన్నప్పటి నూతి సంఘటన కళ్ళముందు కదలాడింది. ఎదిగిన పిల్లల తల్లి అయిన వయసులో కూడా లోనదాగున్న చిన్నారిపాప బయటపడింది. వెక్కివెక్కి ఏడ్చింది. భర్త ఓదార్చాడు.' ఆ పత్రికకు ఉత్తరం రాయి. కావాలంటే పాత సంచికలు పంపుతామంటున్నారుగా' అని ఊరడించాడు.ఆమె కళ్లల్లో ఆశ, 'ఉత్తరమా? చాల్లేండి, పోతే పోయింది డబ్బు అంటూ, ఫోన్ చేసింది. అంతలోనే భార్యాసహజమైన చికాకు.

ఇది కథకాదు, ఓ పాఠకురాలు 'హాసం'కు ఫోన్ చేసి వినిపించిన స్వీయగాథ. 'మీకు కావలసిన సంచిక దొరుకుతుందమ్మా' అని చెబితే ఆవిడకు నమ్మలేనంత ఆనందం. నిజంగానా? మీరు ఉత్తినే అంటున్నారా? అని విస్మయం. పోస్టులో మిస్సయిపోతుందేమో, ఎవర్నైనా పంపించి తెప్పించుకోమంటారా? అని ఆరాటం. ఆ ఫోను సంభాషణతో ఆనాటి పదేళ్ళపాప పూర్తిగా బయటపడిపోయింది.

ఎంత ఎదిగినా మనందరిలోనూ ఆ పసితనం ఉంటుందని మానసిక శాస్త్రవేత్తలు చెబుతూనే ఉన్నారు. ఆ పసితనం జ్ఞాపకాలను తీపిగా ఉంచవలసిన బాధ్యత తల్లితండ్రులది. మూడు దశాబ్దాలక్రితమే తల్లితండ్రులు పిల్లల లలితకళాభిరుచిని అడ్డుకోవడానికి ప్రయత్నించారంటే, ఈతరం తల్లితండ్రుల గురించి చెప్పేదేముంది? చదువు తప్ప వేరేది పిల్లలకు కన, వినబడకూడదని జట్కా గుర్రాలకు మల్లే వాళ్ళకు గంతలు కట్టేస్తున్నారు. దానివల్ల పిల్లలు పొడుగ్గా సర్వేచెట్లులా ఎదుగుతారేమోకానీ మఱ్ఱిచెట్టులా విస్తరించలేరు. మనో వికాసం పొందలేరు.

మనిషికి లలితకళల అవసరం ఎంతో ఉంది. చిత్రకళలాంటివి నేర్పించడం కష్టం అనుకుంటే సంగీతంలాంటివి నేర్పించండి. వీలు పడకపోతే కనీసం పాటలు విననీయండి - ఆ పాటలు మీకు నచ్చినా, నచ్చకపోయినా! అప్పుడే వాళ్ళు రిలాక్స్అయి చదువులో ప్రతిభ చూపగలిగేది.




HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

# స్పెషల్ ఎఫెక్టులు

## వారణాసి రామకృష్ణ

జనాల్ని సిన్మాలకి ఎలా రప్పించాలా అని రీసెర్చి చేసి నిర్మాతలు కొత్త కొత్త టెక్నిక్కులు కనుక్కుంటున్నారు. వాటిలో ఈ మధ్య వచ్చిన లేటెస్టు సాంకేతిక అంశం - సిన్మా చూస్తుండగా సీనులో ఏదైతే కంటికి కనిపిస్తుందో దాని సహజమైన 'వాసన' థియేటర్ అంతా వస్తుంటుంది.

అంటే హీరోయిన్ పాత్ర వంటింట్లో పోపువేస్తే చూసే మనకి ఇంగువ ఘాటు ముక్కుకి తగుల్తుందన్నమాట! హీరోయిన్ హీరోయిన్ బాత్రూమ్‌లో స్నానం చేస్తే సుగంధ పరిమళాలు థియేటర్లో వ్యాపిస్తాయన్నమాట!

ఈ రకం టెక్నిక్ మన దేశానికి వచ్చి ప్రస్తుతం ట్రెండ్‌లో తెలుగులో టీనేజీ లవ్వుస్టోరీ తీస్తే- చూద్దామని సకుటుంబ సపరివార సమేతంగా పాలోయని వెళ్లాం!

ఆ కథ వైనం ఎలా జరిగిందంటే... ...

సుర్జీత్ టీనేజ్ కుర్రాడు. సెయింట్ దూర్వాస స్కూల్లో పదోక్లాసు పదిమార్లు తప్పి పదోమారు... సారీ పదకొండోసారి చదువుతున్నాడు. అప్పటికి వారం రోజులయింది(ట) - సుర్జీత్ స్నానం చేసి! ఒళ్లంతా దుర్గంధం! భరించలేనంత కంపు! (థియేటర్లో కూడా అదోకరకం వాసన) సెయింట్ దూర్వాస స్కూలు పిల్లాళ్లంతా సెయింట్ దూర్వాస స్కూల్లో సెంటు వాసన కాక ఈ దుర్వాసనేంటోనని జోకులేసన్తూ క్లాసులు బాయ్‌కాట్ చేసి పార్కుల్లో చేరి పిచ్చి పిచ్చిగా గంతులేస్తూ "పిచ్చి తనమే... పిచ్చి తనమే!" పల్లవి ఎత్తు కున్నారు. "టీనేజీ అంతా పిచ్చితనమే!"

ఇక ఇంట్లో సుర్జీత్ తల్లీతండ్రి నెత్తి నోరూ బాదుకుంటూ

'ఒరే సుర్జీ... స్నానం చెయ్యినాయనా!' వాపోతున్నారు.

కాలనీ వాళ్లంతా కర్పూర ధూపాలతో వచ్చి 'బాబూ సుర్జీ! ఈ ఏరియాలో బతకలేక చస్తున్నాం! ఉడుకులాం వేసుకుని ఉడుకు నీళ్లు పోసుకో బాబూ!' హితవు చెప్పారు. అప్పుడు థియేటర్ అంతా కర్పూరం వాసన!

ఎవరేం చెప్పినా, ఎంత బ్రతిమాలినా సుర్జీత్ మాత్రం - ఒక మాట ఒకే గావు కేక!

"నోఁ వీల్లేదు! నేను చచ్చినా స్నానం చెయ్యను!"

కాలనీ వాళ్లంతా వెంటనే ఖవ్వాలి టైపులో సాంగు!

'ఎట్లారా భగవంతుడా! మార్చి వీడ్ని చెయ్యి బుద్ధిమంతుడా!' పాట పాడుతూ సాంగు మధ్య లోనే సుర్జీత్ స్నానం గురించి వాకబు చేశారు. సుర్జీత్ కూడా బదులిన్తూ దీనికి కారణం క్లాసుమేటు ప్లస్ గ్లాసుమేటు అయినా హసన్ కొక్కడికే తెలుసునని పాట ముగింపు చేశాడు.

అందరూ కలిసి హసన్ కోసం వెళితే, ప్రస్తుతం అతను లేడు! అతని తల్లి ఏడుస్తూ 'పెన్ను పట్టు కునే యేజ్‌లో పిల్లాడు గన్ను పట్టుకుని వీరావేశంతో వెళ్లాడు! ఏ విప్లవకారులతో కలిసి ఈ సమాజాన్ని బాగుచేస్తాడో!' అని వెక్కి వెక్కి రోదించింది!

ఇక ఏం చెయ్యాలో అర్థంకాక అందరూ తిరిగొచ్చారు. ఓ ముసలమ్మ హటాత్తుగా దృశ్యంలోకి దూసుకొచ్చి 'శ్మశాన వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం, పురాణ వైరాగ్యం విన్నానుగానీ ఈ కుర్రాడికి స్నాన వైరాగ్యమేమిటో!' మూతి ముప్పై వంకర్లు తిప్పి డైలాగ్ చెప్పి ఆ తర్వాత కన్నుకొడుతూ 'కొంపదీసి కుర్రాడు లవ్‌లో పడ్డాడేమో!' అన్నది చిలిపిగా!

ఆ మాట అనటమే తరువాయి. అందరూ సుర్జీత్‌ని టీజ్ చేస్తూ 'పడ్డావా లవ్వులో... పడ్డావా!' అంటూ పడుతూ లేస్తూ పాట పాడి కూపీలాగగా సుర్జీత్ లవర్ పేరు ' సువాసిని!' అని చెప్పాడు.

కట్‌చేస్తే - సదరు సువాసిని గౌను వేస్కుని స్కూల్ బ్యాగు భుజానికి తగిలించుకుని వెళ్తొంటే కాలనీ జనాలు, సుర్జీ తల్లితండ్రులు వెంటబడి తరిమి తరిమి ఆఖరికి పట్టుకుని 'పాపా! సువాసినీ! మీ ప్రేమ ఘాటు వాసనకి తట్టుకోలేక పోతున్నాం! ఒక్కసారి రా తల్లీ!' దీనంగా ప్రాధేయపడ్డారు.

సువాసిని సుర్జీత్ దగ్గరికొచ్చింది. సుర్జీత్ ఫ్రేములోకి రాగానే థియేటరంతా దుర్గంధం! సువాసిని దృశ్యంలో కన్పించగానే సుగంధ పరిమళం!

ప్రేక్షకులు ఈలలు వేశారు!

సువాసిని కర్చీఫ్‌తో ముక్కుమూసుకుని సుర్జీత్ పెదవుల మీద వేలితో రాస్తూ - 'సుర్జీ! నేనంటే నీకు ఎంతో ప్రేమ కదూ!' అడిగింది మొహం అసహ్యంగా పెట్టి!

'ఇంకా డౌటా? నువ్వేం చెబితే అది చేస్తాను!' ప్రేమావేశంగా చెప్పాడు.

'నేనేం చెయ్యమన్నా చేస్తావా?'

'ఓ ! తప్పకుండా! చివరకు నా ప్రాణం ఇవ్వమన్నా ఇస్తాను!' ఉద్వేగంగా అరిచాడు.

'సరే అయితే - అదిగో అక్కడున్న స్విమ్మింగ్ పూల్‌లోకి దూకి శుభ్రంగా స్నానం చెయ్యి'

'నోఁ! అది మాత్రం చెయ్యను!' చేతులు అతి జాగ్రత్తగా చూసుకుంటూ మరింత గట్టిగా అరిచాడు...

వాసన మరింత ఎక్కువయి సిన్మాచూస్తున్న ప్రేక్షకుడు కూడా లేచి నిలబడి గట్టిగా...

'ఓరి దరిద్రుడా! దూకుతావు గదా అనుకుంటే

**కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్**



**భరించలేని వాసన?**

**ఉద్వాసన!**

మొండికేస్తావా?' అరిచాడు. సువాసిని బ్యాగులోంచి మరో కర్చీఫ్ తీసి ఆల్రెడీ పెట్టుకున్న కర్చీఫ్‌మీద దీన్ని మడతేసి పెట్టి 'అదేంటి నుర్జీ! స్విమ్మింగ్‌ఫూల్‌లోకి దూకు!' అన్నది కటువుగా!

'నో! అది తప్ప ఇంకేం చెయ్యమన్నా చేస్తాను!'

'ఛీ! ఛీ! ఇదేనా నీ ప్రేమ! మీ



మగాళ్లంతా ఇంతే! అన్నీ కబుర్లే! ప్రేమంటే తెలీదు!'

ఇంకా ఏదో ఆవేశంగా చెబుతుండగానే ఢామ్మని తుపాకీ పేలిన చప్పుడు ఉలిక్కిపడి అందరం సీట్లో సర్దుకుని కూర్చున్నాం! ఇంతలో మందుగుండు వాసన! తెరమీదకి హసన్ దూసుకొచ్చాడు. రావటమే - ముక్కుమూస్కుని మరీ ఫ్రేమ్‌లోకి వచ్చేశాడు.

మగాళ్లని దుమ్ము దులిపేస్తున్న సువాసిని దగ్గరికొచ్చి హసన్ చెంప ఛెళ్లుమనిపించాడు వెంటనే మగ ప్రేక్షకులు ఈ సీన్‌లో ఈలలు వేశారు.

వెంటనే సువాసిని కూడా లాగి పెట్టి లెంపకాయ ఇచ్చింది.

ఆడ ప్రేక్షకులు ఆనందంతో చప్పట్లు చరిచారు.

హసన్ కోపంగా, చీదరగా ఆమెని చూస్తూ

'లవ్ అంటే అసలు తెలుసా నీకు! హు! ఎంత తప్పుగా నీ లవర్ సుర్జీని అర్థం చేస్కున్నావు సువాసినీ!' గట్టిగా అరిచాడు.

ఆమె నిర్ఘాంత పోతూ 'హసన్!' వెర్రి కేకపెట్టింది.

'అవును సువాసినీ! సుర్జీ స్విమ్మింగ్ ఫూల్‌లోకి ఎందుకు దూకనంటున్నాడో తెలుసా?'

ఏమో తెలీదన్నట్టు తల ఆడించింది!

అక్కడున్న వాళ్లందర్నీ (కొండకచో ప్రేక్షకుల్ని) కోపంగా చూస్తూ తుపాకీ చూపిస్తూ 'మీకైనా తెలుసా?' రెట్టించి ప్రశ్నించాడు క్లోజప్ షాట్‌లో!

అంతా తలలు అడ్డంగా ఊపారు. నాముందు కూర్చున్న కొందరూ సీరియస్‌గా ముక్కు చేతులు అడ్డంగా తలలూపారు, తెలీదన్నట్టు!

'హు! ఇదే మీ అజ్ఞానం! లవ్ ఎంత పవిత్రమైంది? పవిత్రమైన లవ్‌ని ఎంత పవిత్రంగా కాపాడు కోవాలి? పవిత్రమైన లవ్‌ని పవిత్రంగా కాపాడితే అది అపవిత్రమైపోకుండా పావనమై, నిత్య జీవనమై నిరంతర ప్రవాహంలా హోరెత్తుతూ ప్రవహిస్తుంది. ఇది ఇలా సాగి పోవాలనే నేను తుపాకీ పట్టుకుని ప్రేమ ఉద్యమం ప్రారంభించింది!'

హసన్ బ్రహ్మాండంగా డైలాగ్ చెబుతుంటే ఎవరో కొందరు ప్రేక్షకులు లేచి నిలబడి

'ఒక ప్రక్క వాడెందుకు స్నానం చెయ్య నంటున్నాడో అర్థం గాక మరో ప్రక్క కంపు భరించలేక అందరం తన్నుకు చస్తుంటే - మధ్యలో నీ పవిత్రమైన ప్రేమ ఉద్యమం డైలాగులేంట్రా?' చాలా గట్టిగా అరిచారు.

దృశ్యంలో మునలమ్మ ధైర్యం చేసి ముక్కుమీది చెయ్యితీసి

'కాస్త వివరంగా అర్థమయ్యేలా చెప్పు హసన్! లవ్ స్టోరీ వినాలని ఉవ్విళ్లూరుతున్నాను!' ఉత్సాహంగా చెప్పింది.

'చెబుతాను గ్రామీ! చెబుతాను!' అంటుండగా మా బంధువొకడు-

'గ్రామీ అవార్డు గురించి మాట్లాడుతున్నారా?' నన్ను ప్రశ్నించాడు.

'కాదయ్యా బాబూ! గ్రాండ్ మదర్ని అనగా బామ్మల్ని 'గ్రామీ'లుగా పిలవటం ఇప్పటి ఫ్యాషన్!'

నేను చెప్పే లోపలే నా ఫ్రెండ్ ఒకడు చెప్పేసి 'సిన్మా మధ్యలో మాట్లాడబాకండి!' అన్నాడు.

హసన్ తుపాకీ ప్రక్కకి పెట్టి గ్రామీ చీరకొంగుతో చెమట తుడుచుకుంటూ,

'వారం రోజుల క్రితం సుర్జీత్ లవ్ని అంగీకరించిన సువాసిని అతని చేతి మీద 'ఐలవ్ యూ!' అని పెన్తో రాసింది గ్రామీ! అప్పట్నించి వాడు చేతిమీది ఆ ప్రేమ రాత చెరిగి పోకుండా నీళ్ల చుక్క తగిలితే అదెక్కడ చెదిరిపోతుందోనన్న బెంగతో, ఆరాటంతో ఎంత కృంగి కృశించి పోతున్నాడో తెలుసా? వాడు పవిత్రప్రేమని కాపాడుకోవాలని, ఎంత కష్టపడుతున్నాడో అర్థం చేస్కోకుండా అందరూ వాడ్ని ఆడిపోసుకుంటున్నారు!' అంటూ హసన్ సుర్జీత్ దగ్గరికెళ్లి చంకెత్తి చెయ్యిని ప్రముఖంగా చూపించాడు. తెరమీద 'ఐలవ్యూ' అని ఇంకుతో రాసిన అక్షరాలు కనిపించాయి.

వెంటనే థియేటరంతా నీచు వాసన! కుళ్లిన గుడ్లవాసన!

ఉలిక్కిపడి ఒక్కసారిగా అందరం లేచి బైటికి పరుగులు తీశాం!

గేటు కీపరు, థియేటర్ యజమాని నా వెంటపడి తరుముతూ "అరెరె! ఆగండి సార్! పారిపోకండి సార్! తర్వాతి సీన్లో హీరో సుర్జీత్ స్నానం రెగ్యులర్గా రోజూ చేసేలా ఆ హీరోయిన్ సువాసిని ఏం ప్లాను వేసిందో చూపిస్తారు సార్! ఆ తర్వాత ఇద్దరూ స్నానం చేస్తున్న దృశ్యాలుంటాయి సార్! సాంగు అదిరిపోతుంది సార్! న్యూజిలాండ్లో తీశారు సార్! రకరకాల సెంట్లు పూసుకుంటూ వాళ్ల స్నానం చూస్తుంటే థియేటరంతా భల్ నైసు స్మెల్ వస్తుంది సార్!'

అరుస్తూ వెనక పరుగెత్తారు.

కానీ నమ్మకం కుదరక, సిన్మాలో కంపు మరీ ఎక్కువై మురుగులా ముంపులా ముంచేస్తుంటే నిమిషానికి అరొందల కిలోమీటర్ల స్పీడుతో కుక్కలు తరిమితే పరుగెత్తినట్టు పరుగెత్తుకుంటూ ఇంటిల్లిపాదీ ఇంట్లో కొచ్చి పడ్డాం!

**కమాల్ ప్రశ్న - ధమాల్ కార్టూన్**



వరం కాని వరం?
ఆడవాళ్ళకు నవరం
మగవాళ్ళకు క్షవరం

# అవాకు-చెవాకు

-స్వామిచిత్రానంద



తండ్రి: (కొడుకుతో) ఆ పిల్లను ప్రేమించే వాడివి - కాస్త వెనకా ముందు చూసుకో అక్కర్లేదూ?
కొడుకు: చూశాన్నాన్నా - తేడా తెలియలేదు.



హీరోయిన్ :నన్ను అనవసరంగా అపార్థం చేసుకున్నావ్ మోహన్.
హీరో: నేనేం చెయ్యను? - సీను అలా రాశారు మరి....



హీరోయిన్:(ప్రియుడితో) ఏవండీ! పెళ్లి చేసుకుందామండీ - మన బాబుకు మాటలొచ్చేశాయి - "డాడీ! ఎవరు?" అని అడుగుతున్నాడు.
ప్రియుడు: డాడీ వూరికెళ్లారనీ - అందుకే ఈ అంకుల్ వస్తున్నారని చెప్పు.






'మా మామయ్య ఘంటసాల' అనే మకుటం పై శ్రీమతి సావిత్రి ఘంటసాల తెలిపిన అనుభవాలను 'హాసం' పాఠకులకు అందించడానికి అనుమతినిచ్చిన శ్రీమతి సావిత్రి ఘంటసాల గారికి, శ్రీ ఘంటసాల రత్నకుమార్ గారికి, ఈ విషయంలో సహాయ సహకారాలను అందించిన డా॥కె.వి.రావు గారికి మనః పూర్వక కృతజ్ఞతలు.

-ఎడిటర్

25వ సంచికలోని 'ఆ పాత మధురం' శీర్షికలో 'ఇలవేల్పు' పాటలపై విశ్లేషణ చూసాక ఈ క్రింది విషయాలను మీ దృష్టికి తీసుకు రావాలనిపించింది. దిగువ ఉదహరించిన రెండు పాటలూ 'ఇలవేల్పు' రిలీజయిన రోజులలో ఉండేవి. తర్వాత చిత్రం నుండి తొలగించారని చాలా మంది మిత్రులు వారి వారి ఊర్లలో సినిమా చూసి మరీ చెప్పారు. ఆ మధ్య ఒక ఛానల్ లో ఈ చిత్రం ప్రసారం అయినప్పుడు కూడా ఈ రెండు పాటలూ కనపడలేదు.ఇంత మంచి సంగీతం, సాహిత్యం ఉన్న ఈ రెండు పాటలూ మన 'హాసం' పాఠకులు మిస్సవకూడదనే కోరికతో మీకు పంపిస్తున్నాను.

జె.మధుసూదనశర్మ, హైద్రాబాద్.

పాట:1

పలికిన బంగారుమాయెనటే ॥2॥
పలుకుము నా మది పరవశమొందగ
పలికిన బంగారమాయెనటే
తొలిపలుకునకే వలపు జనించగా
మలి పలుకునకే మమతలు రేగగా
పలికిన బంగార మాయెనటే
తీయని స్వరముల హాయి గొలుపుచును
మదిలో మెరిసే మధుర భావముల ॥తీయని॥
రాగములో...రాగములో అనురాగము చూపుతూ
రాగములో అనురాగము చూపుతూ
పాడిననేమానో పల్లవి నీ నోట
పలికి...న బం...గార మాయెనటే
కనులారా నినుజూసి మనసు నీపైనుంచి ॥2॥
అలరుచు మరిమరి ఆనందముతో
పిలచి పిలచి నే...పిలచి పిలచి నేనలసిపోయితిని
పిలచి పిలచి నేనలసిపోయితి
అలుకను విడవేల చెలియను కరుణించి ॥పలికిన॥



పాట:2

ఏనాడు కనలేదు ఈ వింత సుందరిని ॥2॥
నాలో...ఆశలు రేపే అందాల రాచిలుక ॥ఏనాడు॥
ననుచూసి తనలోన నవ్వుకున్నదేమో...
పిలిచిన మాటాడక వెడలిపోవునదేమో.... ॥ననుచూసి॥
ధర్మాలలో వలపు దాచి పలుకనదేమో ॥ధర్మాలలో॥
శబరి గుసగుసలోనే కరుణచూపునదేమో ॥ఏనాడు॥
చిలిపి చేష్టను చూచి సిగ్గుపడునదేమో
నను పిలిచి మనసారా మాటలాడదదేమో... ॥చిలిపి॥
అదే కోపమా లేక ఆనంద పరవశమా ॥అదే॥
కలికి ప్రేమను జూపి కనికరించదదేమో ॥ఏనాడు॥



మీరు క్యాసెట్‌లో పంపిన రెండు పాటలూ విన్నాక నిజంగా ఇంత మంచి పాటల్ని మిస్సయ్యాం అనే ఫీలింగ్ కలిగిన మాట వాస్తవం. ఇందులో 'ఏనాడు కనలేదు ఈ వింత సుందరిని' పాటను రఘునాథ్ పాణిగ్రాహి పాడగా అంజలీదేవిని ఉద్దేశించి అక్కినేని నాగేశ్వరరావు అభినయించారు. 'పలికిన బంగారమాయెనటే' పాటను పి.సుశీల పాడగా జమున అభినయించారు. ఈ పాట అక్కినేనితో పెళ్లి జరిగిన తర్వాత వచ్చే శోభన సన్నివేశంలో ఉంటుంది. ఇప్పుడు అరుదుగా లభించే ఇటువంటి పాటలను అందించే మీ వంటి వారు మాతో ఉన్నందుకు మీకు మేం ఎప్పుడూ కృతజ్ఞులుగా ఉంటాం.

-ఎడిటర్

అక్టోబర్ 16-30 సంచికలో ఎస్.డి.బర్మన్‌పై వ్రాసిన వ్యాసం చక్కగా ఉంది. ఏ పాటకు ఏ గాయనీ గాయకులను ఉపయోగించుకోవాలో ఆయనకు బాగా తెలుసని చాలా మంది రాశారు. ఏ పాటను ఎలా 'ప్రెజెంట్' చేయాలో కూడా ఆయనకు చక్కగా తెలుసని చెప్పడానికి ఈ ఉదంతం-

'బాజీ' సినిమాకై 'తద్‌బీర్ సే బిగ్‌డీ హుఈ తక్‌దీర్ బనాలే' పాటను రాసిన సాహిర్ లుధియాన్వీ దానికి ముజ్రా స్టయిల్‌లో ఘజల్ బాణీ ఇస్తారనుకున్నాడు. కానీ బర్మన్ దానికి వెస్టర్న్ టైపు ట్యూన్ ఇవ్వడంతో అతనికి ఒళ్ళుమండి గురుదత్‌కు ఫిర్యాదు చేశాడు. గురుదత్ వెళ్ళి అడిగితే బర్మన్ ఖరాఖండిగా 'సందర్భం బట్టి ఏ పాటకు ఎలా ట్యూన్ ఇవ్వాలో నాకెవ్వరూ చెప్పనక్కరలేదు' అని చెప్పాడు. ఇక గురుదత్ కూడా ఏమీ అనలేకపోవడంతో సాహిర్‌కి కోపం వచ్చి ఇక జన్మలో బర్మన్‌కు పాటలు రాయనని ఒట్టేసుకున్నాడు. కానీ సినిమా రిలీజయ్యి, పాట హిట్ కావడంతో సాహిర్ లెంపలు వేసుకుని, బర్మన్‌ను క్షమించమన్నాడు.

బర్మన్ చాలా సెన్సిటివ్. ఓ సారి ఓ.పి.రల్హన్ ఇంట్లో ఉండగా అతను బర్మన్‌పై గట్టిగా అరిచాడు. బర్మన్ లేచి నిలబడి 'నీ 'తలాష్' సినిమాకు మ్యూజిక్ డైరక్షన్ చెయ్యనుపో" అనేశాడు. 'అలా ఎలా? నువ్వు ఒప్పుకున్నావ నే బోల్డంత డబ్బు ఖర్చు పెట్టాను.' అని రల్హన్ ఇంకా అరిచాడు. బర్మన్ బయటకు వచ్చేశాడు. మర్నాడు రల్హన్ నాలిక కరుచుకుని కలవబోతే బర్మన్ పొమ్మన్నాడు. చివరికి విజయ్ ఆనంద్‌ను ఆశ్రయిస్తే బర్మన్ శాంతించాడు. విజయ్ ఆనంద్‌పై అభిమానం కొద్దీ - అదీ రల్హన్ క్షమాపణ కోరాక! 'తలాష్' పాటలు ఎంత హిట్టో అందరికీ తెలుసు.

ఆర్.అర్జునరావు, రాజమండ్రి.

అలనాటి ఆణిముత్యాల
గురించి నేటి తరానికి అనువైన శైలిలో
తెలిపే

# నవ్వుటద్దాలు

క్లాసిక్స్ రీటోల్డ్

- ఆచార్య తిరుమల

# సాహిత్యంలో మేధావుల ఓటమి

జీవితం ఒక నాటకం లాంటిది. సంభాషణా పటుత్వం ఉంటేనే కథ రక్తి కడుతుంది. అంత బలమైన సంభాషణా చాతుర్యం ఎంతో జ్ఞానం వల్లగానీ రాదు. అంత జ్ఞానం ఎంతో చదివి, తెలుసుకుంటేనే గానీ రాదు. కానీ విచిత్రం, ఎంత వెర్రివాడైనా తను చాలా తెలివైనవాడి ననుకుంటాడు, మేధావి ననుకుంటాడు, తన మాటే పైనుండాలని, నెగ్గాలని, ఆజ్ఞగా యితరులు పాటించాలని అనుకుంటాడు. తెలివి ఒకరి సొత్తు కాదుగానీ ఆ తెలివికి తేట అబ్బాలంటే, ఆ మాట పదునెక్కాలంటే బుద్ధికుశలత వుండాలి. బుద్ధిలేని వాళ్లది వట్టి వాగుడే అవుతుంది గానీ మాటకారితనం కాదు. మాటకెంతో శక్తి వుంది. అది ప్రియంగా, సత్యబద్ధంగా వున్న వ్యక్తికే సంఘంలో గౌరవ ప్రతిష్టలు దక్కుతాయి. అందుకే నేను నా 'యుగగీత'లో -

**"మాట మనిషిని మహిలోన మహితుఁజేయు**
**అదియె వక్రించెనా వాని నధముఁజేయు"**

అని రాశాను. తిట్టి సెబాసనిపించుకున్న వాళ్లుంటారు. పొగిడి తిట్టించుకున్న వాళ్లుంటారు. అది వారి వారి మాటకారితనం మీద ఆధారపడి వుంటుంది. అయితే, మేధావుల ఓటమి చాలా చమత్కారగర్భితంగా, సంభాషణా చాతుర్యానికి పరిమళాలు పూస్తూ వుంటుంది. అలాంటి తీపి ఓటములు సాహిత్యంలో ఎలా వుంటాయో పరిచయం చేస్తాను.

సర్వశక్తి స్వరూపిణియైన పార్వతి ఒకసారి శివుణ్ణి ఆటలు పట్టించాలని 'నాకు తల్లిదండ్రులున్నారు నీకు లేరని' వేళాకోళం చేస్తే వెంటనే శివుడు 'నాకు అత్తమామలున్నారు నీకు లేరని' (అంటే 'నీకు అత్తపోరులేదని' నవ్వుతూ) ఆమెకు వాగ్బంధనం చేశాడు. ఆ శ్లోకం చూడండి :

**"క్వతిష్ఠతస్తే పితరౌ మమేతి**
**అపర్ణయోక్తే పరిహాస పూర్వం**
**క్వవా మమేవ శ్వసురౌ తవేతి**
**తామీరయన్ సస్మిత మీశ్వరో వ్యాత్!!"**

తెలుగులో ఈ శ్లోకమిలా వుంది:

**నాకున్న తల్లిదండ్రులు, మీకేరీయని యపర్ణ మేలములాడగ**

**నాకున్న అత్తమామలు, నీకేరీయనుచు నగు త్రినేత్రుని గొలుతున్!**

పార్వతిని ఆటలు పట్టించి చిన్నబుచ్చాలని వచ్చి ఆ మహాలక్ష్మి ఓడిపోయి చిన్నబోయిన సందర్భం చూడండి:

**భిక్షార్థీ సక్వయాతః? సుతను! బలిమఖే, తాండవం క్వాద్యభద్రే?**

**మన్యే బృందావనాంతే, క్వను స మృగశిశుం? నైనజానే వరాహమ్**

**బాలే కచ్చిన్న దృష్టో జరఠవృషపతిః? గోప ఏవాస్య వేత్తా**

**లీలాసంలాప ఇత్థం జలనిధి హిమవత్కన్యకయో స్త్రాయతాంనః!!**

లక్ష్మి : అడుక్కోటానికి నీ మొగుడెక్కడికి వెళ్లాడు?

పార్వతి : బలిచక్రవర్తి యజ్ఞానికి. (అక్కడకి వామనుడై లక్ష్మిభర్త వెళ్లాడు).

లక్ష్మి : ఇవేళ నాట్యమెక్కడ?

పార్వతి : బృందావనంలో. (కృష్ణుడై లక్ష్మిభర్త నాట్యం చేసిన చోటు)

లక్ష్మి : చేతిలో ఆ మృగం ఏమిటి?

పార్వతి : అదీ తెలియదా! పంది. (లక్ష్మిభర్త వరాహావతారుడు)

లక్ష్మి : మీ ముసలెద్దు ఎక్కడికి వెళ్లిందో చూశావా?

పార్వతి : అది గోపాలుడికే తెలుసు. (గోపాలుడు లక్ష్మిభర్త)

ఇలా లీలా సల్లాపం చేసిన లక్ష్మీ పార్వతులు రక్షించాలని ప్రార్థన.

మాటల్లో లక్ష్మిదేవి నోడించిన పార్వతి ఒకసారి బాల వినాయకుడి చేతిలో ఓడిపోయి,



సిగ్గుపడిపోయింది.

వారి సంభాషణ యీ శ్లోకంలో చూడండి :

**మాతస్తాత జటాసుకిం? సురసరిత్, కింశేఖరే? చంద్రమాః**

**కింఫాలౌ? హుతభుక్, ఉరత్సురసి కిం? నాగాధిపః, కిం కఫౌ?**

**కృత్తిః, కిం జఘనం కిం జఘున ద్వయాం తరగతం యద్దీర్ఘమాలంబతే?**

**శ్రుత్వాపుత్ర వచోంబికా స్మితముఖీ లజ్జావతీ పాతువః!!**



పిల్లలకి ఏది అడగవచ్చో. ఏది అడక్కూడదో తెలియదు. అన్నీ అడుగుతూ వుంటారు. కొన్ని సందర్భాల్లో వాళ్ల ప్రశ్నలు పెద్దవాళ్లనే యిరకాటంలో పెట్టేస్తాయి. అర్థనారీశ్వర వర్ణనతో వున్న యీ శ్లోకంలో వినాయకుని ప్రశ్న పార్వతినెంత యిబ్బంది పెట్టిందో మీరే తెలుసుకోండి. లేకపోతే ఏ సంస్కృత పండితుడికైనా యీ శ్లోకం చూపించి అర్థం చెప్పించుకుని ఆనందించండి.

శ్రీరాముడిదొకే బాణం, ఒకేమాట. వాటికి తిరుగులేదని అందరికీ తెలుసు. ఎదురులేని పరశురాముడు కూడా రాముని చేతిలో పరాజయం పాలయ్యాడు. శివుని విల్లు విరిచిన రాముని "రే రే క్షత్ర కులాధమ'' అంటూ కోపంతో గర్జించిన పరశురాముని **"ప్రకటితం బ్రాహ్మణ్య మస్త్రేణతే"** - నువ్వెంత బ్రాహ్మణుడవో నీవు పట్టుకున్న ఆ పరశువే (గండ్రగొడ్డలి) చెబుతోంది. అలాకాక ఎలా మాట్లాడతావంటాడు రాముడు. పరశురాముడికింకా కోపం వచ్చి "నువ్వో స్త్రీని చంపావట'' అని గర్జించాడు. వెంటనే రాముడు "మాతా న మే - తాటకా'' (ఆమె నా తల్లి కాదు, తాటక అనే రాక్షసి) అనే సరికి తల్లిని చంపిన పరశురాముడు తలదించుకున్నాడు.

అంత మాటకారి రాముణ్ని ఆటలు పట్టించాలని వచ్చి సీతాదేవి గతుక్కుమన్న సంఘటన యీ పద్యంలో చూడండి:

**"లలనలు పాయస మానిన**
**కలుగుదురే పిల్లలనుచు క్ష్మాసుత నవ్వన్**
**పొలమున దొరికెదరని ధీ**
**బలరాముఁడు సీతఁ జూచి ఫక్కున నవ్వెన్!!"**

పుత్రకామేష్టి యజ్ఞ పాయసం వల్ల రాముడు పుడితే, జనక మహారాజుకి పొలం దున్నుతుంటే సీత దొరికింది. యజ్ఞం - పాయసం - త్రాగటం -గర్భం- ప్రసవం - ఏమీ లేకుండా రెడీమేడ్‌గా కూడా పిల్లలు దొరుకుతారని రాముని చమత్కారం. ఇంక సీత ఏమనగలదు చెప్పండి!

జగద్గురువైన శ్రీ కృష్ణుడొకసారి ఒక గోపికతో ఇచ్చకాలాడటానికి ఆమె యింటికి వెళ్లి మరీ ఓడిపోయాడు.

"శ్రీ కృష్ణకర్ణామృతం కావ్యంలోని యీ శ్లోకం చూడండి :

**అంగుల్యాకః కవాటం ప్రహరతి కుటిలే? మాధవః, కిం వసంతః?**

**నో చక్రీ, కిం కులాలో? నహి ధరణిధరః, కిం ద్విజిహ్వః ఫణీంద్రః?**

**నా హంఘోరాహి మర్దీ, కి మసి ఖగపతిః? నో హరిః, కిం కపీంద్రః?**

**ఇత్యేవం గోపకన్యా ప్రతి వచన జితః పాతువశ్చక్రపాణిః!!"**

కృష్ణుడు కోపంగా వున్న గోపిక ఇంటికి వెళ్లి తలుపు తట్టడంతో సంభాషణ మొదలైంది.

గోపిక

మాధవుణ్ణి

గోపిక : వసంతుడవా?

కృష్ణుడు : కాదు. చక్రిని

గోపిక : కుమ్మరివా?

కృష్ణుడు : కాదు. ధరణిధరుణ్ని (వరాహావతారంలో)

గోపిక :ఆది శేషుడవా? (రెండు నాల్కల పాామువా అని అర్థం)

కృష్ణుడు : కాదు ఘోర సర్పాన్ని మర్దించినవాణ్ని. (కాళీయమర్దనం)

గోపిక : గరుత్మంతుడవా? (పక్షివా అని అర్థం)

కృష్ణుడు : కాదు. హరిని.

గోపిక : కోతివా? (హరి అంటే కోతి అనే అర్థం కూడా వుంది)



గోపిక జవాబులచే ఓడిన కృష్ణుడు మిమ్ము రక్షించుగాక! అని దీవెన.

ఈ పురాణాల్లోంచి ప్రబంధలోకం లోకి వస్తే శ్రీకృష్ణ దేవరాయల యుగ విశేషాలు చాలా వున్నాయి. అష్టదిగ్గజ కవులలో రాయలు భువన విజయాన్ని నిర్వహించాడు. శిరీష కుసుమపేశల సుధామయోక్తుల పెద్దన, తెలుగు పంచ మహాకావ్యాల్లో మొదటిదైన మనుచరిత్ర కావ్యకర్త. ఒకనాడు పెద్దన "కలనాటి ధనములక్కఱ గల నాటికి దాఁచగమలగర్భుని వశమా" అనే రాయలిచ్చిన సమస్యను "నెలనడిమి నాటి వెన్నెల, యలవడునే గాదెఁబోయ నమవస నిసికిన్" అని పూరించగానే, తెనాలి రామకృష్ణుడు 'అమవస నిసికిన్' ప్రయోగం తప్పు పట్టుకుని - "అమావాస్య నిశి' అనలేదని - మహావేశంతో

**ఎమిితిని సెపితివి కపితము**
**బ్రమపడి వెరిపుచ్చకాయ వడిఁదిని సెపితో**
**ఉమెె తక్కయదిని సెపితో**
**అమవస నిసి కనెడు మాట అలసని పెదనా?**

అని దీర్ఘాలు, ద్విత్వాలు తీసేసి యెడాపెడా వాయించేసేటప్పటికి పాపం! పెద్దన తలదించుకున్నాడు. పెద్దననేమిటి రాయలనే ఓసారి ఖంగుతినిపించాడు - ఆలస్యంగా వచ్చిన తెనాలి రామకృష్ణుని రాయలు **"కవి వృషభులు సభకు అలస్యముగా విచ్చేసినారే!"** అని 'వృషభ' శబ్దం దగ్గర నొక్కి పలుకరించాడట. వృషభం అంటే ఎద్దు, శ్రేష్ఠ వాచకం. ఎద్దు మొద్దులా ఆలస్యం చేశావని రాయల వ్యంగ్యోక్తి.

దానికి రామకృష్ణుడు తడుముకోకుండా వెంటనే - **"కామధేనువువంటి ప్రభువులుండగా కవి వృషభులకు కొదువేమి?"** అని నవ్వుతూ నోరెత్తకుండా చేశాడు. వృషభం ఎద్దు, కామధేనువు ఆవు. ఆవు దగ్గరకు ఎద్దువస్తే ఏమౌతుందో ఊహించుకోండి. ఇంత గడుగ్గాయి తెనాలి రామకృష్ణుని మళ్లీ మాట్లాడకుండా నోరు మూయించేసింది రామాయణం రాసిన కవయిత్రి మొల్ల. ఒకనాడామె తనతో ఒక కోడిపెట్టని, కుక్కపిల్లని తీసుకువెడుతూ వుండటం చూసి ఎదురుపడి రామకృష్ణకవి తుంటరిగా బూతు ధ్వనించేలా -




"ఓ వరహా యిస్తాను పెట్టనిస్తావా? రెండు వరహాలిస్తా కుక్కనిస్తావా?" అని అడిగేసరికి మొల్ల - "నేను నీకు అమ్మనుగా" అనగానే గప్‌చిప్‌గా జారుకున్నాడట! అమ్మనంటే విక్రయించననీ, తల్లిననీ అర్థం కదా!

ఈ చారిత్రక కథల్లోంచి ఆధునిక కాలానికి వస్తే - చతుర సంభాషణలు కోకొల్లలు. మేధావుల ఓటములు రసగుల్లలు.

ఒకసారి విశ్వనాథవారికి, జాషువాగారికి ఒకే వేదిక మీద ఘన సన్మానం జరిగింది. విశ్వనాథ వారు మాట్లాడుతూ "అంతా బాగానే వుంది. కానీ గాడిదని, గుఱ్ఱాన్ని ఒక గాటకి కట్టటం నాకు నచ్చలే" దంటూ మాట్లాడారు. జాషువాగారు మాట్లాడుతూ" "విశ్వనాథ వారు నిజం తప్ప మాట్లాడరు. వారితో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. నేను మాత్రం గుఱ్ఱాన్నే" అని ముగించారు. జాషువా గారింటి పేరు గుఱ్ఱం కదా! స్వారస్య మెరిగిన సభ ఘొల్లుమంది.

మహామేధావి విన్‌స్టన్ చర్చిల్ - "మీ దేశం నుండి వచ్చిన ఏడుగురు పత్రికా విలేఖర్లని కలవటానికి వీల్లేదని పంపించేశాను తెలుసా నీకు? నీకు మాత్రం ప్రత్యేకంగా అవకాశమిస్తున్నాను" అన్నాడో విలేఖరితో.

"చిత్తం. మిగతా ఆ ఏడుగురు విలేఖర్లూ నేనేనండి" అన్నాడా గడుగ్గాయి. చర్చిల్ నోరెల్లబెట్టాడు.

ఓటమి ఎరుగని బెర్నార్డ్ షా. ప్రఖ్యాత నాటక రచయిత, ఒకే ఒకసారి వాగ్యుద్ధంలో ఓడిపోయాడు. అదీ పెళ్లాం చేతిలో.

"ఎంపిక చేసుకోవటం మగవాళ్లకు తెలిసినంత బాగా ఆడవాళ్లకు తెలియదన్నాడు షా." అవును. అందుకే నేను మిమ్మల్ని చేసుకున్నాను. నన్ను మీరు చేసుకున్నా"రంది ఆ సతీమణి.

ఇంతెందుకు? కవికుల గురువు కాళిదాసు కూడా ఓ సందర్భంలో ఓటమిని చవిచూడవలసి వచ్చింది. ఆ శ్లోకం చెప్పి యీ వ్యాసం ముగిస్తాను.

**"యుక్తం కిం తవ శర్వరీశ ముఖి! మద్వేణీ సమాకర్షణం**
**వధ్యాయా మహరత్తవ కుచద్వంద్వం మదీయం మనః**
**వ్యత్యస్తం ననుశిక్షితం జహిజహి స్వామిన్ వచః సాధుతే**
**ఆగోయత్కురుతే తదేవ భవతాం దండస్య యోగ్యం ఖలు!!"**

చెరువులో స్నానం చేసి కుండతో నీళ్లు తీసుకుని తనముందు నుంచి ఓరచూపులు చూసుకుంటూ వెళ్లిన ఓ నెరజాణసుందరికి వెనకనే గబగబా వెళ్లి కాళిదాసు ఆమె జడపట్టుకు లాగాడు. ఆమె గిర్రున వెనక్కి తిరిగి "ఓరందగాడా! నా జడ పట్టుకునెందుకులాగా'వని అడిగేసరికి కాళిదాసుకి ఏమి చెప్పాలో తోచక

"నీ బిగువైన చనుదోయి నన్నావని చేయించిందన్నాడు. వెంటనే ఆమె "బావుంది బావుంది, తప్పుచేసిన వారిని విడిచి, నిరపరాధుల్ని దండిస్తారా?" అంది. నిర్ఘాంతపోయిన కాళిదాసు చాలా సేపటికి గానీ కోలుకోలేక పోయాడు. ఇంతకీ ఆమె ఆంతర్యమేమిటో అర్థమయ్యిందా? అయితే చెప్పకండి. మెచ్చుకోండి.



# లలిత సంగీతం




ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993


## కోయిలా వనరాణీ!

ప: కోయిలా వనరాణీ!
వినుదువే నామాట

1చ: మల్లెలు మొల్లలు మంచి గంధాలు
మలయానిలము నెలవెన్నెల
నాతనువున అణువణువును మీటి
పలికించెనే నేడు విరహగీతాలు ॥కోయిలా॥

2చ: యమునా తీర పరాగ ధూళిలో
నాటి రేయి రసరమ్యకేళిలో
తేలియాడిన యీ గుండెలలో
తీయని మంటలు రగిలేనే ॥కోయిలా॥

3చ: ఎవరికి తెలుపనే నా కోరిక
ఎవరికి కలదే తీరిక
ఎదదోచిన ఆ మురళీధారికి
ప్రతివయసూ అభిసారిక ॥కోయిలా॥



| | |
|---|---|
| రచన | : డా॥ ఆచార్య తిరుమల |
| గానం | : శ్రీమతి శాంత |
| సంగీతం | : ఎం. చిత్తరంజన్ |
| రాగం | : యమన్ (హిందుస్తాని సంగీతం) |
| తాళం | : ఆది (కర్ణాటక సంగీతం) |
| | - కహరువా (హిందుస్తాని సంగీతం) |
| ఆరోహణ | : సరిగమపదనిస |
| అవరోహణ | : సనిదపమగరిస |

- షడ్జము, చతుశ్శృతిరిషభం, అంతరగాంధారం, ప్రతిమధ్యమం, పంచమం, చతుశ్శృతి దైవతం, కాకలి నిషాదం - యీ రాగంలోని స్వరాలు.

కర్ణాటక సంగీతంలోని కల్యాణి రాగమే హిందుస్తాని సంగీతంలో యమన్ కల్యాణ్ అని, యమన్ అని పిలువపడుతూంది. లలిత సంగీతంలో యమన్ రాగాన్ని ఉపయోగించేటప్పుడు అన్య స్వరమైన శుద్ధ మధ్యమాన్ని కూడా వాడడం పరిపాటి అయింది. శాస్త్రీయ, లలిత సంగీతాలలో యీ రాగం చాలా ప్రాముఖ్యతను సంతరించుకుంది. ఆకాశవాణిలోను, చలన చిత్రాలలోను అనేక గీతాలకు యమన్ రాగంలో వైవిధ్యంగల బాణీ లెన్నిటినో స్వరకర్తలు మనకు అందిస్తూనే వున్నారు. శుభప్రదము, ఆనందదాయకముగా భావింపబడే కల్యాణి రాగం శాస్త్రీయ సంగీతంలో అధికశాతం భక్తి, శృంగారాలకు వినియోగించబడుతున్న విషయం మనకు తెలిసినదే. లలిత సంగీతం నవరసాలకు ఆలవాలము. వివిధరసాలకు సంబంధించిన అనేక గేయాలు మనకు నిత్యము తారసబడుతూంటాయి. కల్యాణి రాగం లలిత సంగీతంలో భక్తి, శృంగారాలకే కాక హాస్యము, కరుణ, వీరము, రౌద్రము మొదలగురసాలకు కూడా ఉపయోగించబడటం మనం వినే రకరకాల గీతాలలో గమనించవచ్చు.

"కోయిలా వనరాణీ" అనేది విరహ తప్త అయిన ఒక గోపిక పాడుకునే గీతం. శృంగారంలో సంభోగము, విప్రలంభము అని రెండు విభాగాలున్నాయి. ప్రియుడు గాని, ప్రియురాలుగాని దూరమైనప్పుడు చిలుకలను, చంద్రుణ్ని, చల్లగాలిని, వెన్నెలను, కోయిలను - యిలా మదనోద్దీపికమైన వస్తువులను దూషించే విస్తృత వర్ణనలు ప్రబంధాలలో ఎన్నో వున్నాయి. అలా కృష్ణునితో రసరమ్యకేళిలో తేలిన గోపిక మురళీధారిని కానక తన బాధను కోయిలకు వెళ్లబోసుకోవడం ఆచార్య తిరుమలగారి యీ సుందర గీతంలోని అంశం. యమన్ రాగంలో నేను యీ పాటకు కూర్చిన బాణీని శ్రీమతి శాంత ఎంతో భావయుక్తంగా గానం చేసింది.





ఆధునికాంధ్ర కవులలో ప్రముఖులైన ఆచార్య తిరుమల సుగుణవతీ శ్రీనివాసాచార్య దంపతులకు ద్వితీయ పుత్రుడుగా 1945లో రాజమహేంద్రవరంలో జన్మించారు. పెంటపాడు, ఏలూరు, విశాఖపట్టణాల్లో విద్యాభ్యాసం గావించి ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి M.A. పట్టా పొందారు. ప్రస్తుతం హైదరాబాదులోని చైతన్య కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్న ఆచార్య తిరుమల సుమారు 4 దశాబ్దాలనుండి వివిధ సాహితీ ప్రక్రియలను చేపట్టి తనదైన శైలిలో రచించిన ఎన్నో పద్య, గేయకావ్యాలు, నాటికలు, సంగీతరూపకాలు, వ్యాసాలు, నృత్యనాటికలు పలువురు పండితుల, రసజ్ఞుల మన్ననలు పొందినవి. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో వీరు రచించిన అనేక గీతాలు ప్రసిద్ధ స్వరకర్తలు సంగీతం కూర్చినవి తరచూ ప్రసారమవుతూనే వున్నవి. శ్రీయుతులు ఈమని శంకరశాస్త్రి, పెండ్యాల, సాలూరు రాజేశ్వరరావు, యస్.పి. బాలసుబ్రహ్మణ్యం వంటి ప్రసిద్ధులు తిరుమల గీతాలకు సంగీతం అందించారు. పి.వి. సాయిబాబా, ఉషాకాంత్, సుధీర్‌కుమార్‌ల స్వరరచనలతో వీరి గేయాలు ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ప్రసారమైనాయి. తిరుమల గీతాల నెన్నిటినో నేను స్వరబద్ధం చేయగా యీ మాసపు పాటలు గాను, సంగీత రూపకాలు గాను ఆకాశవాణి ప్రసారం చేసింది. వాటిలో "దేశము మీరై తేజము మీరై ఒకటిగ వుంటే చాలదా (బృందగీతం)", "ఏ గీము నేరీతిగ వినిపించెడు దాన (గానం: శాంత), "వెలిగించు శాంతి దీపం (గానం:చిత్తరంజన్), (మానవజీవనం మధుమాసం (గానం: శాంత)", "నయనాలకు సుందర బిందువు (గానం: సి. పద్మజ)" విస్తృత ప్రచారాన్ని పొందిన పాటలలో మచ్చుకు కొన్ని.

# డా॥ ఆచార్య తిరుమల



స్వరవల్లరి, పల్లవి, గీతాభాషిణి, రాగానందం, గేయనందిని - ఆచార్య తిరుమల గారి లలిత గీతాల సంపుటాలు. వీరి యితర రచనలు యమునాతటి, రాళ్ల గాజులు, చక్రార పంక్తి, స్వేచ్ఛా భారతి, తెలుగు తెమ్మెరలు, కవితా కళ, శ్రీరామ నామసుధ, వచన భగవద్గీత యిత్యాదివి ప్రచురితమైనాయి, ఇంకా అముద్రిత రచనలు ఎన్నో వున్నవి. ఆచార్య తిరుమల భారతదేశంలోని పలు ప్రాంతాలలోను, థాయ్‌లాండ్, మలేషియా, పెన్నాంగ్, సింగపూర్ (1983), ఉత్తర అమెరికా (1985), బ్యాంకాక్ (1988), జోర్డాన్, టర్కీ (1991) దేశాలలో పర్యటించి ఆ ప్రాంతాలలో తమ కవితా సౌరభాలను వెదజల్లారు. నిరంతరం తన రచనలతో తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం గావిస్తూ సుప్రసిద్ధ విద్వత్కవిగా వెలుగొందుతున్న ఆచార్య తిరుమలగారిని అనేక అవార్డులు, బిరుదులు వరించాయి. ప్రపంచకళా సంస్కృతుల సంస్థ (అమెరికా) వారి గౌరవ డాక్టరేట్ (డి.లిట్), రాయప్రోలు వంశీరత్న అవార్డు, కృష్ణశాస్త్రి అవార్డు మొదలగునవి, కవి కౌస్తుభ, సాహితీస్వరాట్, మధురకవి, సాహితీ సుధాకర వంటి బిరుదులు ఎన్నో వారు పొందారు. ఎంతోమంది

యువరచయితలను ప్రోత్సహిస్తూ వారి అభివృద్ధికి చేయూతనందిస్తున్నారు తిరుమల. నేను రచించిన లలిత సంగీత లక్షణ గీతాలను, రూపొందించిన లలిత సంగీత పాఠ్య ప్రణాళికను పలు సభలలో ప్రశంసించి వాటి ప్రాచుర్యానికి ఎంతో దోహదం చేసిన సహృదయులు. "శ్రీ చిత్తరంజనం'' అనే నా వాగ్గేయ సంపుటిని సునిశితంగా పరిశీలించి అందులోని నిగూఢమైన సంగీత సాహిత్య ఆధ్యాత్మిక విషయాలను సవివరంగా తెలిపి విలక్షణమైన వ్యాఖ్యానాన్ని అందించిన పండిత శ్రేష్ఠులు తిరుమలగారు. సౌజన్యమూర్తి డా॥ ఆచార్య తిరుమలగారు నాకు, మా కుటుంబ సభ్యులందరికీ అత్యంత ఆప్తులు, ప్రీతి పాత్రులు.

**16-31 జూలై 2002 "హాసం" సంచికలో యమన్‌రాగం ఆధారంగా కొన్ని తెలుగు చిత్ర గీతాలు పేర్కొనడం జరిగింది. ఈ సంచికలో యమన్‌రాగం ఆధారంగా కొన్ని హిందీ చిత్ర గీతాలు**

| పాట | చిత్రం | గానం | సంగీతం | |
|---|---|---|---|---|
| 1. మన్‌రే తూకాహెన | ధీర్‌ధరే | చిత్రలేఖ | రఫీ | రోషన్ |
| 2. కహీఁ దూర్ జబ్‌దిన్ ఢల్‌జాయే | ఆనంద్ | ముకేష్ | సలిల్ చౌదరి | |
| 3. జిందగీ భర్ నహీఁ భూలేగి | | | | |
| ఓ బర్‌సాత్‌కి రాత్ | బర్‌సాత్‌కీ రాత్ | రఫీ | రోషన్ | |
| 9. జానేకైసే సప్నోఁమే | అనురాధ | లత | పండిత్ రవిశంకర్ | |

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

**1941**

▷ముఖేష్ యాక్టర్- సింగర్‌గా "నిర్దోష్" సినిమాతో సినీరంగ ప్రవేశం. నళినీ జయవంత్ ఆయన పక్కన కథానాయిక. ఈ సినిమాకై అశోక్ ఘోష్ సంగీత దర్శకత్వంలో ఆయన పాడిన తొలిపాట "దిల్ హీ బుఝా హువా హో తో ఫస్ల్- ఏ- బహార్ కా" విషాదగీతమే! ముఖేష్‌కు విషాద గీతాలకు అనుబంధం అప్పటినుండే ప్రారంభమయిందనుకోవచ్చు.

▷"పరదేశి" సినిమాతో ఖుర్షీద్(గాయక నటీమణి) ప్రవేశం.

▷ఎస్.ఎస్.త్రిపాఠీ స్వంతంగా సంగీతం సమకూర్చిన "చందన్" విడుదలయింది.

**1942**

▷ గీతరచయిత భరత్‌వ్యాస్ 'దుహాయి'తో రంగ ప్రవేశం చేశారు. ఉర్దూ, హిందుస్తానీ పదాలతో పాటలు రాసే ధోరణికి విభిన్నంగా స్వచ్ఛమైన హిందీ పదాలు వాడుతూ అందమైన పాటలు రాసే ఒరవడి పెట్టారు భరత్‌వ్యాస్. ప్రదీప్, పండిట్ నరేంద్రశర్మ కూడా ఈవిషయంలో భరత్‌వ్యాస్ సహచరులే.

▷'ఖాన్‌దాన్' ద్వారా నూర్జహాన్ పరిచయమయింది ఆ తరువాత ఆమె గాయనిగా, నటీమణిగా ఉన్నత శిఖరాలను ఆరోహించింది.



సురయ్యా

▷ 'నయా దునియా'లో నౌషద్ ద్వారా సురయ్యా బాలగాయనిగా ప్రవేశం -'బూట్‌కరూఁమై పాలిష్ బాబూ' పాట పాడుతూ!

▷నూతన్,తనూజల తల్లి, కాజోల్ అమ్మమ్మ శోభనా సమర్థ్ వసంత్ దేశాయిని సంగీత దర్శకుడిగా పరిచయం చేసింది.

▷ 'జయక్కొడి','వనమోహిని' తమిళ చిత్రాలలో సంగీతం ఇచ్చాక మాస్టర్ భగవాన్ తీసిన 'సుఖీ జీవన్' చిత్రం ద్వారా సి.రామచంద్ర హిందీ చిత్రరంగానికి వచ్చారు. అత్యంత ప్రతిభావంతుడైన రామచంద్ర చిత్ర సంగీతాన్ని కొత్తపుంతలు తొక్కించారు. 'అన్నా సాహెబ్',రామ్ చితల్కర్' 'శ్యామూ' అనే వేర్వేరు పేర్లు పెట్టుకుని కూడా సంగీతాన్ని ఇచ్చారు. చితల్కర్ పేర్లతో పాటలు పాడటం, నటించడం కూడా జరిగింది.

▷ఆ కాలంలో ముస్లిమ్ కళాకారులెందరో హిందూపేర్లు పెట్టుకుని చిత్రరంగానికి వచ్చేవారు. దిలీప్‌కుమార్, మీనాకుమారి....ఇలా ఎందరో. అయితే ఓ హిందూ కవి తన అసలు పేరైన ఓంప్రకాశ్ భన్సాలీ అయితే 'ఖమర్ జలాలాబాదీ' అనే ముస్లిమ్ కలం పేరు పెట్టుకుని 'జమీందార్' సినిమాతో చిత్ర రంగానికి వచ్చారు. ఆయన తప్ప అలా చేసిన వాళ్లెవరూ ఆ తర్వాత కూడా కనబడరు! ఆపేరు కారణంగా ఓ నవాబ్ ఫ్యామిలీ నుండి పెళ్ళి ప్రపోజల్ వచ్చిందట కూడా!



ఖమర్ జలాలాబాదీ

రేడియోలోన్ ప్రతీనెలా ఒకటో తారీఖున ఉదయం 'ఖుష్‌హై జమానా, ఆజ్ పెహెలీ తారీఖ్‌హై' అనే పాట ప్రసారం చేస్తుంది. 1954నుండి ఈ సంప్రదాయం కొనసాగుతుంది. 'పహెలీ తారీఖ్' అనే సినిమాకై ఈ పాట రాసినది ఖమరే!

**1943**

▷గులాం మహమ్మద్ 'పాకీజా'(1971) ద్వారా ఈ తరం వారికి కూడా పరిచితుడు. ఆయన తొలిచిత్రం 'మేరా ఖ్వాబ్' రిలీజయినది ఈ సంవత్సరంలోనే. 'పన్‌ఘట్' సినిమాతో ఎస్.ఎన్. త్రిపాఠీకి మంచి పేరువచ్చింది.

▷బాంబేటాకీసు వారు తీసిన 'కిస్మత్' అన్ని విధాలుగా సూపర్‌హిట్. 'అనిల్ బిశ్వాస్ సంగీత దర్శకత్వంలో ప్రదీప్ గీతం' దూర్ హటో ఏ దునియా వాలో' ఆలపించి అమీర్‌బాయి కర్ణాటకీ ప్రసిద్ధురాలైంది. నటన మానేసి ప్లేబ్యాక్ మీద దృష్టి కేంద్రీకరించాలని నిర్ణయించుకుంది.



'కిస్మత్'లో దృశ్యం

▷'రామ్‌రాజ్య' ద్వారా మాన్నాదే వాయిస్ అందరికీ తెలిసింది.

▷ స్టార్ సింగర్ కానన్ దేవి 'చార్ దర్వేష్' తో పరిచయం.

▷కె.ఎల్.సైగల్ హిట్స్‌లో ఒకటైన 'తాన్‌సేన్' విడుదల.

▷ గ్రామ్‌ఫోన్ కంపెనీ లేబుల్స్ అయిన ఓడియన్, కొలంబియా, నేషనల్, మెగాఫోన్ హిందూస్తాన్‌లను 'గ్రామాఫోన్ కంపెనీ ఆఫ్ ఇండియా'(హెమ్.ఎమ్.వి. లేబుల్) తనలో కలిపేసుకుంది.

**1944**

▷ ఇద్దరు సంగీత కారులు కలిసి మ్యూజిక్ అందించటం తర్వాతి రోజుల్లో పరిపాటి అయింది. హుస్న్‌లాల్ - భగత్ రామ్ తొలి జంటగా పేర్కొనవచ్చు. వారు తొలి సారిగా సంగీత దర్శకత్వం వహించిన "చాంద్" ఈ సంవత్సరంలో విడుదలయి విజయం సాధించింది.



రఫీ

▷నౌషద్ సంగీత దర్శకత్వంలో "పహలే ఆప్" సినిమా ద్వారా మహమ్మద్ రఫీ చిత్రరంగానికి వచ్చారు. ఆ తర్వాత ఆయన సినీ సంగీతాన్ని ఎలా ప్రభావితం చేశారో వివరించనక్కరలేదు.

## జరిగిన కథ

అజయ్ అనే శ్రీమంతుడికి విజయ్ అనే నిరుద్యోగి తారసిల్లుతాడు. విజయ్‌కి తల్లిలేదు, తండ్రి రామదాసు అప్పులు చేసాడు, చెల్లెలి మీనా కాపురం చిక్కుల్లోపడింది. డబ్బుంటేఉండే కష్టాలగురించి అజయ్ చెప్తాడు. అతనికి బాల్యం లోనే తల్లిపోయింది, చదువుకై విదేశాలు వెళ్లినపుడు తండ్రిపోయాడని తెలిసితిరిగివచ్చాడు. ఎస్టేట్ మానేజర్ భానోజీయే పెత్తనం చలాయిస్తున్నాడు.... ఇలా ఒకరి కథలు ఇంకొకరు చెప్పుకున్నాక, ఒక సంవత్సరంపాటు ఇద్దరూ తమ తమ స్థానాలను మార్చుకుని, పరిస్థితులను ఎదుర్కొనాలని నిశ్చయించుకుంటారు. విజయ్ ఇంటికి వెళ్లిన అజయ్‌కు పొద్దున్న లేవగానే అప్పులవాడు వచ్చిపడ్డాడు.

(ఇక చదవండి)



# అన్నపూర్ణా వారి ఇద్దరు మిత్రులు

### సీరియల్ - నెం 5

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**

'ఏమిటోయ్, కూస్తున్నావ్! మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకో. నీక్కావలసింది డబ్బేగా? వుండు, నీ ముఖాన పారేస్తాను' అంటూ తన గదిలోకి దూకుడుగా వెళ్లాడు.



'మొకా నెందుకు? నేలమీద పడేయ్! ఏరుకుంటాను' అన్నాడు సెట్టి మండిపడి.

అజయ్, వంకెనవున్న షర్టుకేసి జేబులో చెయిపెట్టాడు - డబ్బుని ఏ చేత్తో ఎలా విసిరి కొడదామా అని ఆలోచిస్తూ, డబ్బులేదు అందులో.



'హ! డబ్బుండాలి ఏమైపోయింది' అన్నాడు జనాంతికంగా ఎవరి నడగాలో తేల్చుకోలేక.

రామదాసుగారు భళ్లున నవ్వాడు. 'హదా! తెల్లవారు ఝామున ఆ శ్రీరామచంద్రుడు నీ జేబులో డబ్బు చూపించాడు. ఇదిగో ఆ రాముల వారికి కైంకర్యం చేశాను' అన్నాడాయన మహదానందంతో.

అజయ్ తెల్లబోయాడు. మీనా తలవంచుకుంది బాధతో.



'ఒట్టి గొడ్డుకు అరుపులెక్కువని పెద్ద - జమిందారు బిడ్డలా రంకెలేశావే - రంకెలు' అంటూ షావుకారు 'విజయ్' మీదికి విరుచుకుపడ్డాడు.

జమీందారు బిడ్డకి ఉవ్వెత్తున కోపం వచ్చింది. ముఖం ఎర్రబడింది.

'నోర్మూయ్. అతిగా మాట్లాడావా పళ్లు రాలగొడతాను' అన్నాడు చెయ్యిఎత్తి.

'ఆ! పళ్లు రాలగొడతావేం' అన్నాడు షావుకారు. కాని జోరు తగ్గింది. అతనూ ఓ అడుగు వెనక్కేశాడు. గబుక్కున తన నోట్లోని 32 పళ్లసెట్టూ తీసి చేత పట్టుకున్నాడు ఎందుకేనా మంచిదని.



'ఏదీ? కొట్టు, కొట్టు, కొట్టు చూద్దాం కొట్టు' అంటూ బోసి నోటిని ప్రకటించి ఇకిలించి వీధి గుమ్మంవేపు సాగాడు.

'కొట్టేవాడు ఎవడు! కొట్టించేవా డెవడు! ఆ శ్రీరామచంద్రుడి ఆజ్ఞలేందే చీమేనా కుట్టదు. నువ్వుపో... పో' అన్నాడు రామదాసుగారు.

'పోతా పోతా, ఊరికే పోతాననుకున్నావా? నీ కొడుకు చేసిన అవమానానికి, వారం రోజుల్లో వారంటుతెచ్చి నిన్ను జెయిలుకి పంపకపోతే పేరు మార్చుకుంటాను' అంటూ ఇక కాలయాపన తగదని షావుకారు హడావుడిగా వెళ్లిపోయాడు.

'ఏడిశావ్' అన్నాడు అజయ్..



'వాడుకాదురా, నువ్వు చేసిన ఘనకార్యానికి రేప్పొద్దున వాడు వారంటు తెస్తే. నేను జైయిల్లో పడి ఏడుస్తుంటాను. మీరిద్దరూ నంతోషిద్దురుగానీ' అన్నాడు రామదానుగారు తేలిగ్గా నెత్తి కొట్టుకుంటూ.

'లేకపోతే ఏమిటి నాన్నా! ఊరంతా

అప్పులు పెట్టుకొని, ఉన్న డబ్బు యిలా తగలేస్తే ఎట్లా' అన్నాడు అజయ్ ఆయన ధోరణికి చిరాకుపడి.

'అపచారం, అపచారం!' అంటూ విస్తుబోయాడు రామదాసుగారు గదిలోకి పోతున్న కొడుకువంక చూస్తూ. 'అమ్మాయ్ మీనా! వీడు మీ అన్నయేనా? ఉన్నట్టుండి ఇలా మారిపోయాడు' అన్నాడు.

అమ్మాయికూడా మారినట్టే ఉంది. ఆమెకూ సానుభూతి ఉన్నట్టులేదు.

'అన్నయ్య మాత్రం ఏం చేస్తాడు? ఇంటి పరువిలాపోతుంటే...' అంది తల, పెడగా తిప్పుకొని.

'అన్నావూ? నువ్వూ నన్నే అన్నావూ! అను... ఆపద్బాంధవా! అనాధరక్షకా! ఆర్తత్రాణపరాయణా! వింటున్నావుగా నీ భక్తుడు పడుతున్న మాటలు!...' అన్నాడు పైవాడికేసి చూసి. అయినా ఏం పలికినట్టు లేదు.



ముసలిప్రాణం చాలొచ్చింది. 'అమ్మాయ్ మీనా! అరిచి అరిచి నా పీక ఎండిపోయింది. కాస్త కాఫీ నీళ్లు యిస్తావూ!' అన్నాడాయన కుర్చీలో కూలబడుతూ.

'ఎక్కడినించి తెమ్మంటావ్? కాఫీ పొడికని డబ్బులిస్తే, నువ్వు ముక్కుపొడి తెచ్చుకున్నావుగా'

దాసుగారు ఆర్తనాదం చేశారు.

'కాఫీ పొడి లేదూ?... ఊఁ ఈ చివరిరోజుల్లో రామా, రామా అనుకోవలసినవాడిని, కాఫీ, కాఫీ అని అరిపిస్తున్నారు. మీ అమ్మే వుంటే నాకీ అవస్త ఉండేదా?' అంటూ కళ్లనీళ్లు వత్తుకో సాగాడాయన.

కూతురుకు జాలి వేసింది. 'ఎందుకునాన్నా! అలా బాధపడతావ్! ఇంటి పరిస్థితి ఇలా వుంది. ఏం చేస్తాం!'' అంది.

'సరే, ఆ ధనియాల కాఫీ అయినా తగలబెట్టు' అన్నారు రామదాసుగారు.



ఓ పదినిమిషాల తరువాత, మీనా కాఫీ తీసుకొని అన్నయ్య గదిలోకి వెళ్లింది. జమీందారుబిడ్డ, ఇంకా ధుమధుమలాడుతున్నాడు. మీనాని. కాఫీని చూసి శాంతించి, గ్లాసందుకుని గుటక వేసి కెవ్వుమన్నాడు. ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు. ఎంత ప్రేమతో యిచ్చినా, ధనియాల కాఫీ ధనియాల కాఫీయే...



'ఏమిటన్నయ్యా?' అంది మీనా

'వచ్చి కషాయంలా వుంది' అన్నాడు అజయ్ - లోగడ తన ముఖారవిందం చాలా శక్తివంతంగా ప్రకటించిన భావాలకు భాష తొడుగుతూ.

'ఏం చేస్తాం అన్నయ్యా! కాఫీపొడి లేదు, ధనియాల కాఫీ'

'పోనీ కాస్త పంచదారన్నా వెయ్యి.'

'పంచదార కెక్కడికి వెళ్లేదన్నయ్యా! ఉండు, కాస్త బెల్లం తెస్తాను' అంటూ లోపలికి వెళ్లింది మీనా.

'బెల్లం!' అన్నాడు అజయ్‌బాబు.

పేదజీవితం ప్రివ్యూ పరగడుపునే కనబడిపోయింది!.

×---×---×

తేడా ఒక్కటే. అక్కడ తన యింట్లో కోరికలన్నీ తీరుతున్నాయని కాదు అక్కడ అన్నీ వుంటాయి. కంటిక్కనిపిస్తాయి కాని తినబోతే అందవు. తిననివ్వరు. పేదవాడు పగటికలలో ఊహించి చూసుకునే తినుబండారాలు వాడి కెంత అందుతాయో; తనకు అవీ అంతే.

తన పాత్ర ధరించి, కడుపారా అన్నీ తినాలని ఆశపడి వెళ్లిన విజయ్‌కుమార్ రోజూ లాగే అక్కడా మాడతాడని గుర్తుకొచ్చి నవ్వుకున్నాడు అజయ్.

విజయ్ పరిస్థితి అక్షరాలా అలాగే ఉంది. స్నానం చేసి, కింద డైనింగుహాలు కొచ్చాడు. ఫలహారాల బల్ల పగటికలలా, సినిమాలో సెట్టింగులా కన్నుల విందుగా కనిపించింది. కడుపుకు విందు కూడా కానిద్దామని ఉత్సాహంతో ముందుకు లంఘించాడు విజయ్ - 'పూర్ ఫెలో' అజయ్ ఈపాటికి ధనియాల కాఫీతో తిప్పలు పడుతూంటాడనుకుంటూ.

మూగ వెంకన్న అడ్డు దూకాడు. ఏవో సౌంజ్ఞలు చేశాడు. తినొద్దని టూకీగా వాటి తాత్పర్యం.

'ఏమిటీ గొడవ? ఏమంటావు.' అని విసుక్కున్నాడు విజయ్‌కుమార్ వాడు మూగవాడని తెలీదు. వెంకన్న వెంటవుండి తోడుపడుతున్న కూతురు లచ్చి - వివరించింది. వెంకన్న మూగసౌంజ్ఞలకు అర్థాలు చెప్పగల దుబాసీ - ఆ పిల్లే.

'దొరా, మీరంట జెరసేపు ఓపిక పట్టుండి. డాక్టరయొచ్చి పరీక్ష చేసినంక, సూదేయిస్తడో, గోలియే యిస్తడో మరి - ఆయన వోయినంక పలారంగిన జేతురుగని'.

'అవునవును. అదో తతంగం వుందిగదూ' అన్నాడు విజయ్ అది అప్పుడే గుర్తుకొచ్చినట్లభినయించి.



డాక్టరు గారూ, సరళా వచ్చేశారు.

'గుడ్‌మార్నింగ్, మిస్టర్ అజయ్!'

'నమస్తే అజయ్‌బాబూ! రోజూకంటె బ్రేక్‌ఫాస్టుకి పెందరాళే వచ్చేశారే' అంది సరళ.

విజయ్ ఆ పిల్లని చూసి, హడావుడిగా ఆనందపడిపోయి, మిగతా ఒకటి రెండు క్షణాలలోనూ ఎవరీపిల్ల అని తికమకపడ్డాడు. అజయ్‌బాబు, ఇంత చక్కని పిల్ల ఒకర్తె వుందని చెప్పలేదు. తనకి చెల్లెలు లేదని వాపోయాడు గాబట్టి ఈ పిల్ల బంధువై వుండదు. ఎవరైతేనేం? చక్కదనాల పిల్ల! చక్కదనాల కళ్లు. అలా అనుక్షణం నవ్వుతూ ఉంటాయి కాబోలు! కళ్లనిబట్టి అయితే, మీనాక్షి అనో, సులోచన అనో పిలవాలి!... మాటకూడా ముద్దులొలుకుతోంది.

పరస్త్రీని అటేసేపు కన్నెత్తి చూడడం ఒంటికి మంచిది కాదని, డాక్టరును చూసి కొంతసేపు ఆనందిద్దామని దృష్టి మరల్చుకున్నాడు.

'ఎలా వుంది యివాళ. రాత్రి నిద్రపట్టిందా?' అన్నాడు డాక్టరు.

'ఓ, బ్రహ్మాండంగా పట్టింది' అన్నాడు విజయ్ - మళ్లీ ఆ పిల్లకేసి చూసి నవ్వుతూ. ఆ పిల్లా తనకేసే చూస్తోంది. తనంటే తను కాదు. అజయ్‌బాబు... 'అతని' చక్కటి విశాల నేత్రాలనూ, నవ్వినపుడు బుగ్గమీద లీలగా మెరిసే అందమైన సొట్టనూ చూసి ఆనందిస్తోంది కాబోలు అనుకున్నాడు.



'యస్. యస్. అందుకే మొహం బ్రైట్‌గా వుంది. ఏదీ నాలిక చూపించండి. వెరీగుడ్. మంచి ఇంప్రూవ్‌మెంట్...' అంటున్నాడు డాక్టర్ ఆనందపడిపోతూ.

రోగుల నాలుక చూసి పరగడుపుని వాటి అందాన్ని

మెచ్చుకోవాలి కాబోలు వీళ్ల సౌందర్యాభిరుచి...

'ఆకలి ఎలావుంది?'

'దంచేస్తోంది... విపరీతం అనుకోండి. మూడురోజులయి తిండిలేదోమో... అన్నంత ఆకలి' అన్నాడు విజయ్ ఆశతో, ఆకలితో, ఉత్సాహంతో.

సరళ కిలకిల నవ్వింది. 'అంత ఆకలిగా వుందా అజయ్‌బాబూ నిన్నటిదాకా ఆపిలుముక్క చూచినా అసహ్యం అన్నారు?'

విజయ్‌కి తనతోటి నటుడు అజయ్‌మీద ఉవ్వెత్తున కోపం వచ్చింది. తనకిష్టం లేకపోతేమటుకు, ఓ రెండ్రోజులపాటూ తిండియావ ఉన్నట్టు నటించి ఉండరాదూ... ఇప్పుడు అతని తిక్కలన్నీ తనకి ఉచ్చులయి కూర్చున్నట్టున్నాయి. మాడ్చి చంపేస్తారు కాబోలు వీళ్లంతా...

'ష్యూర్ ష్యూర్. నేనిచ్చిన మెడిసన్ అలాంటిది' అంటున్నాడు డాక్టరు సగర్వంగా, తృప్తిగా.

'అవును డాక్టర్. ఆ టానిక్కుందే రెండు మోతాదులు తాగేసరికి మిమ్మల్ని కూడా తినెయ్యాలన్నంత ఆకలి' అన్నాడు విజయ్ - డాక్టరు స్తుతి ఆరంభిస్తూ.



'టానిక్! వాట్ టానిక్? నే నిచ్చింది టాబ్లెట్స్ కదూ?'

పప్పులో కాలేసిన విజయ్ గబుక్కునిసర్దుకుని, 'ఐ మీన్ అవే. వాటినే నీళ్లలో కలిపి టానిక్ చేసి తాగేశాను. ఇక చూడండి ఒకటే ఆకలి' అన్నాడు కళ్లువిప్పార్చి ఆ వైనానికి అభినయం పడుతూ.



డాక్టరుకు నిజంగానే సౌందర్యదృష్టి వుంటే, అమాయికంగా ఆశగా చూస్తున్న ఆ కళ్లకీ, బహుమతిగా ఎయిటీన్ కోర్సు డిన్నరొకటి మంజూరు చేసేవాడే కాని, ఆయన గోల ఆయనది.

'ష్యూర్ ఆకలి మంచిదే' అన్నాడు. కాని ఒక్కసారిగా అన్నీ తినకూడదట... ఆయన మొహం... ఇంకా రెండ్రోజులు అబ్జర్వేషన్‌లో ఉంచాలి... ఉండు బిల్లు పంపినపుడు నీ పని చెప్తా అనుకున్నాడు విజయ్ కోపంగా...

'సరళాదేవి, మీరు కొంచెం చూస్తూ ఉండండి. ఇప్పటికి ఒకే ఒక టోస్ట్; రెండే రెండు ఆపిల్ ముక్కలూ, బస్, అంతే'.

కళ్లప్పగించి, ఈ తీర్పును వింటున్న విజయ్, ఎగిరినంతపని చేశాడు 'అదేమిటి డాక్టర్, ఇంత ఆకలిగా ఉంటే-' అన్నాడు దీనంగా. అవును మరే అన్నాయి అతని కళ్లు.

'నోనో. అమిత ఆకలి అజీర్ణ లక్షణం. మీకున్నదే క్రానిక్ డిస్పెప్సియా... రేపు మళ్లీ చూదాం... నాకు టైమయింది వస్తాను' అంటూ వెళ్లిపోయాడు డాక్టర్.

'అదృష్టవంతుడు కాబట్టే అలా గబగబా వెళ్లిపోయాడు' అనుకున్నాడు విజయ్... విజయ్ కోపంగా చూసిన చూపుకి, తన కోటు వెనకభాగం చిల్లులు పడిపోయిందని, డాక్టరు చూచుకున్నట్టు లేదు.

విజయ్, కలగాంచి మేల్కొంచినట్టు ముందుకు వంగి అతి సహజమైన భంగిమలో పెద్దపళ్లెం - కంటికి నదరుగా ఉన్నది ముందుకు లాక్కున్నాడు.



'గాజుల చేతులు - వాటి అందచందములు' అనే విషయంపై మాట్లాడితే, విజయ్ కుమార్ అభిప్రాయాలు ఎలా వుండేవో తెలియదు గాని, ఆ క్షణంలో తను ముందుకు లాక్కున్న ప్లేటుని, వెనక్కి లాగేసిన గాజులచెయ్యి అతని కేమీ నచ్చలేదు.

'భలేవారే! డాక్టరు చెప్పిందేమిటి. మీరు చేస్తూందేమిటి?' అంది, ఆ చెయ్యి తాలూకు యజమానురాలు మనోహరంగా నవ్వి.

మరో సమయంలో అయితే విజయ్ ఆ చక్కని ముఖాన్ని, సోగకళ్లనీ, చిలిపి చూపుల్నీ, బెంటెక్స్ ముత్యాలపేటనీ, దానికి ఉపమానంలా మెరిసిపోతున్న పలువరసనీ, చిరునవ్వుల్నీ, వాటి వెలుగుల్నీ చూసి ముగ్ధుడై అజయ్‌బాబు అనుమతి అడిగి, కన్నులవిందుగా అలా చూస్తూ కూర్చోబడిపోయేవాడే. కాని, ఆ ముహూర్తం ఆకలి ముహూర్తం. కన్నులవిందుకన్న అర్జెంటయిన విందు, ముందు జరగాలి. అందుకని ప్లేటుమీద దృష్టివుంచి, ఆమె చెంపల్లావున్న ఆపిల్ కాయలనీ, ఆ చెంపల్లోని కెంపుల్లాంటి దానిమ్మగింజలనీ, మెత్తని తెల్లని వెన్ననీ, ఎర్రగా తన ఆకలిలా కరకరలాడుతున్న రొట్టె ముక్కనీ ఆప్యాయంగా చూసి, పళ్లెం ముందుకు లాక్కున్నాడు.

'డాక్టరు గారు తమకు చెప్పిందేమిటి? చూస్తూవుండమనేగా? అలా చూస్తూనే వుండండి' అన్నాడు గడుసుగా.

'సరే' అంది సరళ.

అంటూనే, ఆ ప్లేటులో తినుబండారాలన్నీ తీసేసి, రొట్టెముక్క మాత్రం మిగిల్చి, 'చూస్తూనే ఉంటాను తినండి' అంది ఇంకా గడుసుగా.

విజయ్‌కి నీరసం, నిస్పృహకూడా కమ్ముకొచ్చాయి. ఇక లాభం లేదని, ఆ ఒక్క రొట్టెముక్కకి అతి ప్రేమగా, శ్రద్ధగా వెన్నపట్టించడం మొదలుపెట్టాడు అంగుళం మందాన.



'నమస్తే అజయ్‌బాబూ'.

విజయ్ తలెత్తి చూశాడు. కొత్త కారెక్టరు కాబోలు... మానేజరు అయుండాలి, దేవాంతకుడులా వున్నాడు...

దేవాంతకుడు, వాత్సల్యం ముఖాన దట్టంగా పులుము కున్నాడు. ఊడిపోతుంది...

'అదేమిటి సరళా! అలా చూస్తూ వూరు కుంటా వేమిటమ్మా, కాస్త వెన్నరాయక... జాగ్రత్తమ్మా బాగా రాయి. నువ్వు దగ్గరుండి అవన్నీ చూసుకోవద్దూ?' అన్నాడు ఆపేక్ష ఎడాపెడా విరజిమ్ముతూ.

గొప్ప ఇళ్లలో అపేక్ష, రొట్టిమీద వెన్నలా పూస్తారు కాబోలు అనుకున్నాడు విజయ్. సామ్యం ఏడిసినట్టుందని తక్షణం అనుకున్నాడు.

'చూస్తూవుండగానే మీరు వచ్చారు నాన్నా... ఇలా యివ్వండి అజయ్‌బాబూ' అంటూ, రొట్టె లాక్కుంది సరళ.

వెన్నరాసే నెపంతో తలవంచుకు కూర్చునే అవకాశం పోయింది విజయ్‌కి. మానేజరుకేసి చూసి నవ్వి, రొట్టి కేసి చూశాడు.

భానోజీగారు కుర్చీ లాక్కుని కూర్చున్నారు.

'ఇవాళ ఫ్యాక్టరీ జీతాలరోజు, అజయ్‌బాబూ! నిన్ననే మనవిచేశాను...' అన్నాడు.

'అవునవును, జ్ఞాపకం వుంది' అన్నాడు విజయ్, ఆ వాక్యానికి అభినయంపట్టి.

'చెక్కుబుక్కు తీసికొచ్చాను. మీరు సంతకం పెట్టేస్తే, బాంక్‌లోంచి డబ్బు డ్రా చేస్తాను' అంటూ చెక్కుబుక్కు తీసి బల్లమీద పెట్టాడు భానోజీగారు.

చిక్కే... ఎదురుచూడని చిక్కు...

తనకి అంత అద్భుతమైన సమయస్ఫూర్తి వున్నట్టు విజయ్‌కి ఆనాటివరకూ తెలియలేదు. అవకాశంలేక రాటవుతున్నాం గాని, అమెరికాలో వుండాల్సినవాళ్లం అనుకున్నాడు ఉపాయం తోచగనే. 'అలాగే, చెక్కు రాయండి' అని దర్జా నటిస్తూ, విలాసంగా వంగి బల్లమీద ఆపిల్ ఒకటి అందుకుని, పక్కనేవున్న చాకుతీసుకుని దాన్ని కొయ్యడం ఆరంభించాడు. తన జీవన్నాటకంలో తొలినాటకం బ్రహ్మాండమైన 'కోతతో' ఆరంభం అవుతూంది... తన ప్రేక్షకులిద్దరూ తనకేసి చూడని క్షణం చూసి, కసుక్కున కుడిచేతి బొటనవ్రేలు తెగకోసుకున్నాడు విజయ్, కత్తి, పండు బల్లమీద పడేసి 'అబ్బా' అన్నాడు బాధగా.





'అరెరె! ఎంతవని జరిగింది?' అన్నాడు, భానోజీగారు కంగారుగా.

'అయ్యో ఎంత రక్తం వస్తోందో' అంటూ, సరళ తన చెంగుని విజయ్ వేలికి చుట్టింది.

'నాన్నా, డాక్టరుకి ఫోన్ చెయ్యి నాన్నా'. భానోజీగారు లేచారు.

'మరీ... చెక్కు?'' అన్నాడు, విజయ్ అమాయకంగా చూసి.

'అమ్మమ్మ. ఆ చేత్తో సంతకం ఎలా చేస్తారు? ఏదో సర్దుబాటు చేస్తాలెండి... అమ్మా సరళా! నేనిప్పుడే డాక్టరును తీసుకొస్తాను జాగ్రత్త' అంటూ హెచ్చరించి పరుగెత్తాడాయన.

ఒక బాధ తప్పాలంటే, ఇంకో బాధ తెచ్చిపెట్టుకోడం ఒక పద్ధతి అన్న నీతిని నేర్చుకుంటూ ఆనందిస్తున్నాడు విజయ్.

'అయ్యా పెద్దమ్మగోరు తమర్ని రమ్మంటున్నారండి' అంటూ పనిమనిషి లచ్చి వచ్చింది.

'వస్తున్నా పద' అంటూ విజయ్ లేచాడు. ఇంతవరకూ నాటకం బ్రహ్మాండంగా సాగింది. జయప్రదం అయినట్టే. అత్తయ్య ఎవరో, ఎలాటిదో... కళ్లు కనబడవు కాబట్టి ఫరవాలేదు. వెయ్యికళ్లున్న మానేజరు, కంటికి రెప్పలా చూచుకునే వెంకన్న, ప్రేమించి (?) బహుశా పెళ్లాడబోతున్న సరళ - ఇంతమందిలో ఒక్కరూ తనని శంకించలేదు.

నవ్వుకుని ముందుకు సాగాడు విజయ్, గర్వంతో, వేలు, వేలుకు చుట్టుకున్న చెంగూ, చెంగును చుట్టుకున్న సరళ ఒక్క కుదుపుతో ముందుకుసాగి ఆగడం జరిగింది. సరళ తన పైట వెనక్కి లాక్కుంది. విజయ్ తన చెయ్యినీ, చెంగునీ, చెంగువెనక చిన్నదాన్నీ వరుసక్రమంలో చూశాడు. చిన్నది సిగ్గుపడింది.



'సారీ! ఇప్పటినించీ కొంగున కట్టుకోవాలంటే ఎలా? వదలండి ప్లీజ్' అంటూ, తన వేలికి చుట్టిన చెంగును విప్పేశాడు. చేరుమాలు తీసి చుట్టుకున్నాడు.

'చాల్లెండి, హాస్యం!' అంది చిన్నది మరింత సిగ్గుపడి.

అజయ్‌కి థాంక్స్ చెప్పాలనుకుని, తప్పు తెలిసి, అసూయపడ నిశ్చయించుకుని 'అత్తయ్య' గదివేపు బయల్దేరాడు విజయ్.

(ఇంకావుంది)

---

''ఇద్దరు మిత్రులు'' చిత్రంతో తొలిసారిగా అన్నపూర్ణలో కాలుపెట్టారు సంగీత దర్శకుడు ఎస్. రాజేశ్వరరావు. తెలుగు ప్రేక్షకుల శ్రోతల గుండెల్లో మధుర స్మృతులుగా మిగిలిపోయే రసగుళికల వంటి పాటలకు ప్రాణ ప్రతిష్ఠ చేసారాయన. అది నుండీ సంగీతం విషయంలో ఉన్నత ప్రమాణాలు సృష్టించిన అన్నపూర్ణ సంస్థకు ఈ చిత్రంలోని పాటలు అజరామరమైన కీర్తి ప్రతిష్ఠలను తెచ్చి పెట్టాయి. ఈ రోజుల్లో ఉన్న గోల్డెన్ డిస్కులు, ప్లాటినమ్ డిస్కులు ఆ రోజుల్లో ఉండి ఉంటే ఈ చిత్రం సాధించే రికార్డులను అధిగమించడం ఎవరి తరమూ కాదు.



యస్. రాజేశ్వరరావు

ఈ చిత్రంలోని పాటల గురించి చెప్పేముందు అన్నపూర్ణ సంస్థలో శ్రీ యస్.రాజేశ్వరరావు అడుగిడిన వివరాల గురించి ప్రస్తావించాలి. అన్నపూర్ణ పిక్చర్స్ అధినేత దుక్కిపాటి మధుసూదనరావు మొదట్నుంచీ రాజేశ్వరరావు అభిమాని. గాయకుడిగా రాజేశ్వరరావు పాడిన సోలో గీతాలు, సంగీత దర్శకుడిగా స్వరపరిచిన లలితగీతాలు వీటన్నిటి కలక్షన్ గ్రామ్‌ఫోన్ రికార్డులుగా మధుసూదనరావుగారి దగ్గర పెద్ద మొత్తంలో ఉండేవి. తమ తొలి చిత్రంకే సంగీత దర్శకుడిగా యస్.రాజేశ్వరరావుగారిని అనుకున్నారు గానీ ఆయన ట్రబులిస్తారని కొంతమంది చెప్పటంతో అప్పటికి ఆ ప్రయత్నాన్ని మధుసూదన రావుగారు విరమించుకున్నారు.



దుక్కిపాటి
మధుసూదన రావు

'వెలుగు నీడలు' తీసే సమయంలో రాజేశ్వరరావుగారి గురించి విపరీతంగా ప్రయత్నించారాయన. ప్రసిద్ధ నిర్మాత, దర్శకుడు బి.ఏ. సుబ్బారావు చెబితే రాజేశ్వరరావు వింటారని తెలుసుకున్న మధుసూదనరావుగారు ఆయనతో కూడా కబురు పంపించారు. అదిగో వస్తానని, ఇదిగో వచ్చేస్తున్నానని అనడమేగాని ఒక్కరోజు కూడా రాలేదు రాజేశ్వరరావు. అనుకున్న సమయానికి అన్నిటినీ పూర్తిచేసే అలవాటున్న మధుసూదనరావుగారు ఆ సినిమాని రాజేశ్వరరావు లేకుండానే పూర్తిచేసారు. ఆ తరువాత ఓ సందర్భంలో ఆయన కనబడినపుడు అడిగారు - ''ఏంటి రాజేశ్వరరావ్‌గారు... మీరొస్తానని రావటంలేదు. ఏమిటి ప్రాబ్లమ్!?'' అని. దానికాయన ''అది కాదండీ... మధుసూదనరావుగారు చాలా స్ట్రిక్ట్ మనిషి. టైమ్‌కి వెళ్లకపోతే కోప్పడతారు. కొడతారు కూడా అంటూ మా ఆర్కెస్ట్రావాళ్లు నన్ను తెగ భయపెట్టేశారండీ'' అని అన్నాడు. ''కొట్టడం ఏంటండీ బాబూ!?'' అంటూ పకపకమని నవ్వారు మధుసూదనరావు- కోప్పడడం మాత్రం ఉంటుందన్న విషయాన్ని చెప్పకనే చెబుతూ...! అలా మొదలైన వారి బంధం వరసగా ఎన్నో ఏళ్లు కొనసాగింది. అంతే కాదు యస్.రాజేశ్వరరావు తన సినీ సంగీత జీవిత పయనంలో ఎక్కువ చిత్రాలకు పనిచేసింది అన్నపూర్ణా సంస్థకే.

# "పాపం! సుబ్రావ్"

సుబ్రావ్ ఒక మధ్యతరగతి కుటుంబీకుడు. జూనియర్ కాలేజీలో క్లర్కుగా పని చేస్తున్నాడు. మూడేళ్ల క్రితమే పెళ్లయింది. పిల్లలు ఇంకా లేరు. పిల్లల విషయం తర్వాత ఆలోచిద్దామనుకుని స్నేహితుల సలహామేరకూ, భార్యతో ఆలోచించుకునీ జాగ్రత్తపడుతూ వచ్చాడు. మనిషి చాలా మంచివాడు. కానీ రోడ్డుమీద అప్పుడప్పుడు తూలుతూ నడుస్తుంటాడు. (తూలుతుంటాడంటే త్రాగుబోతు కాదండోయ్. మన వాడికి దురలవాట్లు ఏమీ లేవు) తూలడమే కాదు పడిపోయి, స్పృహ తప్పిపోయిన సంఘటనలు చాలా వున్నాయి. చాలా మం(చి)ది డాక్టర్లు ట్రీట్ చేసారు కానీ, అదేం దురదృష్టమో ఫలితం లేదు. ఈ విషయంలో ఎక్కువగా ఆలోచిస్తూంటాడు మన సుబ్రావ్.




## సోమయాజుల సాయిప్రసాద్

**పోస్టు ఒనక ఢిల్లీ - 764042**
**(జిల్లా) కోరాపుట్, ఒరిస్సా.**




ఒక రోజు ఆఫీసులో తనపని చేసుకుంటున్న సుబ్రావ్‌కు ప్రక్కనున్న తన కొలీగ్ మధు ఏదో పత్రిక చదువుతూ పెద్ద గొంతుతో, "ఎంత తలనొప్పయితే మాత్రం, మాత్రలు వాడాలి కానీ, దీనికి కూడా పత్రికల్లో మారు పేరుతో ప్రశ్నిస్తాడా. బుద్ధిలేక పోతే సరి" అన్న మాటలు విన్పడ్డాయి.

సుబ్రావ్ ఎప్పుడూ పత్రికల జోలికి పోడు. (అతని దృష్టిలో పత్రికలు కొనడం కూడా, ఒక దురలవాటు లాంటిదేమో!) విషయం ఏమిటా అని కుతూహలం ఎక్కువయి అదేమాట మధుని అడిగాడు. అప్పుడప్పుడు స్పృహ తప్పి పోతుంటాడని సుబ్రావ్‌ని ''నీరసప్రాణి'' అని ఆటపట్టిస్తుంటాడు మధు. ఈ పత్రికల విషయం కూడా తెలియదన్న

విషయం తెలిసాక మధు దృష్టిలో మరో మెట్టు దిగజారి పోయాడు పాపం సుబ్రావ్.

అదే ఆనందంతో "మరేం లేదండీ! ఎవరికయినా ఏవయినా ఆరోగ్య సమస్యలు, ఆర్థిక సమస్యలు ఎలాంటివయినా సరే, పత్రికా ముఖంగా పరిష్కారాలు కోరుకుంటూవుంటారు. కాకపోతే తమ బంధువులకు తెలియకుండా వుండటానికి మారుపేర్లతో, షార్ట్ నేమ్స్‌తో ప్రశ్నిస్తుంటారు కొందరు" అని దీర్ఘవుపన్యాసమిచ్చిన వాడిలా ఫోజు పెట్టాడు మధు.

ఇది విని, తనుకూడా మారు పేరుతో ఈ శీర్షికలో పాల్గొంటే బాగుండుననిపించి ఆ పత్రిక అడిగి తీసుకుని సాయంత్రం వరకూ స్టడీ చేసాడు సుబ్రావ్. శీర్షిక నిండా సమస్యలే! ఆ సమస్యల శీర్షికే ప్రత్యేక ఆకర్షణగా కలిగిన ఆ పత్రిక పేరు "మీ కోసం" లైంగిక సమస్యలున్నవాళ్లు షార్ట్ నేమ్స్‌తోనూ, కోర్టు వ్యవహారాలూ, కుటుంబ సమస్యలున్నవాళ్లు పూర్తి పేర్లతోనూ, (మారు పేర్లయివుంటాయి లెండి)- కొందరయితే ఆ రూలే పాటించటం లేదు. ఆ పూర్తి పేర్లు ఏవీ సొంత పేర్లయి వుండవన్న విషయం మధోపన్యాసంలో విన్నాడు సుబ్రావ్.

వెంటనే తన సమస్యను (అదే... నీరస సమస్యను) కాగితం మీద పెట్టి, మారుపేరును ఏం పెడదామా అని ఆలోచించి, చించి తనను 'నీరసప్రాణి' అని ఏడిపించే మధు పేరు పెట్టాడు. ఊరి పేరు గురించి ఆలోచిస్తే అత్తారి ఊరు కొత్తపల్లి గుర్తుకు వచ్చింది. 'మధు, కొత్తపల్లి' అని రాసి పంపేశాడు.

అప్పటి నుండి పక్షపత్రిక అయిన "మీకోసం" క్రమం తప్పకుండా చదువుతూండేవాడు. (కొనకుండా, లైబ్రరీకి వెళ్లన్నమాట) ఎన్నాళ్లు గడిచినా తన సమస్యకు పత్రికాముఖంగా ఎటువంటి పరిష్కారం కన్పించలేదు సుబ్రావ్‌కు.

ఒక రోజు ఇంటికొచ్చే సరికి భార్య రౌద్రముఖంతో "ఇన్నాళ్లకు మీ రంగు బయట పడిందండీ! నా దగ్గర యీ విషయం దాచారన్నమాట" అంటూ అపర కాళిలా విరుచుకు పడింది. సుబ్రావ్‌కు మారు మాటకు తావీయకుండా, అతని సమాధానం విన్పించుకోకుండా తన ధోరణిలో తను తిట్లవర్షం కురిపిస్తోంది.

## కమాల్ ప్రశ్న - ధమాల్ కార్టూన్




**నగ కాని నగ?**

**వేరుశెనగ.**

అసలే నీరసప్రాణి అయిన సుబ్రావ్ మరింత నీర్సపడిపోయి, ఆమెకు సమాధానం చెప్ప(లే)క బయటకెళ్లి పోయాడు.

రాత్రి పది తరవాత ఇంటికి చేరేసరికి భార్య గాఢనిద్రలోవుంది. తిట్టి తిట్టి అలిసిపోయిందని సమాధాన పడిన సుబ్రావ్‌కు ఆమె భోజనం కూడా చేసేసిందని డైనింగ్ టేబుల్ మీద పదార్థాలు చెప్పాయి. తనుకూడా భోజనం చేసాడే కానీ, చేస్తున్నంత సేపూ ఆమెకు యీ విషయం ఎలా తెల్సిందా అని ఆలోచిస్తూనే వున్నాడు.

ఫోన్ రింగవటంతో హాల్లోకొచ్చాడు సుబ్రావ్. రిసీవరెత్తాక సమాధానం లేదు. ఏదో రాంగ్ కాల్ అని ఫోను పెడుతున్నప్పుడు చూసాడు. ఫోను పక్కన ఏదో పుస్తకం వుంది. ఆ పుస్తకం పేరు "నా సమస్య". అదీ "మీ కోసం" పత్రిక లాంటిదే. అసలు పత్రికలు చదవని తన భార్యకు ఇదెలా చేరిందో అని ఆశ్చర్యంతో పేజీలు తిరగ వేసాడు సుబ్రావ్.

ఒక చోట అతని చూపులు నిలిచాయి. తనకు పెళ్లయి మూడేళ్లు గడిచినా పిల్లలు కలగలేదని, చాలా చోట్ల పరీక్షలు చేయించుకున్నా ఫలితం లేదని ఎవరో ఆసామీ తన బాధ వెళ్లబోసుకున్నాడు.

దానికి సమాధానంగా మీ భార్యను కూడా పరీక్ష చేయించుకోండని, అసలు దంపతులిద్దరూ పరీక్ష చేయించుకోవాలన్న విషయం కూడా మీకు తెలియక పోవటం మీ అవివేకమని ఎవరో డాక్టరు చీవాట్ల రూపంలో సమాధానమిచ్చాడు.

పేరు ఏమయి వుంటుందని చూసాడు సుబ్రావ్. సుబ్బారావు జూనియర్ కాలేజీ - చింతపల్లి అన్న పేరు చూసి సుబ్రావ్‌కు కళ్లు బైర్లు కమ్మాయి.

టి.వి. పాడైపోయిందన్న విషయం సుబ్రావుకు తెలిసినా, అందువల్ల కాలక్షేపానికి స్నేహితురాలి దగ్గర నుండి ఆ పత్రిక భార్య తెచ్చుకుందని సుబ్రావ్‌కు తెలియదు. ఆ విషయం క్రమేణా తెలిసినా అతనికి తెలియడానికి అవకాశం బొత్తిగాలేని విషయం మరొకటుంది. ఆ సమస్య ఓ యువకుడిది. సుబ్బారావు అనేది తెలుగువాళ్లలో అతి కామన్ నేమ్ కదా అని దాన్ని మారుపేరుగా ధరించి, పక్కన వాళ్ళ అత్తారి ఊరైన చింతపల్లి చేర్చి అతను తన సమస్యను పంపేశాడు.



నవంబరు 21, ఎలీనార్ జయంతి సందర్భంగా

- ❖ ట్యాప్ డాన్సింగ్ వద్దుమొర్రో అని పారిపోయిన ఆమె టాప్‌క్లాస్ ట్యాప్ డాన్సరయ్యింది.
- ❖ సినిమాలు నాకు వద్దు, థియేటరే నాకు ముద్దు అంటూనే ఆమె ప్రఖ్యాత సినీతార కావలసివచ్చింది.
- ❖ నటించినది చాలు అంటూ 32వ యేట సినిమాల నుండి రిటైరయిన ఆమె 47వ యేట క్లబ్ డాన్సర్‌గా పునర్జన్మయెత్తింది.

# ఎలీనార్ పావెల్ - ది డాన్సింగ్ స్టార్

E అట్లాంటిక్ సిటీలో ఓ బీచ్‌లో గుస్ ఎడ్వర్డ్స్ కూచునివున్నాడు. ఆయన చిల్డ్రన్ షోలు నిర్వహిస్తాడు. ప్రస్తుతం అంబాసిడర్ హోటల్‌లో ఓ షో లో డాన్స్ చేయడానికి ఓ చిన్నపిల్ల కావాలి. డాన్సు చేసి తల్లిని ఆనందపరుస్తున్న ఓ పదకొండేళ్ల పాపపై ఆయన దృష్టి పడింది. ఆ పాప ఎలీనార్ పావెల్. 1912 నవంబరు 21న మసాచుసెట్స్‌లో పుట్టింది. తల్లి సంరక్షణలో పెరుగుతోంది. భర్త నుండి విడాకులు తీసుకున్న ఆమెకూతురికి 11 సం.లు రాగానే డాన్సు పాఠాలకు పంపింది. సమ్మర్ హాలిడేస్‌కు అట్లాంటిక్ సిటీలో బంధువులింటికి వచ్చి బీచ్‌కు వచ్చారు తల్లీ, కూతురు. గుస్ లేచి వెళ్లి తల్లి పరిచయం చేసుకుని అనుమతి కోరాడు. ఆమె సరేనంది. ఆ విధంగా ఎలీనార్ కెరియర్ ప్రారంభమయింది. వారానికి రెండు రోజులు. షోకి ఏడు డాలర్ల జీతం.

E ఎలీనార్‌కి పదహారేళ్ల వయస్సు లో డాన్సు చేయడానికి వెళ్లిన చోటల్లా 'నీకు ట్యాప్ డాన్సు వచ్చా ?' అని అడిగేవారు 'రాదనేది'. అయితే సారీ, అనేవారువాళ్లు. అప్పటికే ఆమె న్యూయార్కులో నైట్‌క్లబ్స్ లో డాన్సు చేసింది. 1928లో "ది ఆప్టిమిస్ట్స్" అనే బ్రాడ్వేషోలో చిన్నవేషం చేజిక్కించుకుంది. కానీ ఆ షో విజయవంతం కాకపోవడంతో డాన్స్ వేషాల కోసం అడగవలసివచ్చింది. అడిగి, అడిగి, విసిగి చివరకి జాక్ డొనాహూ నడిపే డాన్సింగ్ స్కూల్లో ట్యాప్ డాన్సు నేర్చుకోవడానికి చేరింది. పాఠానికి మూడున్నర డాలర్లు యిచ్చే షరతుపై! ఒళ్ళు కదల్చకుండా పాదాలు మాత్రం కదపాలంటే ఆమె తరం కాలేదు. మొదటి పాఠం కాగానే దణ్ణం పెట్టి ఇంట్లో కూచుంది. టీచరే ఫోన్ చేసి వచ్చినేర్చుకోమని నచ్చచెప్పాడు. ఆమె సరేనంది. డాన్సు చేస్తుంటే ఆమె చీలమండలు అతను గట్టిగా పట్టుకొని కూచునేవాడు. నడుముకి పెద్దబెల్టు పెట్టేసి అటూ, ఇటూ ఇసుక మూటలు కట్టి ఒళ్లు కదల్చకుండా చేసేవాడు. కఠోరసాధన సత్ఫలితాలనిచ్చింది. ఆమె బెస్ట్ ట్యాప్ డాన్సర్ అయింది.

'డచెస్ ఆఫ్ ఇడాహో' లో వాన్ జాన్సన్ తో



'బోర్న్ టు డాన్స్' లో 'స్వింగ్ ది జింక్స్ ఎవే' డాన్సు చేస్తూ



E ఎలీనార్ 23వ యేట ఎం. జి.ఎం. స్టూడియో వారి కన్ను ఆమెపై పడింది. ఆర్.కె. ఓ. వారి మ్యూజికల్స్, వార్నర్ వారి మ్యూజికల్స్ కనకవర్షం కురిపిస్తున్నాయి కాబట్టి ఎలీనార్‌ను పెట్టి మ్యూజికల్ తీయాలని ఎం.జి.ఎం. వారి సంకల్పం. కానీ ఎలీనార్‌కు సినిమాలంటే

ఇష్టం లేదన్నది అందరూ ఎరిగిన సత్యం. ఆమె బ్రాడ్వేషో ను సినిమాగా తీసినప్పుడు నిర్మాతలు కోరికపై తక్కిన స్టేజి నటీనటులు సినిమాలో నటించినా ఎలీనార్ ఒప్పుకోలేదు. జార్జ్‌వైట్ '1934 స్కాండల్స్'ను సినిమా తీస్తూ ఆమెను ఆహ్వానిస్తే అంతకంటే యూరప్ వెళ్లి డాన్సుప్రదర్శనలు ఇచ్చుకుంటాను అన్నదామె. చివరకు అతని బలవంతం మీద ఓ పాత్ర వేసినా హాలీవుడ్ పద్ధతులు ఆమె చాదస్తానికి నప్పలేదు. ఇవన్నీ తెలిసీ ఎం.జి.ఎం.వాళ్లు బ్రాడ్వే మెలడీ ఆఫ్ 1936లో పాత్రవేయమని కబురంపారు. హెచ్చు మొత్తంలో పారితోషికం, కథానాయిక పాత్ర అడిగితే వాళ్లేపోతారు కదాని అలా అడిగితే వాళ్లు సరేననేశారు. ఇక ఆమె కాదనలేకపోయింది. ఆ సినిమా హిట్ అయి ఆస్కార్‌కు నామినేట్ అయింది కూడా.

E 1936లో ఆమెతో 7 యేళ్ల కాంట్రాక్టు రాయించుకోనేటప్పుడు ఎం.జి.ఎం. వాళ్లు ఒక షరతు విధించారు. ప్రతీ యేడాది మూడు నెలలపాటు ఆమె పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలని, ఎందుకంటే ఆమెకు సినిమాలు తప్ప తక్కినవన్నీ ఇంట్రస్టింగ్‌గా ఉండేవి. బ్రాడ్వేమెలడీ, హిట్ అయ్యాక ఎం.జి.ఎం. కాంట్రాక్టు ఆఫర్ చేస్తే వద్దనేసి ఎట్‌హోమ్ ఎబ్రాడ్ అనే స్టేజి షో చేయడానికి వెళ్లిపోయింది. వారం వారం రేడియో ప్రోగ్రాం ఇచ్చేది. విక్టర్ కంపెనీ రికార్డుల కోసం పాటలు పాడేది. దాంతో అలసటవల్ల కొలాప్స్ అయిపోయింది. చివరికి ఎం.జి.ఎం. కాంట్రాక్టు ఒప్పుకుంది.



'రోసాలీ' (1937) లలో డ్రమ్ డాన్సు

E 1943 దాకా సాగిన ఆమె ఎం.జి.ఎం. అనుబంధంలో ఎన్నోహిట్స్ - బోర్న్ టు డాన్స్ (1936) బ్రాడ్వేమెలడీ ఆఫ్ 1938, రోసాలీ, హోనొలులూ, బ్రాడ్వే మెలడీ ఆఫ్ 1940 ఆమెకు గర్వకారణమైన సినిమా. ఫ్రెడ్ ఏస్టైయిర్ వంటి గొప్ప డాన్సర్‌తో ఆమె పోటీపడి నృత్యం చేసింది. సమఉజ్జీ అనిపించుకుంది. కాంట్రాక్టు ముగిసేనాటికి ఆమెకు 31 యేళ్లు. అప్పటిదాకా ఆమె వివాహ మాడలేదు. అప్పుడే యాక్టర్ గ్లెన్ ఫోర్డ్‌తో ప్రేమలోపడి పెళ్లాడింది. సినిమాలు తగ్గించేసుకుంది. 1945లో కొడుకు పుట్టడంతో పూర్తిగా మానేసిఇంట్లోకూచున్నా ఎం.జి.ఎం. కోరిక మేరకు 'డచెస్ ఆఫ్ ఇడాహూ' లో ఓ డాన్సు చేసింది.



'బ్రాడ్వే మెలడీ, 1938'లో జార్జ్ మర్ఫీతో

E 1959లో ఎలీనార్‌కు 47 ఏళ్లు. భర్తతో విడిపోయింది. 14 ఏళ్ల కొడుకుతో కలిసి లాస్‌వెగాస్‌లో ఓ నైట్ క్లబ్‌లో ప్రదర్శన చూడబోయింది. షో నిర్వాహకుడు ఆమెను గుర్తుపట్టాడు. ఆడియన్స్ కోరికపై ఆమె కాస్సేపు డాన్సు చేసింది. కొడుకు ముచ్చట పడ్డాడు. "అమ్మా నువ్వు మళ్లీ షోబిజ్ లోకి రావాలి" అన్నాడు. అతని కోరిక మన్నించడానికి తొమ్మిది నెలలు శ్రమించి బరువు తగ్గించుకుని, శరీరాకృతిని అదుపులోకి తెచ్చుకుని అమెరికాలోని ప్రఖ్యాత నైట్‌క్లబ్‌లలో డాన్సు చేయసాగింది. ఆ వయస్సులో ఒక మహిళ అలా చేయగలగడం అబ్బురం. 5 ఏళ్లపాటు అలా ప్రదర్శనలు ఇచ్చాక ఇక చాలని తనంతట తానే విరమించుకుంది. తర్వాత సాంఘిక కార్యక్రమాలలో పాలుపంచుకుని, 68 వ యేట క్యాన్సర్‌వ్యాధితో బెవర్లీహిల్స్‌లోని స్వగృహంలో ఆమె మరణించింది.

**కమ్యూనికేటర్ ఫీచర్స్**



అద్నాన్ శామీ తొలి వీడియో ఆల్బమ్ 'కభీతో నజర్ మిలావో' హిట్ అయింది. అది విడుదలయిన రెండేళ్లకు ఇప్పుడు 'తేరా చెహ్రా' అనే పేర మరో వీడియో ఆల్బమ్ వెలువడింది. సమీర్ రాసిన రొమాంటిక్ గీతాలతో బాటు, రాణీ ముఖర్జీ నటించడం ఇంకో ప్రత్యేక ఆకర్షణ. 'అజ్‌నబీ' లో 'మెహబూబా..మెహబూబా', 'చోరీ చోరీ' లో 'రూఠ్ యారానా', 'చోర్ మచాయే శోర్' లో 'ఇష్క్...ఇష్క్' - ఈ పాటలతో బాటు 'లిఫ్ట్ కరాదే' వీడియో ఆల్బమ్ కారణంగా కూడా అద్నాన్ ఎప్పుడూ లైమ్‌లైట్‌లో ఉంటూనే వచ్చాడు. అందువల్ల రెండు ఆల్బమ్స్ మధ్య ఉన్న రెండేళ్ల గ్యాప్ 'తేరా చెహ్రా' విజయానికి అడ్డు రాలేదు.



# మహేంద్రవాడ బాపన్నశాస్త్రి (1904)

సరిగ్గా తొంభయ్యేళ్ళ క్రితం! తూర్పు గోదావరి జిల్లాలోని యింజరం గ్రామం. అప్పుడే తెలతెల వారుతోంది!.

కొబ్బరి మట్టలలో వెలిగించిన పొయ్యిలనుంచి పొగ... మంచులా ఊరంతా... వ్యాపించింది.

సన్నటి సూర్యకిరణాలు చెట్ల సందుల్లోంచి పెంకుటిళ్ళ మీద పడుతున్నయ్...

ఆవుల అంబారవాలూ... కాకుల కావ్‌కావ్‌లూ

నూతి గిలకలచప్పుడూ...

వీటన్నిటినీ చీల్చుకుంటూ కమ్మగా అధ్యాత్మరామాయణ కీర్తన...

మూడేళ్ళ పిల్లాడికి తలంటుతోంది తల్లి!

వాడు గోలపెట్టేస్తున్నాడు...

మొత్తానికి 'యజ్ఞం' అయినంత పనైంది!..

వెంటనే పాలుపట్టించేసింది!..

ఏడుపు ఆపేశాడు...

ఆరోజు కృష్ణాష్టమి...

తన పిల్లాణ్ణి కృష్ణుడల్లే అలంకరిస్తోంది సూర్యాంబ...

గిరజాల జుట్టు దువ్వింది..

కస్తూరి బొట్టెట్టింది..

పాత పట్టు పంచె చించీ.. కట్టీ దానిమీద మొలతాడు ఎక్కించింది.

తన కాసులపేరు తీసి మెళ్ళోవేసి చేతికో పిల్లన గ్రోవిచ్చింది.

అచ్చం బాల కృష్ణుడల్లే ఉన్నాడు..

తన దిష్టే తగిలేలా ఉంది...

గబగబ దిష్టి చుక్క పెట్టింది.

పిల్లాడు గలగలా నవ్వాడు.."కృష్ణం కలయ సఖి సుందరం" తరంగం అందుకుంది సూర్యాంబ.

ఆ బాల కృష్ణావతారం పేరు 'బాపన్నశాస్త్రి'...

పిల్లాణ్ణి చంకనేసుకుని గుళ్ళోకెళ్ళింది... ఊళ్ళో అందరి కళ్ళు పిల్లాడి మీద...

ముద్దెట్టుకునే వారు కొందరు... ఎత్తుకునేవారు కొందరు... ఏవో పళ్ళు-పూలు పెట్టేవాళ్ళు కొందరు..

ఆ ఊళ్ళో శివాలయం-విష్ణాలయం రెండూ ఉన్నాయ్....

పిల్లాణ్ణి ఓ చోట దింపి... ప్రదక్షిణాలు చేస్తోంది తల్లి... బాలకృష్ణుడు తప్పటడుగులు వేసుకుంటూ ఎటో వెళ్ళిపోయాడు.

తీరా తల్లి వచ్చేసరికి పిల్లాడులేడు!

కాళ్ళకింద భూమి చీలిపోయినట్లైపోయింది తల్లికి..

నాన్నా...బాపన్నా... తండ్రీ...కన్నా...బాపన్నా... వెర్రిదానిలాగా వెతికేస్తోంది!! ఊళ్ళో జనం కూడా కలయతిరిగేసారు.

తల్లి సూర్యాంబ, తండ్రి కామయార్యులు.. వెతకని చోటులేదు...

ఎలాగో... ఎందుకో... అదే ప్రాంగణంలో ఉన్న శివాలయాని కెళ్ళింది తల్లి... లింగం వెనకాల నుంచి చిన్న నవ్వు వినిపిస్తోంది... వెనక్కెళ్ళిచూస్తే...!

బాలకృష్ణుడి వేషంలోనున్న శాస్త్రి ఉంగా భాషలో లింగంతో మాట్లాడుతున్నాడు.

ఎంత మనోహర దృశ్యం...తన నెత్తిమీది నెమలి పింఛం లింగం మీద పడి ఉంది. కృష్ణుడి ఒంటినిండా విబూధి!

హరిహరాద్వైతం- అక్కడ సాక్షాత్కరించింది.

తల్లి గబ గబ పిల్లాణ్ణెత్తుకుని ముద్దుల్లో ముంచెత్తింది.




కాపాడు పరమేశ్వరా అని కన్నీళ్ళతో ఈశ్వరుడికి దణ్ణాలెట్టుకుంది.

బాపన్నశాస్త్రికి బాల్యంలోనే... భక్తీ, సంగీతం రెండూ వొంటబట్టాయ్.

తల్లి ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు నేర్పితే..

తండ్రి తరంగాలు నేర్పితే... బ్రహ్మశ్రీ రేగిళ్ళ జగన్నాధశాస్త్రి గారూ, దుడ్డు సీతారామయ్య గారూ గురువులయ్యారు.

ఆ తర్వాత శృంగారం అలహ సింగరాచార్యులు వద్ద పదేళ్ళ పాటు కఠోర పరిశ్రమ చేసి, సంగీతాన్ని ఆపోశన పట్టేశాడు మహేంద్రవాడ బాపన్నశాస్త్రి.

ఆంధ్రదేశంలో జరిగిన ఏ సంగీత సభకెళ్ళినా... బహుమతి... తీసుకోకుండా వేదిక దిగలేదు బాపన్నశాస్త్రి.

1934 లో కొలంబియా రికార్డింగ్ కంపెనీవారు బాపన్న గారి పాటలు రికార్డులుగా విడుదల చేసారు!

1936 లో ఆకాశవాణి మద్రాసుకేంద్రం లోనూ.. తర్వాత ఆకాశవాణి విజయవాడ కేంద్రంలోనూ కూడా.. బాపన్న గారి పాటలు రికార్డు చేసారు.

1943 నుంచీ 'యింజరం' గ్రామంలో ప్రతీయేడు త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలు ఘనంగా చేయడం ప్రారంభించాడు.

బాపన్నశాస్త్రి ప్రత్యేకలు ఏమిటంటే

హరిహరాద్వైతం!

శివుడిని-కేశవుడిని కూడ సమ దృష్టితో అభేదంగా చూసి "హరి హర కృతి మంజరి" అన్న అద్భుతమైన పుస్తకం రాసారు.

ఈ పుస్తకానికి యానం గ్రామ అడ్మినిస్ట్రేటర్ అండ్ జడ్జి.. అయిన గానకళరసిక శేఖరులు శ్రీరామలింగం(బార్.ఎట్.లా)గారు ఆర్థిక సహాయం చేసారు.

హరి హర కృతి మంజరిలో మొత్తం 50కృతులు, 10వర్ణాలు, 10జావళులు ఉన్నాయ్!!

ఈ పుస్తకంలోని మొట్టమొదటి కృతి, ఉదయరవిచంద్రిక రాగం ఆదితాళంలో వినాయక స్తుతి.

**గణపతి నిన్ను సేవించ దలచితి**
**సద్గుణములిచ్చు సద్గురుడ నీవెకదా?**
**ఫణిహారధర, హరసతౌతనయా**
**గణనాయక నా వందన మందుకో....**

అలాగే బాలాత్రిపుర సుందరిమీద రాసిన మరో కృతి -కళ్యాణిరాగంలో

**అమ్మ పరదేవమ్మ నిన్ను నమ్మితి నమ్మ ఇమ్మహిలో నీవమ్మ, నను బ్రోవవమ్మ-అమ్మ...**

ఈశ్వరుడి మీద మూడు కృతులు రాసాడు. శుభ పంతువరాళి, ఉదయ రవిచంద్రిక, సింధురామ క్రియ రాగాల్లో...

ఎంతో మంది సంగీత విద్వాంసుల్లాగే మహేంద్రవాడ బావన్నశాస్త్రి గారు కూడా సంగీతాన్ని కేవలం భుక్తికే కాకుండా భక్తికి కూడా ఉపయోగించి నాదోపాసన చేసి తరించిన ధన్యజీవి!!

**-తనికెళ్ళభరణి**



(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వ్యాయం' చదివి, స్పందించి)

-భరణి

---

**ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు**

**తనికెళ్ల భరణి,**

**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం,**
**13-1-212, మోతీనగర్,**
**హైదరాబాదు - 500 018**
**అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.**

---

శ్రీ తనికెళ్ళ భరణి గారికి,

'హాసం' లోని వ్యాసానికి స్పందనగా ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

మీ వ్యాసం పప్పు వెంకన్న గారి గానంలా సాగింది. ఆయన గాన మాధుర్యాన్ని వివరించిన తీరు మధురంగా నడిచింది. మీ వ్యాసంలో ఆనందగజపతి మహారాజు గారి గురించి ప్రస్తావించినపుడు, ఆయన వ్యక్తిత్వాన్ని ఎలా చిత్రిస్తారో అనుకున్నాను. వ్యాసం చివరి కొచ్చేసరికి, ఆయన ఉన్నతమైన సాత్విక వ్యక్తిత్వాన్ని యధార్థంగానే మీరు చిత్రించారు. వారి గురించి నేను కొంత అధ్యయనం చేసాను. ఎందుకంటే, గురజాడ అప్పారావు గారి గురించి అధ్యయనం చేసినవారు, ఆనందగజపతి గురించి బాగా తెలుసుకోగలుగుతారు. గురజాడ అప్పారావు గారు ఆయనను 'ఆనందరాజు' అని ఆత్మీయంగా పిలిచేవారు. మీ వ్యాసంలో చిన్న సవరణను సూచిస్తున్నాను. ఆనందగజపతి గారికి పప్పు వెంకన్న గారు సమకాలీనుడు. కనుక ఆయన 18వ శతాబ్దం వారు కాదు. ఆనందగజపతి 19వ శతాబ్దం వారు (1850-1897) బహుశ అచ్చు తప్పు వలన వ్యాసంలో అలా పడి వుండవచ్చును.

మన్నె సత్యనారాయణ,
సజ్జాపురం,తణుకు.

---

మాన్యులు శ్రీ తనికెళ్ళ భరణి గార్కి,

'హాసం'లో మీరు వ్రాస్తున్న వ్యాసాలు ఎంత ఆహ్లాదకరంగా వున్నాయంటే బాగా ఆకలిగా ఉన్నప్పుడు కమ్మటి ఆంధ్రభోజనం కడుపారా తిన్నంత. మీరు అంత చక్కగా వ్రాస్తున్నారు. ఈ వ్యాసాలు ఎలా వున్నాయి అంటే మా అమ్మమ్మ కథ చెప్తున్నట్లు హాయిగా ఉన్నాయి. ఓ అతి చిన్న సాదా సీదా పాఠకుణ్ని అడుగుతున్నానని మీరు ఆగ్రహించకండి. మీరు సమకాలీన, దేశ రాజకీయ అంశాలపై ఏదైనా ఒక డైలీ, లేదా వీక్లీలో వ్యాసాలు వ్రాస్తుంటే సరస్వతిమాతకు ఊరట, మాబోంట్లకు స్వాంతన కలుగుతాయి. దీని గురించి ఆలోచిస్తారని కోరుకుంటున్నాను. పై విషయాన్ని సలహాలా గాక ఓ ప్రార్థన అంగీకరిస్తారని ఓ చిన్ని పాఠకుడుగా ఆశిస్తున్నాను.

కె. సురేష్ కుమార్
ముంబయి.

సీరియల్

8

# సినీతిచంద్రిక

రావి కొండలరావు



ఏమిటంటే -కొన్ని ఉదాహరణలు మనవిచేస్తాను. ఇప్పుడొక సీను ఉంది, అది -ఒక అబ్బాయి ఒక అమ్మాయిని లవ్వాడాడు. అబ్బాయి తండ్రికి ఇష్టం లేదు. ఆ అమ్మాయిని ప్రేమించరాదన్నాడు. అబ్బాయి వినలేదు. ఇటువంటి ఘట్టంలో కొత్తరకం సంభాషణలు ఎన్ని రాసినా రక్తిగట్టవు. దానికో పద్ధతి ఉంది. తండ్రి-"మోహన్, ఆ అమ్మాయిని నువ్వు కన్నెత్తయినా చూడరాదు -ఆ(" అంటాడు. మోహన్ 'నాన్నా' అంటాడు. అప్పుడు తండ్రి "నాన్నా!ఎవడ్రా నీకు నాన్న! నీకు నేను నాన్నను కాను. నాకు నువ్వు కొడుకువీ కావు -నాకసలు కొడుకే పుట్టలేదనుకొంటాను" అంటాడు.

"నాన్నా!"

"నాన్న!ఫో యిక్కణ్ణుంచి!"

"నాన్నా" అనగానే తండ్రి మూలనున్న గొడుగో, లేక అంతకు పూర్వం నుంచే తన చేతిలో ఉన్న కర్రో తీసి - కొడుకును కొడతాడు. కొడుకు పడిపోతాడు. విన్నారా! ఈ సీను ఇట్లాగే నడవాలి. ఇంకో ఉదాహరణ: లవ్‌సీను. అబ్బాయీ, అమ్మాయి కలుసుకున్నారు-ఫస్టుటైము. ప్రేమలు

**జరిగిన కథ**

ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శకుడు వచ్చి వాళ్ళకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగేడు. "నిర్మాత హీరోయిన్ మోహంలో పడడం వల్ల నా మొదటి సినిమా ఫెయిలయింది. ఆకలికి మాడుతుండగా ఫలానా అనే ఒకతను వచ్చి కొత్త నిర్మాత వద్దకు తీసుకెళ్లాడు. కథ గురించి చర్చించ సాగాం....

(ఇక చదవండి)

అంకురించాయి. వెంటనే అబ్బాయి ఆ అమ్మాయి పేరు కనుక్కోవలసిందే! లాలనగా, నెమ్మదిగా"నీ పేరు?" అంటాడు. ఆమె, సిగ్గుతో చచ్చిపోతూ "పద్మ" అంటుంది.

అతను వెంటనే "పద్మ!...ఎంత చక్కని పేరు అంటాడు, నిట్టూర్చేస్తూ, ఆమె పద్మ కాకుండా మరే కమలో, బానో, చేటో,తట్టో, తలగడో ఏదో చెప్పినా సరే - అతను మాత్రం ఎంత చక్కని 'పేరు' అనే అనాలి, ఇది రూలు. ఇంకోటి - కూతురు ఏ కుర్రాడినో ప్రేమించింది, తండ్రికిష్టంలేదు. "వద్దు" అంటాడు. ఆ పిల్ల ఏడుస్తుంది. ఆ ఏడుపుకు కాస్త కరిగి ఆ తండ్రి ఆమె తల నిమురుతూ "విచారించకు తల్లీ! నీ తల్లి పోయినప్పట్నుంచి కడుపులో పెట్టుకుని నిన్ను పెంచానమ్మా. నీవే నా సర్వస్వమూ తల్లీ నీ విలా మొండి పట్టు పడితే, ఈ ముసలి తండ్రి ఏం చేయగలడమ్మా- ఏం చేయగలడు?" అని" హు హు హు" అని ఏడుస్తాడు. ఆ పిల్ల ఏడుస్తూ, "విచారించకు నాన్నా! ఆడదైపుట్టడం కన్న అడవిలో మానై పుట్టడం మేలు" అని సామెత పలికి, "మాయమ్మే బ్రతికి ఉంటే ఇట్లా అడ్డు చెప్పేదా నాన్నా?" అని ఏదో అంటుంది. తర్వాత ఇష్టమైతే తండ్రి ఒప్పుకుంటాడు. లేకపోతే, "నాక్కూతురే పుట్టలేదనుకుంటాను" అని అరుస్తాడు. వింటున్నారా! ఇవన్నీ ఆయా సీన్లతో రావలసిన 'రూళ్లో' సంభాషణలు! ఇంక బరువైన సీన్లలో అయితే బరువుగానే ఉండాలి.

"ఎండలు మండిపోతున్నాయని, సూర్యుడు చెట్టుక్రింద చేరతాడా శేఖర్"వంటివి.

ఇట్లాగే, కామిక్ సీన్లతోనూ నన్నమాట!. కామెడీ డైలాగుల్ని చాలా ఈజీలెండి రాయటం, ఏమిటంటే,"ఏమండీ ఇడ్లీ తింటారా అని హాస్యగాడు అడుగుతాడనుకొండి. దాన్ని ఇట్లా అడగాలి."ఈమండీ, ఎడ్లీ తింటారా?"అని. అదీ హాస్యం. నవ్విన వాళ్లు నవ్వుతున్నారు. అట్లాగే "బీరువాలో పుస్తకం పెట్టాను" అన్నదానికి "పుస్తకాల్లో బీరువవా పెట్టాను" అని రాయాలి. లేకపోతే ఊతపదం తగిలించేస్తే సరి, హాస్యం అదే వస్తుంది. హాస్య పాత్ర అంటున్న ప్రతి మాటకు ముందో వెనకో -సామిరంగో ,తస్సదియ్యో వుంచొచ్చు. లేకపోతే తకతకలై అనొచ్చు. అప్పుడు"తకతకలై నిన్న మా ఇంటికెళ్లి తకతకలై టిఫిన్ పట్టినంత కడుపుకు తిని తకతకలై -" ఇట్లా



వస్తుంది. ఇట్లా రాస్తే దాందుంప తెగ హాస్యం రాక చస్తుందా?

చెప్పవచ్చేదేమిటంటే, ఇట్లాంటి పద్ధతులకు మనం అలవాటుపడివున్నాం. ఇవి ఎల్లామారుస్తాం? పైగా అవి రూల్సు. రూల్సు మార్చేస్తే నావల్టీ వస్తుందా ఎక్కడన్నా? అని ఉపన్యసించాడు రచయిత.

"ఐ డోంట్ ఎగ్రి," అన్నాడు సలహా అంతా విని.

" నాతోనా, వీటితోనా?" అన్నాడు రచయిత.

"అసలీ ఇండస్ట్రీతోనే" అన్నాడు ఫలానా.

"సరేగానీ, ఈరో ఎవరయ్యా మనకి?" అని అడిగాడు చట్టున నిర్మాత.

"ఉండు గురూ - కథ దొరకక్క చస్తున్నాం - హీరో కు పోయావు." అన్నాడ



సలహా.

"దొరికింది గదయ్యా -ఇంకేటి! నాగేస్సరావు వేసుకుందామా?"

"చూద్దాంలెండి",అన్నాను నేను.

"అన్నట్టు రేలంగికి ఏసమే కనిపించదే, అదోటి ముక్కెం.

"వాళ్లందరికీ డబ్బు ఇవ్వొద్దూ - ఊరికే వస్తారా గురూ గారూ?" అన్నాడు ఫలానా.

"ఇస్తాంరా సిన్నోడా. డేరక్టరుకే మూడొందలు ఇస్తూంటే.

"స్టార్సు అంతా వేలల్లో ఉంటారు. మీకు వాళ్ల కావాలిస్తే వేలు - లేదూ కొత్తవాళ్లయితే వందలు. ఇంకా తక్కువకైతే చూడవచ్చు" అన్నాడు సలహా.

"కొత్తోళ్లు ఎందుకులే, మొహం తెలియనోళ్లని ఏం చూస్తారు?"

"మరయితే, రెండు మూడు లక్షలుండాలి -పైన" అన్నాడు సలహా.

"నువ్వేంది లేవయ్యా- పదివేలలో మొత్తం పిచ్చరులాగాలని చూస్తుంటే"

" కుదరదు గూరూగారోయ్, మీరు ప్రయత్నం మానుకోండి. సాయంకాలం ఎనిమిది యాభైకి మెయిలుంది -ప్రశస్తమైనబండి " అన్నాడు ఫలానా.

"ఏందిరో సిన్నోడా -ఎనకంజేస్తా ననుకుంటున్నారా సూడురా!"

"పూర్తిగా డైలాగ్సు రాసేయనా, ఏం చేదామంటారు?" అన్నాడు రచయిత.

"లెటజ్ డిస్కస్ ఫస్ట్! అయిన తర్వాత రాద్దువుగాని?"

"రాత సర్లేవయ్యా - నువ్వు ఏదో రాసేత్తే కాదయ్యా! బాగా రాయాల.తేగాలు పెట్టు, కాఁ విక్కు పెట్టు -ఇయన్నీ ఉండాల. ఏం? సలహా-లే- నువ్వూ నేనూ ఎల్లి ఈ తారల ధరలు ఎట్టాగున్నాయో తెలుసుకొద్దాం పద!" అని నిర్మాత లేచి, భుజం మీద కండువా వేసుకుని చుట్ట ముట్టించి బయల్దేరాడు. సలహా కూడా వెనకాలే వెళ్లాడు.

"ఇంకా కథాలేదు, కమామిషూ లేదు. అప్పుడే తారలంటాడేమిటీ?" అన్నాను నేను.

"తారలను చూసుకొచ్చి, వాళ్ల నెవరినో నిర్ణయించుకొని, అప్పుడొచ్చి,వాళ్లకు తగినట్టుగా కథ రాయమంటాడు. ఆఁ- మనకు తెలీని భాగోతమా ఇది!" అన్నాడు ఫలానా.

"ఇదేం కుదిరేట్టు లేదండీ" అన్నాడు రచయిత నెమ్మదిగా.

"ఆ- కుదరకేం-సినిమా తియ్యాలని వచ్చినవాడు, తియ్యక మానతాడా ఏమిటి గాని - సార్, డేరక్టరుసార్-అట్లా వెళ్లి బాల్కానీ మీద నించుంటాను.'టాప్‌షాట్స్'లో బస్సులూ కార్లూ చూసుకోవచ్చు" అంటూ పరుగెత్తాడు ఫలానా.

" నేను వెళ్లివస్తాను డైరక్టరు గారింకా - రేపొస్తాను. కావింకోక్ కావింకోక్ అంటాడు - ఇంతకీ కామెక్కుంటే ఇంకా చాలదంటాడు. అసలు కథను కామెడీ మింగేస్తే ఎట్లా? కామెడీ చాలా అవసరం అనుకొండి - గాని మోతాదు మీరితే? వెనక ఇట్లాగే ఒక డైరక్టగారు కథను విడిచిపెట్టి కామెడీ ఎక్కువ చెయ్యటంవల్ల సినిమా దెబ్బతిన్నది. నవ్వు నాలుగువిధాలచేటు అంటారు. ఆ 'నవ్వు నాల్గు విధాల చేటు' కథను 'కథాసంగ్రహం' లా చెప్పేస్తాను -వినండి!" అని రచయిత ప్రారంభించాడు.

"ప్రేక్షకులు కేవలం నవ్వేస్తే, డబ్బిస్తారనే అపోహలో, ఆ డైరక్టరు నిర్మాతను నమ్మించి - కథకు సంబంధం లేకుండా, ఇష్టం వచ్చినట్టు గంతులేయించి, బూతులు పలికించాడు. సినిమాలో కామెడీ అంటే ఆయన ఉద్దేశం - బూతులు పలికించటం! ఒక్కొక్క మాటకు రెండేసి అర్థాలు చొప్పున, లక్ష మాటలు వాడాడు. హాస్యం చేసే మనిషి చేత కుప్పి గంతులు వేయించాడు- బూతు పాటలు పాడించాడు. ఇదంతా జనం నవ్వాలనే. అయితే జనం నవ్వలేదు కానీ -నవ్వుకున్నారు. ఆ నవ్వే నాల్గు విధాల చేటయింది. ఐ, చిత్రాన్ని దెబ్బతినిపించింది.

బూతులున్నాయని స్త్రీలు రాలేదు. స్త్రీలు రాలేదని పిల్లలు రాలేదు. ఒక్క పురుషులు ఎంతకాలం అని వస్తారు! ఒకవారం వచ్చినట్టున్నారు. అంచేత, చెప్పొచ్చేదేమిటంటే, ఈ వ్యక్తికూడా 'హాస్యం' అంటే అదే నమ్మకంలో ఉన్నట్టు కనిపిస్తుంది. ఆ రకం హాస్యం లేదనే 'కాఁవిక్కు పెట్టు కాఁ విక్కుపెట్టు' అంటున్నాడు. నా చేత కాదు సుమండీ- మీ ఇష్టం."

"ఎవరి ఇష్టానికైనా, అది కామెడీ ఎట్లా అవుతుంది?" అన్నాను నేను.

"ఏమో నే వెళ్లి రేపొస్తాను - చెప్పండి" అని లేచి, కాయితాలన్నీ కట్టకట్టుకుని వెళ్లిపోయాడు రచయిత.

'ఫలానా' అని పిలిచాను, పలకలేదు.

నేనే వెళ్లాను. బాల్కనీ మీద నించుని, ఫలానా వీథిలో చూస్తున్నాడు.

"ఏమిటోయ్ ఆ చూపూ?" అన్నాను.

"ఏం లేదండి -సోల్ మర్డర్ చేసుకుంటే ఎట్లా ఉంటుందా అని"

'ఏమిటది?'

'సోల్ మర్డరండీ -ఆత్మహత్య!'

'అదా! ఓరి-ఐనా అదేం కోరికయ్యా ఫలానా?'

"కోరిక కాదండి -ఊరికే ఆలోచన. ఎట్లా ఉంటుందా అని. ఒకవేళ -ఇక్కడినుంచి దూకేశాననుకోండి. వెంటనే చస్తానంటారా, ఒక అరగంటకు చస్తానా?-చెప్పండి సార్!...బహుశా కాళ్లూ చూతులూ విరుగుతాయి కాబోలు, నిజంగా చస్తే, ఇవాళ సాయంత్రం పేపర్లో వార్త పడిపోతుంది, వెంటనే వేసేస్తారంటారా?... మాట్లాడరేమండీ... మీరట్లా ఆశ్చర్యపడకండి సార్ ఊరికే అంటున్నాను- నేనెందుకు చస్తాను! మీ పిక్చర్లో వేషం వెయ్యాలిగదా- మా ఊళ్లో ఒక అబ్బాయండీ - పరీక్ష పోయిందని నదిలో పడ్డాడు. నదిలో అట్టే నీళ్లు లేవు...."

"నాయనా-ఫలానా-నీకేదో పిచ్చెత్తినట్టుంది. నేను వెళ్లి వస్తాను" అని బయల్దేరాను.




"ఎక్కడికండీ - పార్కు బెంచిమీదకా?"

"కాదులే. అట్లా ఓసారి వెళ్లి...." అని వచ్చేశాను. ఫలానా మాత్రం అక్కడున్నాడు. నాకసలు మహా యాతనగా వుంది. డైరక్షన్ ఛాన్సు వచ్చిందని పదిమందితోనూ చెప్పెయ్యాలని ఉబలాటంగా ఉంది. తెలిసిన వాళ్లందరికీ చెప్పాలని, పాండీ బజారు వచ్చాను. తెలిసిన ఓ పత్రిక మనిషి కనిపించాడు. నేనే విష్ చేసాను.

"ఏమండీ ఎట్లా ఉన్నారు?...డల్‌గా ఉంది మార్కెట్టు. పిక్చర్సు రిలీస్ కావటం లేదు ఈ మధ్య. అవి రిలీజ్ కాకపోతే మాకు ప్రకటనలురావు. ప్రకటనలు వచ్చినా -ఏదో వచ్చిందని సంతృప్తి పడాలి తప్ప డబ్బు రాదుగదా! - ఆరు నెల్లు తిరగాలి-ఆరు నెల్లేమిటి - సంవత్సరమాయి అడుగుతున్నాను ఒక నిర్మాత గారిని - డబ్బివ్వడే! మళ్లీ ఆయన చిత్రం బాగానే పోయింది. ఇంతకూ నా కివ్వాల్సిందెంతా -ఒక్క ఇన్సెర్షనే ఇచ్చాడు. దానికోసం లోకమంతా గొడ్డు పోయిందంటున్నాడు" అంటూ మొదలెట్టాడు.

నేను నవ్వి ఊరుకున్నాను.

"కొందరు కొందరుంటారండీ మహానుభావులు. చెయ్యెత్తి దండం పెట్టాలి. మనం అడగకుండానే ప్రకటన వేసిన నాలుగో రోజు నాటికి చెక్కు పంపేస్తారు. వాళ్లూ నిర్మాతలు అంతే గాని, ఏమిటండీ ఇది - అసలే జర్నలిజమ్ కిట్టుబాటు కానిది, దాన్లో ఫిల్ము జర్నలిజమ్...."

"ప్చ్" అన్నాను నేను, అతను ఏది అనుకుంటే అదెయ్యేట్టు.

"వస్తాను సార్ - పేపరు అచ్చవుతూంది" అంటూ వెళ్లబోయాడు.

"అన్నట్టు నేనో చిత్రం డైరక్టు చెయ్యబోతున్నానండి" అన్నాను నేను.

"కంగ్రాచ్యులేషన్స్, వస్తాను" అని వెళ్లిపోయాడు.

హారీ వీడి దుంపతెగా! అతనే ఏం చేస్తున్నారని నన్ను అడిగితే, చెబుదామని సిద్ధంగా ఉన్నాను. పోనీ అడగలేదు. నేను చెప్పినా కూడా ఆత్రుత కనబరచలేదే! సర్లే - ఆత్రుత నాదిగాని అతనిదెందుకవుతుంది? అనుకున్నాను. ఇంతలో ఒకతను కనిపించాడు. ఈ వార్త చెప్పాను.

"శుభవార్త విన్నానండి -ఇవాళ ఉదయం లేచి ఎవరిమొహం చూశానోగాని - రావాలి సార్ -మీ వంటి యంగ్‌మాన్స్ రావాలి. అప్పుడే ఇండస్ట్రీ బాగుపడుతుంది. మీకేం సార్ - ఎక్కడున్నా సరే డైరక్షన్ ఛాన్సు పిలికపట్టుకుని లాగుతుంది. సరేకానీండి-మీరు చెయ్యాలి ఈ హెల్పు!. మాఊరి నుంచి ఒక అబ్బాయి వచ్చాడు, జీనియస్, అంటే పాడుతాడు బ్రహ్మాండంగా. ఏం పాటండీ అది ఏం కంఠం అండీ అది! మీరు వినాల్సిన గాత్రం. తప్పకుండా ఎంకరేజ్ చెయ్యాలి-హిలేరియస్ సింగర్! కొంతమంది



మ్యూజిక్ డైరక్టర్లు ఇస్తామని ఓత్ తీసుకున్నారనుకొండి. ఏవియమ్ రెండేళ్లకు లీజ్‌కు తీసుకుంటాం రమ్మన్నారు అతన్ని! ఆలోచిస్తున్నాడను కొండి. అయిననా ఫస్టు ఛాన్సు మీరివ్వాలనీ, మొదటిసారి మీ కింద పాడాలనీ నా ఏడుపు. అన్నట్టు మీ మ్యూజిక్ డైరక్టరె వరండి?

"ఇంకా ఎవర్నీ అనుకోలేదు?"

"మరీ మంచిది. మీరు కాస్త పార్కు దాకా రారాదూ. ఆ పాట విందురు గాని, రండి సార్. కాఫీ కాస్త తీసుకుని పోదాం. ఎంతసేపు -ఒక్కపాట విన్నారంటే చాలు - అన్నం అంతా పట్టుకు చూడనక్కర్లేదుగా - రండి, గీతాలో తాగుదామా, నారాయణ కేఫ్‌లో తాగుదామా- ఎవరయినా మనకు ఒకటేలెండి, వీడు చుట్టమయవనాడా - వాడు కాకపోయినాడా?" అని ఏవేవో వాగసాగాడు. ఇద్దరమూ కాఫీ హోటల్లో ప్రవేశించాము.

"మీరు కాస్త టిఫిను...."

"వద్దులెండి"

"సర్లెండి, నాకూ వద్దు" అని రెండు కాఫీ తెమ్మని చెప్పాడు. ఇద్దరం కాఫీ తాగాము. ఈ లోపల బోలెడంత లెక్చర్ ఇచ్చాడు. కాఫీ అసలు ఇండియాది కాదనీ, అరేబియా నుండి ఎవరో కాఫీ విత్తనం తెచ్చారనీ, రానురాను అది అందరికీ అలవాటై కూచుందనీ, కానీ కాఫీ వంటికి మంచిది కాదనీ, ఐనా తాగక చస్తామా, ఏమిటనీ- ఇట్లాగ! సర్వరు బిల్లుతెచ్చి అతని దగ్గర పెట్టాడు. కాని అతను దాని వేపే చూడనట్టుగా, ఏవోవో మాట్లాడసాగేడు. నాకు గుండెల్లో దిగులు బయల్దేరింది. కొంపతీసి, ఆ బిల్లు నేనివ్వాలని ఉద్దేశమా ఏమిటి? చచ్చాను. జేబులో కానీ లేదు. మరీ ఇంత పురానాగా, కాఫీ తాగుదాం రమ్మన్నాడెందుకని! ఐనా సంగతి తేల్చుకుందామని -'"లేదామా?' అన్నాను.

"ఓ యస్,"అని లేచాడు, బిల్లు వదిలి, అతను చూస్తున్నట్టుగా నేనే బిల్లు తీసాను. కాని, ఆ సంగతేమి అతను పట్టించుకోకుండా తన వాక్ ప్రవాహంతోనే కొట్టుకుపోతున్నాడు? ఏం చెయ్యాలో తోచడం లేదు నాకు. జేబులో తడుముకుంటూ,

"చిల్లర..."అన్నాను.

"ఏమిటి సార్ మీరు...చిల్లరకేం భాగ్యం సార్ హోటల్లో. కావలసినంత చిల్లరిస్తాడు.

అసలు ఒక్కొక్క హోటల్లో ఏమిటంటేనండీ -చిల్లరనే అసలు..."

"గుడ్ మార్నింగ్" అన్నాడు ఒకాయన కనిపిస్తే.

"హలో" అన్నాడతను లేస్తూ.

"కాఫీ అయిపోయిందా ఏమిటి?" అన్నాను.

"జస్ట్ మీరు?"

"నాదీ ఇప్పుడే. చాలా రోజులకు కనిపించారు, ఈ మధ్య బొత్తిగా..."

"రావటం లేదండీ, బిజీగా వుండీ!"

అతను, తన బిల్లును తీసుకోబోతుండగా, నేనే తియ్యబోయాను.

"నో,నో,నే యిస్తాలెండి"అన్నాడతను.

"పర్వాలేదండీ-ఎవరిస్తే ఏమిటి?"

"అయితే సరే -నేనే ఇస్తాను."అని కౌంటరు దగ్గర కొచ్చేశాడు. నేను నా బిల్లు బల్లమీద పెట్టి, జేబులో చేయి పెట్టాను.




"నో నో,నే యిస్తా లెండి -తీయ కండి" అంటున్నాడతను.

''నన్నివ్వనీండి సార్!"

ఈ లోగా అతను రెండు బిల్లులూ చెల్లించేశాడు! అప్పటికి గాని నా గుండె కుదుట బడలేదు! ముగ్గురం బయట కొచ్చాము. ట్రీ ట్ కు క్కా వ నిచే సి నందుకు, నన్ను నేనే అభినందించుకున్నాను. లేకపోతే ఏమయ్యేదో నా పరిస్థితి!

''వస్తానండీ-ఈ విల్ మీట్ యూ" అని, బిల్లు చెల్లించి నా మానప్రాణాలను కాపాడిన ధీశాలి. టాక్సీ ఎక్కి వెళ్లిపోయాడు. ఈ మనిషిని ఏమనను? నా దగ్గర డబ్బుల్లేవంటే చిన్న తనం? అందు లోనూ అప్పుడే చెప్పాను- పిక్చర్ డైరక్ట్ చేస్తున్నా నని! ఏదో సామెత చెప్పినట్టయింది నా పని!

"పదండి పార్కు వేపు. వన్ మినిట్- అతని పాట, గంధర్వ గాత్రం కదండీ... రండి,రిక్షాలో పోదామంటారా?" అన్నాడు.

"రిక్షా...!"అన్నాను నేను ఒళ్లుమండి.

"రిక్షా ఎందుకుసార్ -నాలుగు అడుగులు. చాలా మందికి అంతేసార్, టూ ఫుట్స్ వుంటే చాలు రిక్షా అంటారు, నేను చూడండి, పొద్దున్నలేచి పదేసిమైళ్లు అట్లా..."

అతనేం మాట్లాడుతున్నాడో నేను వినటం లేదు. మధ్య మధ్య 'ఊఁ' అని మాత్రం అంటున్నాను. ఇంతలో పార్కు వచ్చింది.



"ఆ పాడే అతను ఈ పార్కులో ఉంటాడా?"అని అడిగాను.

"రండి సార్" అని నవ్వాడు. లోపలకువెళ్లి ఒక బెంచి మీద కూచున్నాము.

నేనే సార్,పాట కుడిని. నస్పెన్సులో ముంచెత్తేశాను కదూ, ఊరికే అట్లా అన్నా. లేకపోతే నమ్మరని. ఎంచేతంటే నేను పాడతానని మీకు తెలీదు. చిన్నప్పుడు బాగా పాడేవాడిని. ఇక్కడకొచ్చి, మళ్లీ సాధకం మొదలెట్టాను. మాఊళ్లో అందరూ నన్ను ఘంటసాల అనే అంటారు. ఆ ప్రాంతాల ఎక్కడేం సందడి వచ్చినా మనదే హడావుడి. మనపాట లేనిదే ఒక్కసభ ఉండేది కాదు. మీటింగు ఉండేదికాదు...."

"సరే పాడండి" అన్నాను.

అతను అరగంటసేపు గొందు సవరించుకుని, సకలించి ఇకిలించి, కిందంతా ఉమ్మి- 'ఆ-' అని, 'ఊ' అనీ పావుగంటలాగి, ఒకపాట ఎత్తుకుని పాడాడు. నాజన్మ తరించిందనుకున్నాను. ఈ పాండీ బజారు ఎందుకొచ్చానా - వీడికంట ఎందుకువడ్డానా- పైగా డైరక్టరునని ఎందుకుచెప్పానా అని ఆలోచించసాగేను. అతని పాట ఏవింధంగా ఉందో ఈ పాటికి మీకు తెలిసే ఉంటుంది. తను పాటాపి, నాలుగుసార్లు సకిలించి - "ఇవాళ కొద్దిగా దెబ్బ తిన్నది సార్ -వెధవ దా కాఫీ చేసి ఉంటుంది. తీరా తాగకపోతే మీరేం అనుకుంటారా అని తాగేను. ఎట్లా ఉందిసార్, పాట?"

"బావుంది"

"ఇంకా బావుంటుంది సార్. ఇవాళ ఏదో....ఎందుకూ రేపు వినిపిస్తాను చూడండి!"

"అఖర్లేదు.పదండి-ఆఁ నాకు పనుంది వస్తాను అని లేచాను.

"మీ ఫైత్‌ఫుల్ ఐడియా చెప్పండి సార్ - మన టోన్ బావుండలేదూ?"

"బావుంది. నే కబురు చేస్తాలెండి. సమయం వస్తే" అని బయటకు పరుగెత్తసాగేను. అతనూ నా వెనకాలే రాసాగాడు. "సార్. కొంతమంది మ్యూజిక్ డైరక్టర్లు సార్ - నాపాట విని హోరెత్తిపోయారు. నాకు ఛాన్సు ఇస్తే. నేనక్కడ ముందుకొచ్చేసి ఆ తర్వాత మ్యూజిక్ డైరక్టర్‌నై పోయి, వాళ్ల ఛాన్సులు కొట్టేస్తానేమోననే భయంతో నన్ను రానివ్వటం లేదు సార్. చూడండి సార్ అన్యాయం... సార్...మీరు మాత్రం ఎంకరేజు మీ! ఏమిటి సార్ అట్లా జోరుగా వెళ్లిపోతున్నారు. సరే ఉంటాను సార్...."

ఆ తర్వాత అతని మాటలు నాకు వినిపించలేదు. తొందరగా పరుగెత్తి పరుగెత్తి హోటలకుచేరుకున్నాను. నేను నిర్మాతగారి రూములోకి వచ్చేసరికి నిర్మాత గారు బెడ్డింగు కడుతున్నాడు. ఫలానా తాడు అందిస్తున్నాడు. నన్ను చూసి -"రా, రా బండికి టైములేదు. యేళకొచ్చినావు. ఊరెల్తన్నాను. తారల ధరలు చూసుకొచ్చాం. నేనేదో పది పదిహేను వేలల్లో సినిమా అవుతాదనుకుంటే, ఆళ్ల రేట్లే బోలెడంత ఉన్నాయి. డబ్బు తీసుకురాలా. ఎల్లి డబ్బు తీసుకురావాలా. ఇప్పుడెల్లకపోతే, ఆనక ఆలీసమయిపోద్ది. అందుకే బయల్దేరతున్నాను. ఎల్లుండీపాటికి ఇక్కడ ఉంటాను. ఈ లోపు ఆయన కత సిద్ధం చేస్తాడు. జాగ్రత్తగా చూడుడేరట్రూ...తేగాలు బాగా ఉండాలి. మరి నే ఎల్లి వస్తాను. ఇక్కడ గది కాలీ చేసేస్తున్నాను. ఓటలేం బాలేదు. పెద్ద ఓటలు తీసుకుంటాను. అన్నట్టు- నేను రాగానే నీకూ, కవికి అడ్వాన్సులు ఇస్తాను. ఇప్పుడియ్యలేదని ఏమీ అనుకోమాక. ఎల్లొస్టాను మరి - సిన్నోడా ఎల్లాన్రా. నీకు మంచి ఏసం ఉంటాదిలేరా - దిగులు పడమాక! ఎల్లొస్తాను" అని వెళ్లిపోయాడు నిర్మాత. నేనూ, ఫలానా బయటకొచ్చేశాము.

మళ్లీ నాకు దారి తెలియలేదు. ఎక్కడ ఉండాలి! ఏం చెయ్యాలి? రేపొక్క రోజు! ఫలానా, నేను పాండీ బజారుకు మరి రాకుండా, అటెటోపోయాం.

"ఇక్కడ చిన్న 'డిసాల్వ్' వేస్తున్నాను..."

(ఇంకావుంది)




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్ధంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి **బాలూ** గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.

1. దంత్త (మాయాబజార్ ...విన్నావాకలసిన శుభవేళ.) యశోదమ్మ...)
   ఎ) పాలకుండ బి) గిన్నె
   సి) మిఠాయి డి) పెరుగు

2. రచ్చచేయు (మాయాబజార్...విన్నావా యశోదమ్మ.)
   ఎ) అబద్ధములాడు బి) విచ్చేయు
   సి)కలహించు డి)అతిశయోక్తులు చెప్పు

3. ధాత్రి (ఖడ్గం...ఓంకారనాదంతో...)
   ఎ) గానం బి) పుస్తకం
   సి) గొడుగు డి)భూమి

4. సల్లాపము(మాయాబజార్....చూపులు కలసిన శుభవేళ)
   ఎ) సంభాషణ బి) ఎత్తి పొడుపు
   సి) వేళాకోళము డి) పాట

5. నైజము (మాయాబజార్...చూపులు
   ఎ) అలవాటు బి) నేర్పు
   సి)ప్రాంతము డి) సహజగుణము

6. అశ్రుధార (అల్లరిప్రియుడు....ప్రణయమా)
   ఎ) జలపాతము బి) బాణ పరంపర
   సి) కన్నీటిధార డి) చిరునవ్వులు

7. నిసి (డ్యూయెట్...మాటరాని)
   ఎ) రోజు బి) రాత్రి
   సి) వెన్నెల డి) సంతకము

8. కలహంస(డ్యూయెట్....మాటరాని)
   ఎ) కలహించే హంస
   బి) కలలోనే కనిపించే హంస
   సి)రాజహంస డి) ఎగిరేహంస

9. ఝురి (మహానది....గంగా)
   ఎ) సెలయేరు బి) ఉధృతము
   సి) అల డి) ప్రవాహము

10. రాసలీల (ఆదిత్య 369...రాసలీల వేళ)
   ఎ)రాత్రివేళ నృత్యము బి) శృంగారకేళి
   సి)రాజు ఎదుట చేసే నృత్యం
   డి)వర్తులాకార నృత్యం

### జవాబులు

1) a 2) c 3) d
4) a 5) d 6) c
7) b 8) c 9) a
10) d







విడుదల : సుప్రీమ్
వెల : రూ 35/

నూతన తారలతో శేఖర్ దర్శకత్వంలో శ్రీ రాజరాజేశ్వరి మూవీస్ పతాకంపై కె.లక్ష్మీదేవి నిర్మించిన 'మేము' ఆడియో క్యాసెట్ విడుదలయింది. 'సవ్వడి' చిత్రం సినిమా విడుదల కాకపోయినా ఆడియో ద్వారా పరిచయమైన రఘుకౌశిక్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. కలువ కృష్ణసాయి రాయగా జీన్స్ శ్రీనివాస్, శ్వేత పాడిన 'నయనంతో మొదలై హృదయంతో జతయై మనసంతా నిండింది ఈ ప్రేమా' పాట హాయిగా, వినసొంపుగా ఉంది. భీంప్లాస్ రాగం ఆధారంగా తయారైన ఈ పాటలోని ఒక ఆలాపన 'ఆనందం' సినిమాలో దేవీశ్రీ ప్రసాద్ అందించిన 'కనులు తెరచినా కనులు మూసినా కలలు ఆగవేలా' పాటలో బాగా పాపులర్ అయిన ఆలాపనను గుర్తుకు తెస్తుంది.

శంకర్ మహదేవన్, ఉష, బృందం పాడిన 'జుం జుం తారారే' పాట టీనేజ్‌లో ఉన్న యువతీ యువకులు ఒకరినొకరు ఆట పట్టించుకోవటం ప్రధానాంశంగా సాగిన పాట కనుక ట్యూన్, బీట్ అందుకు సరిపడే విధంగానే జతపడ్డాయి. పాట రచయిత భాస్కరభట్ల రవికుమార్‌కి రానురాను చెయ్యి బాగా తిరుగుతోందని, త్వరలో అది అందెవేసిన చెయ్యి కాగలదని, అగ్ర కథానాయకులు, పెద్దపెద్ద బ్యానర్లతో మంచి మంచి అవకాశాలు కనుక జతపడితే ఆ చెయ్యి పందెమేసే చెయ్యి కూడా కాగలదని ఈ పాటలో సాహిత్య పరంగా అమరిన 'ఫ్లో' నిరూపిస్తుంది. ముఖ్యంగా - 'చిటికెన వేలుతో కొండ ఎత్తే టాలెంటుందోయ్ కృష్ణుడికి/ఎన్నేళ్ళయినా లక్ష్మీదేవి పాదదాసియే విష్ణువుకి' అనే వాక్యాలు నరదా పుట్టిస్తాయి. ఇక పాటలోని ఆర్కెస్ట్రయిజేషన్‌లో సితార్ బిట్‌లని కంపోజ్ చేసి వాటిని బీట్‌కి జతచేసిన విధానం చూస్తుంటే సంగీతదర్శకుడు రఘుకౌశిక్‌కి మణిశర్మ స్కూల్ అంటే ఇష్టమేమోనని అనిపిస్తుంది.

ఈ సినిమాకి దర్శకుడైన శేఖర్ రాయగా 'పాడుతా తీయగా' పార్థసారధి, బృందం పాడిన 'చూడరా వస్తోంది బస్తీ పోరీ' పాట కేవలం మాస్ కోసం పెట్టిన పాట కనుక - సంగీతం, సాహిత్యం, గానం అందుకు తగ్గట్టే ఉండాలి కనుక అలాగే ఉన్నాయి. కనుక అంతకుమించి విశ్లేషించటం కూడా అనవసరం.

పార్థసారధి, గాయత్రి పాడిన 'కనులముందు కదులుతోంది ఆమె రూపము' పాటలో ట్యూన్, ఆర్కెస్ట్రయిజేషన్ చాలా బావున్నాయి. బీట్‌ని అతి మృదువుగా వాడుకుంటూ, శాక్స్ వంటి వాద్యాలకు చక్కటి ప్రాధాన్యతనిస్తూ రఘుకౌశిక్ ఇచ్చిన మంచి ట్యూన్‌కి సాహిత్యాన్ని సమకూర్చింది లిఖిత్ శ్రీనివాస్.

విశ్వ, రవివర్మ కలిసిపాడిన 'ఓ... మీరా... ఓ... మీరా' పాట ఎత్తుగడ వినగానే ఈ మధ్యనే విడుదలయిన కమలహాసన్ 'బ్రహ్మచారి'లో 'నవీనా నవీనా' పాట గుర్తొచ్చేస్తుంది. గాయకుడు విశ్వ రాసిన ఈ 'ఓ మీరా...ఓ మీరా' పాట కేవలం థియేటర్ వరకే పరిమితమయ్యే పాటలా ఉంది.

దర్శకుడు శేఖర్ రాయగా ఉదిత్ నారాయణ్ ముఖ్యగాయకుడిగా పాడిన 'ముద్దులగుమ్మ ఓయమ్మ ఓ బాపు గీసిన బొమ్మ' పాటని కూడా థియేటర్‌కే పరిమితమయ్యే పాటగా చెప్పుకోవాలి.

## మార్కెట్‌లో ఉన్న హెచ్.ఎం.వి. వారి కొత్త క్యాసెట్లు




వెల : రూ 40/-




వెల : రూ 45-

మరొక రివ్యూ 36వ పేజీలో...




"రోజు రోజుకి మావాడి పిచ్చి ముదిరిపోతోందిరా"
"ఏం చేశాడేంటి ?"
"నుదుటి మీద గాయం చేసుకొచ్చాడు.
ఏం జరిగిందిరా అని అడిగాను. "నన్ను నేను కొరుక్కున్నాను". అని అన్నాడు.
"అసలు ఈ భూమ్మీద అది ఎవరికన్నా సాధ్యమేనా?"
"అదే మాట అడిగాను"
"దానికేమన్నాడు?"
"భూమ్మీద సాధ్యం కాదు కనుకనే కుర్చీ మీద నుంచొని ఆ పని చేశాను అన్నాడు"





"భూమి గుండ్రంగా వుందని ఎలా నిరూపించగలవ్....?"
"ఎందుకు నిరూపించాలి టీచర్!... అలా గుండ్రంగా ఉంటుందని మీతో నేనెప్పుడైనా అన్నానా... ఆర్గ్యూ చేశానా..? లేదుగా...!"





"నువ్వు... మీ ఆయనా తమిళం నేర్చుకుంటున్నారంట... ఏంటి విషయం ?"
"ఏం లేదూ.. ఈ మధ్య చెన్నైకి వెళ్ళినపుడు అక్కడ ఓ పిల్లాడిని దత్తత చేసుకున్నాం కదా... వాడికి మాటలు వచ్చి మాట్లాడేలోపు మాకు తమిళం రాకపోతే ఎలా.. వాడిని అర్థం చేసుకోవద్దూ?..."



కార్తీకమాసం సందర్భంగా ఇరుగు పొరుగు ఆడవాళ్ళంతా వనభోజనాల కార్యక్రమం ఏర్పాటు చేసుకున్నారు. ఆ పొరుగులోనే వుంటున్న తగవులమారి ముసలావిడ ను ఆహ్వానించలేదు. కాని బయలుదేరబోతూ తర్వాత మళ్ళీ ఆవిడతో ఎవరు పేచి పడతారులే అని భావించి ఆ ముసలావిడను కూడా రమ్మనమని పిలవటానికి ఇద్దరు ఆడాళ్ళు ఆవిడ యింటికి వెళ్ళారు. వాళ్ళను చూసి ఆ తగవుల మారి ముసలావిడ జాలిపడింది...
"ఇప్పటికే ఆలస్యం అయిపోయింది... ఈ రోజు కుండపోతగా వర్షం కురిపించమని దేవుణ్ణి నేను ఎప్పుడో వేడుకున్నాను.. మీరిక వెళ్ళండమ్మా..."



ఇద్దరు అనౌన్సర్లు ప్రేమించుకున్నారు. కానీ ఓ విఘాతం ఏర్పడింది. ఆ సందర్భంగా వారి సంభాషణ-
"అనివార్య కారణాలవలన నిన్ను వివాహం చేసుకోలేకపోతున్నాను సీతా"
"వాతావరణంలో మార్పు ఏమీ వచ్చే సూచనలు లేవా మోహన్!?"
"అంతరాయానికి చింతిస్తున్నాను సీతా, ఈ ప్రసారం ఇంతటితో సమాప్తం. సెలవ్"

ఒకతన్ని బాగా తన్నడానికి ఓ రౌడీని మాట్లాడుకున్నాడో మోతుబరి.
"అతడు గాంధేయవాది. ఒక చెంపమీద కొడితే రెండో చెంప చూపిస్తాడు. అప్పుడు నువ్వు బిత్తరపోకుండా ముందే చెప్తున్నాను ఎందుకైనా మంచిదని".
"మీరు నా గురించి తక్కువంచనా వేస్తున్నారు. నేనొక దెబ్బకొడితే రెండో చెంపని చూపించడానికి అతను స్పృహలో వుండడు."








"ఆ మూల నున్న పుస్తకం భగవద్గీతే కదూ!?"
"అరె... మీకెలా తెలుసు!?"
"దాని మీదున్న దుమ్ముని బట్టి చెప్పాన్లెండి"



"మీరచ్చు నా నాలుగో హజ్బెండ్ లాగే వున్నారు!?"
"వామ్మో!!..మీరు నాలుగు సార్లు పెళ్ళిచేసుకున్నారా!?"
"లేదండీ మూడుసార్లే"



"పిల్లలూ మీరంతా నిశ్శబ్దంగా వుండాలి. సూది కింద పడితే నాకు వినిపించాలి... తెల్సిందా"

కాస్సేపయ్యాక ఓ కుర్రాడు అడిగాడు.

"వినిపించిందా సార్... ఇందాకో సూది కింద పడేశాను".



యుద్ధాల వలన జరిగే కష్ట నష్టాలను, శాంతి వలన కలిగే ప్రయోజనాలను అన్నిటిని విడమర్చి చెప్పిన తర్వాత - " ఇప్పుడు చెప్పండి మీలో యుద్ధం అంటే ఎంతమంది వ్యతిరేకిస్తారు?" అని అడిగాడు హిస్టరీ టీచరు.

క్లాసులోని వారందరూ చెయ్యెత్తారు.

"వండ్రఫుల్... ఇప్పుడు చెప్పండి ఎందుకు యుద్ధం అంటే మీకిష్టం లేదు"

"యుద్ధాలు చరిత్రను సృష్టిస్తాయి. తర్వాత ఆ చరిత్రను చదవలేక మేం చావాల్సివస్తుంది" అని అన్నారంతా ముక్త కంఠంతో.



కానిస్టేబుల్ కాంతారావు సైకిల్ మీద డబుల్స్ వెళ్తున్నారని శాస్త్రి, శర్మలకు ఫైన్ వేసాడు. డబుల్స్ వెళ్ళటం తప్పకాదని వీళ్ళు, తప్పని కాంతారావు చాలాసేపు వాదించుకున్నారు. విసిగి పోయిన శాస్త్రి, శర్మ "సరేనండి కేసు బుక్ చేయండి ఏం జరుగుతుందో చూద్దాం దేవుడు మాతో ఉన్నాడు" అన్నారు.

కాంతారావు ఉలిక్కిపడ్డాడు. "అయితే మీరు త్రిబుల్స్ వెళ్తున్నారన్న మాట మీకింకా ఎక్కువ ఫైన్ వేయాలయితే" అన్నాడు.



"మీ అంత తెలివి తక్కువ వాడెవ్వడూ ఉండడు. మీ మెదడులో గడ్డి తప్ప ఏమిలేదు" విసుక్కుంది కాంతం.

"ఓహో నువ్వెప్పడూ నా మెదడు అందుకే అంత యిష్టంగా తింటావనుకుంటా... అన్నాడు భర్త కొత్తవిషయం తెలుసుకున్నంత ఆనందంగా.



ఓ బట్టతల వ్యక్తి సెలూన్ కెళ్ళాడు. పని అయ్యాక ఎంత అని అడిగాడు. బార్బర్ 20 రూపాయలన్నాడు.

"అందేంటి? అందరికీ నువ్వు 10 రూపాయలే కదా తీసుకునేది?"

"ఔను సార్! కానీ మీ తలమీద జుట్టు ఎక్కడుందో వెతుక్కోటానికి నాకు డబుల్ టైమ్ పట్టింది మరి".

ఈ జోక్‌లను పంపినవారు : టి. శైలజ
హైదరాబాద్.




'రోజా' (హిందీ)లో రుక్మణి గుర్తుందా? ఆ పాట పాడినది హర్జిత్‌సింగ్

హర్‌జిత్‌సింగ్ సెహగల్ చదివినది బి.టెక్.

అదీ నైనితాల్ లోని పంత్‌యూనివర్సిటీ నుండి.

పనిచేసినది G.E.C,D.E.S.U వంటి ప్రతిష్ఠాత్మక సంస్థలలో.

1992 లో 'ఠండాఠండాపానీ' విడుదలయింది.

దాంతో ఓ కొత్త 'బాబా' అవతారం దాల్చాడు - బాబాసెహగల్

# కింగ్ ఆఫ్ ర్యాప్ - బాబా సెహగల్

- ఠండా ఠండా పానీ తర్వాత బాబా సెహగల్ కెరియర్ వేడి వేడిగా ముందుకు సాగింది.
- ఇండి పాప్ సీన్‌లో ఏ విభాగమైనా సరే
- ర్యాప్
- భాంగ్డా
- హిప్‌హాప్
- రెగ్గీ
- కెలిప్సో

అన్నిటిలోనూ బాబాసెహగల్ ప్రవేశించాడు; తన ముద్ర వేశాడు. అంతే కాదు తన స్టయిల్ ఎప్పటి కప్పుడు నిత్యనూతనంగా ఉండేట్టు చూసుకున్నాడు. కావాలంటే అతని 'హిట్‌లిస్ట్' చూడండి.

- ఠండా ఠండా పానీ
- మంజులా
- దిల్ ధడ్‌కే
- ఆజా మేరి గాడీమే
- బాబా దివానా
- తౌరా తౌరా
- రుక్మణి రుక్మణి
- హకునా మటాట
- బారా బర్సీ
- జుగ్నీ మస్త్‌కలందర్
- పింగా పింగా



- బాబా సెహగల్ గాయకుడే కాదు కంపోజర్, ఆర్టిస్ట్ కూడా
- ఓ అధునాతనమైన ఆడియో స్టూడియో ఓనర్ కూడా.
- ఫీనిక్స్‌మాస్, బేగన్ పవర్‌మ్యాట్స్, గోద్రేజ్ జంపిన్ వంటి బ్రాండ్స్‌ను ప్రమోట్ చేశాడు.
- డాన్సర్స్, మ్యుజీషియన్స్‌తో కలసి దేశమంతటా, విదేశాలలోనూ కచ్చేరీలు నిర్వహించాడు.
- దుస్తుల విషయంలో, హెయిర్ స్టయిల్ విషయంలో ఓ ట్రెండ్‌సెట్టర్.
- 'డబుల్ గడ్‌బడ్' అనే టెలీ ఫిల్మ్ 'జీ మూవీస్'కై తీసాడు.
- 'మిస్ 420' సినిమాలో పాట పాడాడు, నటించాడు.
- 'డాన్స్‌పార్టీ'కై సంగీతం ఇచ్చాడు.
- ఎ.ఆర్.రహమాన్ సంగీత దర్శకత్వంలో 'రోజా'లోని 'రుక్మణి రుక్మణి' పాట పాడాడు.
- 'డిస్నీ'కై 'హకునా మటాటా' పాడాడు.




## బాబా ఆల్బమ్స్

- కిస్‌మిస్
- మైభీ మడోనా
- మిస్‌లూంబా లూంబా
- దిల్‌రుబా
- డా॥ ధింగ్రా
- నా ఆర్యాహై నా జార్యాహై
- ఆలీబాబా
- ఇండియన్ రోమియో
- అమెరికా మే ఇండియన్ ధాబా
- ఠండా ఠండా పానీ
- తౌరాతౌరా
- జుగ్నీ మస్త్ కలందర్ మ్యాజిక్ ఆఫ్ దాండియా
- అబ్ మై వెంగాబాయ్
- పింగా పింగా
- గుర్తు పెట్టినవి మ్యూజిక్ వీడియోలుగా కూడా దొరుకుతాయి. ఇవి కాక మ్యూజిక్ వీడియోలు...
- దిల్ ధడ్‌కే
- బాబా దీవానా
- మంజులా మంజులా
- లడ్కీ బన్‌ఠాన్ నికలీ
- గోరీ గోరీ
- బారీ బరసే
- ఝూఠ్ బోలేయా
- చైన్ నహీ


చదువుల్రావు
సత్యమూర్తి BV
...ఆఖరిసారిగా చెప్తున్నాను క్లాసువాళ్ళతో కలిసి ఢిల్లీ ఎక్స్‌కర్షన్‌కి వెళ్ళడానికి 4000 రూపాయలివ్వకపోతే కత్తితో పొడుచుకుని చచ్చిపోతా
ఏమండోయ్ వీడు నన్ను ఏదో బెదిరిస్తున్నాడు ఇలారండి
అంతా వింటున్నాను. అంత సరదాగా ఉంటే ఒకసారి పొడుచుకు చూడవోయ్... చచ్చిపోతాట్ట పొడుచుకుని @#...
అసలు వీళ్ళతో ఇలా కాదు
అమ్మా... హమ్మోయ్
అయ్యనాతండ్రోయ్ ఎంతపని చేశావురోయ్
హారి ఎంతపని చేశావ్? నిజంగా ఇలా చేస్తావని తెలిస్తే ముందే ఇచ్చేద్దును
ఇప్పటికైనా మించిపోయింది లేదు. ముందు నా చేతిలో డబ్బు పెడితే బతుకుతా. లేకపోతే గుండాగి చచ్చిపోతా
డబ్బిచ్చి ముందు డాక్టరు దగ్గరకి నడు
ముందు నా చేతిలో డబ్బు పెడ్తేగాని బతికేలా లేను
సరే... ఇందు
సరే ఇదిగో నా కత్తి




విడుదల : ఆదిత్యా

వెల : రూ 38/-

# రాజా ఆడియో రివ్యూ

తారకరత్న, జివిద జంటగా యు.నారాయణరావు దర్శకత్వంలో రామకృష్ణ హార్టికల్చరల్ సినీస్టూడియోస్ పతాకంపై నందమూరి రామకృష్ణ నిర్మించిన 'తారకరత్న' ఆడియో విడుదలయింది. కీరవాణి ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. ఆడియోలో ఉన్న ఆరు పాటలలో ఆఖరుపాటను కులశేఖర్ రాయగా దానికి ఆర్.పి.పట్నాయక్ సంగీతదర్శకుడు. మిగిలిన అయిదుపాటలకు చంద్రబోస్, కీరవాణి కర్తలు.

మొదటి పాట - 'నీది 98480 నాది 98490' అంటూ సెల్ నంబర్లతో 'సెల్లాడిపోయే' పాట. ఇందులో 'టుమారో-దుమ్ము దుమారో/ నీరో-యారో/ డార్విన్నూ-దారీతెన్నూ/ఆ త్రీ ఈ త్రీ రెండు కలిపెను మైత్రీ' లాంటి కాయినింగ్స్‌తో చంద్రబోస్ తెగ తమాషాలు చేశాడు. జీ టీ.వి.లో ప్రసారమయ్యే 'సరిగమప' కార్యక్రమ సూత్రధారి, పాప్‌సింగర్ అయిన షాన్ ఈ పాటను చక్కగా పాడాడు.

కె.కె., హృతిక్ పాడిన 'సంధ్యా... నా ఉదయసంధ్యా' పాట మెలోడీ ప్రాధాన్యంగా సాగే గీతం. 'నీ పేరు భగవద్గీతకు భాష్యం చెప్పే భావగీతం' అనే ఎక్స్‌ప్రెషన్ బావుంది. కాకపోతే రెండో చరణంలో గల - నీ మాటే నా రాతను మార్చే చలిగీతం, నాతిచరామి సంగీతం-లోలోన తీయని యాతన పెంచే యుగళగీతం అనే వాక్యాలను ఏ కోణంలో ఊహించి రాశాడో చంద్రబోస్ ఒక వివరణలా పత్రికాముఖంగా చెబితే బావుంటుంది. ఎందుకంటే చలిగీతం రాతనెలా మారుస్తుంది, నాతిచరామి అనే సంస్కృత శబ్దం సంగీతం కాదు కదా!, అనే ప్రశ్నలు ఉదయిస్తాయి. ఇవిలా ఉండగా ప్రియుడి మాటకి తన మాట కలిస్తే యుగళగీతం అని అన్నా తప్పులేదుగానీ ప్రియుడి మాట ఒక్కటే యుగళగీతం ఎలా అవుతుంది అనే సందేహం కలగటం సహజం.

కుమార్‌సాను, సాధనాసర్గమ్ పాడిన 'సఖియా యా యా ఇది కలయా' పాటను హిట్‌సాంగ్ ఆఫ్ ది ఆడియోగా పేర్కొనాలి. పాట ట్యూన్ భీంప్లాస్,ఉదయరవిచంద్రిక మిశ్రమం కనుక వెంటనే హృదయానికి హత్తుకుంటుంది. ఈ పాటలో కూడా చంద్రబోస్ చేసిన విన్యాసాలు భలేగా ఆకట్టుకుంటాయి. 'య' అనే అక్షరంతో వచ్చే పదాలను కాయిన్ చెయ్యడంలో కృతకృత్యుడయ్యాడతను. తొలి విదియ, మైనే ప్యార్‌కియా, ఆంటీ ప్రియ తనయా, చాయనఛాయ, మామామియా, రెడీ వన్ టు త్రీయా, దినచర్య, గురువర్యా, పోవాలి గయా (ఊరి పేరు) - మన్మధపేట వయా (Via) అంటూ చేసిన చమత్కారాలు ఎంతో సరదాగా ఉన్నాయి.

'అమ్మగారి నాన్నగారి తాతగారి బామ్మగారి చాటునున్న చంటి పాపరో' పాట ఓ హుషారైన పాట. సంగీతదర్శకుడు కీరవాణి ఆ హుషారైన స్థాయికి తగ్గ ట్యూన్ ఇచ్చి ఆ లెవెల్‌కి తగ్గకుండా పాడారు. 'ఆడవారి మాటలకు అర్థాలే వేరులే' అనే ఆనాటి పాటలోని కొన్ని ఎక్స్‌ప్రెషన్స్‌కి ఈనాటి ఎక్స్‌పీరియన్లతో కూడిన భాష తొడుగుతూ హుషారుగా చేసిన పాట ఇది.

సాదనాసర్గమ్, కళ్యాణ్ మల్లిక్ (కీరవాణి సోదరుడు) పాడిన 'సన్నజాజి పువ్వా, సన్నజాజి పువ్వా చిరుచిరు నవ్వే నవ్వవా' అనే టోటల్‌గా మెలోడీని మాత్రమే దృష్టిలో పెట్టుకుని రూపొందించినట్లుగా అనిపిస్తుంది. అలా ఒక్క మెలోడీని మాత్రమే దృష్టిలో పెట్టుకోవటం నుంచి కొంత స్లో అయిందేమోనని ఈ సమీక్షకుని వ్యక్తిగత అభిప్రాయం.

'చిరుచిరు గాలి చెప్పిందమ్మా నా తోటి చిన్నమాట' అనే పాట కులశేఖర్ - ఆర్.పి.పట్నాయక్ కాంబినేషన్‌లో తయారైన పాట. పాటను ఆర్పీయే పాడాడు. తగిన క్రెడిట్స్ ఇన్ లే కవర్‌పై వెయ్యటం అభినందించతగ్గది. పాటలలో సంగీతం, సాహిత్యం, గానం మూడూ చక్కగా, హాయిగా ఉన్నాయి.

## మార్కెట్‌లో ఉన్న టిప్స్ వారి కొత్త క్యాసెట్లు



వెల : రూ 45/-




వెల : రూ 65/-




వెల : రూ

రచన: చంద్రబోస్ | 1 | గానం : షాన్

టికిట్ జొట్..టికిట్ జొట్
నీది 98480 నాది 98490 నెంబర్ మాత్రం బంపర్‌గుంది ఇంతకునీదేం పేరో
నీది 98480నాది 98490 ఫ్లక్చర్ మొత్తం సూపర్‌గావుంది ఈ వూరో పారుగూరో
మనకిక లేదు టుమారో కనుకే దుమ్ము దుమారో
చూడరు వీరో వారో కొడదాం జిన్నో బీరో
రోమ్ నగరమే తగలడుతున్నా ఫిడేలు మీటెను నీరో
పాపం పుణ్యం పక్కనపెట్టి సుఖపడిపోదాం యారో
నీది 98481 నాది 98491 వన్ను వన్ను ఒకటైపోతే ఉన్నది ఎంతో ఫన్ను
నీది 98481 నాది 98491 వెన్ను వెన్ను కలిసాయంటే మైకం కలుగును టన్ను
నాకో మారుతిజెన్ను ఉందోయ్ ఇంతకుమున్ను
మొన్నే చూసా నిన్ను నీకై అమ్మేశాను
కోతి నుండి మనిషొచ్చాడంటూ చెప్పెనురా డార్విన్ను
కోతి పనులనే చెయ్యకపోతే తోచదు దారీ తెన్నూ
అమిత్ యాక్షన్ రైట్ ఏ చైల్డ్ యాక్షన్
వి గాట్ ఏ ప్లేన్ ఇఫ్ ద వర్ల్డ్ ఈజ్ ఎగైన్
హో ఫైన్ ఓపెన్ విత్ ద మైండ్ ఫీస్..ఫీస్..ఫీస్...
నీది 98482 హు నాది 98492 హు
ఆఖరి అంకెలు టు లే అయితే ఇంకా ఎందుకు లేటు
నీది 98482 హు నాది 98492 హు
నోకియా సెల్లులు చేతిలో ఉంటే సఖియా మనకేం లోటు
నాకొక మెసేజ్ కొట్టు చీకటి మూర్తం పెట్టు
కొంచెం ప్రేమే పుట్టు బోలెడు సుఖమే గిట్టు
మొబైల్ ఫోను కనిపెట్టినవాడికి రోజూ సలాము కొట్టు
ఫోను బిల్లు కట్టాల్సిన రోజు నాకే గుడ్ బై కొట్టు
నీది 98483 నాది 98493
ఈ త్రీ ఆ త్రీ రెండూ కలిపెను నీకూ నాకూ మైత్రీ
నీది 98483 నాది 98493
మైత్రే కలిసిన గుర్తుగా మనమూ గడిపేద్దాం ఓ రాత్రి
నేనే మన్మథశాస్త్రి చేస్తా ముద్దు భజంత్రీ
తెస్తే ఒంపుల పత్రి చేస్తా ఇంపుగా ఇస్త్రీ
ఆటపాటలే అయిపోయాయి టాటానే అభినేత్రి
అదిగో అదిగో వచ్చేస్తోంది నా వైపే ఇంకో స్త్రీ

రచన: చంద్రబోస్ | 2 | గానం : కె.కె.,హ్రితిక

అ: సంధ్యా..
ఆ: హు ఈజ్ కాలింగ్ మి ॥2॥
అ: సంధ్యా..సంధ్యా..
ఆ: హు ఈజ్ టచింగ్ మి ॥2॥
అ: నువ్వే నా ఉదయసంధ్యా..



ఆ: వేసంగిలో వెన్నెల్లలో గువ్వల్లె మెరిసిన పువ్వా
నాలా నువ్వైపోవా తన ఒడిలో పాపవుకావా
అ: పసిపసిమనసుల మొరలను వినవా మధురిమ మంత్రం వేయవా
ఆ: నా పరుగుల ఉరుకుల ప్రేమల త్రోవ పరిమళభరితం చేయవా ॥సన్న॥
అ: ముత్యాలకే ముస్తాబులా తెల్లంగా పూచిన పూవా నాతో ఏకం కావా
కో: హోయ్..హోయ్..
తన పదముల పూజకురావా కో: హోయ్...హోయ్...
ఆ: గోదారికే పైటంచుల స్వచ్ఛంగా విచ్చిన పూవా
నాలో సిగ్గును కనవా నా తేనెలు తనకందీయవా
అ: ఇటు అటు తెలియని వయసుల గొడవ ఇది అని నువ్వేతేల్చవా
ఆ: మా ఇరువురి నడుమన వారధికావా నీ వొక సాయం చేయవా
ఇ: సన్నజాజి పువ్వా సన్నజాజి పువ్వా చిరుచిరు నవ్వేనవ్వవా ॥2॥

రచన: కులశేఖర్ | 6 | గానం,సంగీతం : ఆర్.పి.పట్నాయక్

సై..సై..ఏహేహే..ఏఏఏ...ఏహేహే...ఏఏఏ...
చిరుచిరుగాలి చెప్పిందమ్మ నాతోటి చిన్నమాట
నవ్వును మించింది లేదు అంట
చిలకలువాలే బొమ్మలు కూడా పాడాయి మంచిపాట
మనిషికి నవ్వేగా పూలబాట
గూటిలో గువ్వలా నీటిలో పువ్వులా
గుండెలో మువ్వలా నవ్వవే హాయిగా..
చిరుచిరుగాలి చెప్పిందమ్మ నాతోటి చిన్నమాట
నవ్వును మించింది లేదు అంట
ఓహ్‌హో..ఓహ్‌హో..ఓహ్‌హో...ఓహ్‌హో
వినవే చిలకా అనగాఅనగా
పసిపాప కేరింతలోన..బాధలన్నవే లేవుగా...
నవ్వే పెదవే వరమే అయితే
కలతన్న మాటె ఎన్నడైనా నిన్ను చేరునా నేస్తమా
ఊహకు ఊపిరిపోయవా అల్లరి జావళి పాడవా
అందరిలో ఈ సందడిలో జత చేరవే ఓ చిలకా...
చిరుచిరుగాలి చెప్పిందమ్మ నాతోటి చిన్నమాట
నవ్వును మించింది లేదు అంట
మనసే గనక కరువే అయితే
ఎద గూటిలో గిల్ల చెంత మమతన్నదే రాదుగా...
కలలేగనక నిజమే అయితే
కనుపాపకు ఏనాటికింక కలలన్నవే రావుగా
జీవితమన్నది ఓ కల తీయని ఆశల సంధ్యలా
వెన్నెలలో ఆ కన్నులలో చిగురాశల ఊయలలో ॥చిరుచిరు॥



రచన:శక్తి | 1 | గానం:హని

సాకీ: తికమకపెట్టే అమాయకత్వం చకచకలాడే వేగం...
అలాగ వుంటాం...ఇలాగవుంటాం...ఆకతాయిలం మేము
డైలాగ్: చెప్పేదేదో అర్థమయ్యేట్టు చెప్పరా!..అరెభాయ్..ఇష్టటుగానే చెప్తా..ఇనుకో..
ప: సత్యం పలికే హరిశ్చంద్రులం (2)..అవసరానికో అబద్ధం
నిత్యం నమాజు పూజలు చేస్తాం..రోజా తన్నుకు చస్తాం ॥సత్యం॥
నమ్మితె ప్రాణాలైనా ఇస్తాం..నమ్మడమేరా కష్టం
అరె ముక్కుసూటిగా వున్నది చెప్తాం..నచ్చకుంటే మీ ఖర్మం
అరె కష్టమొచ్చినా..కన్నీళ్లొచ్చినా..చెదరని నవ్వుల ఇంద్రధనుసులం..
మేమే..ఇండియన్స్..మేమే..ఇండియన్స్..మేమే..ఇండియన్స్..అరె మేమే..ఇండియన్స్ ॥మేమే॥
చ: వందనోటు జెబులో వుంటే నవాబునైజం పర్సుఖాళీ అయ్యిందంటే ఫకీరు తత్వం
కళ్లులేని ముసలవ్వలకు చెయ్యందిస్తాం పడుచుపోరి ఎదురుగ వస్తే పళ్లికిలిస్తాం
ప్రేమా కావాలంటాం..పైసా కావాలంటాం..ఏవోకలలేకంటాం...తిక్కతిక్కగా వుంటాం
ఏడేళ్లయినా టి.వి.సీరియల్ ఏడుస్తూనే చూస్తాం
తోచకపోతే సినిమాకెళ్లి రికార్డు డాన్సింగ్ చేస్తాం
కోర్టు తీర్పుతో మనకేం పనిరా నచ్చినోడికోటేస్తాం
అందరు దొంగలే అసలు దొంగకే సీటు అప్పజెప్పిస్తాం
రూలూ వుంది రాంగూవుంది రూలూ తప్పుకు తిరిగే లౌక్యం వుంది ॥మేమే ఇండియన్స్॥
వందేమాతరం..వందేమాతరం..వందేమాతరం..వందేమాతరం ॥వందేమాతరం॥
చ: కలలు కన్నీళ్లెన్నో మన కళ్లల్లో ఆశయాలు ఆశలు ఎన్నో మన గుండెల్లో
శత్రువుకే ఎదురు నిల్చినా రక్తం మనదీ ద్వేషాన్నే ప్రేమగ మార్చిన దేశం మనదీ
ఈశ్వర్ అల్లా ఏసు...ఒకడే కదరా బాసు..దేవుడికెందుకు జెండా..కావాలా పార్టీ అండా
మాతృభూమిలో మంటలు రేపే మాయగాడి కనికట్టు
అన్నదమ్ములకు చిచ్చుపెట్టిన లుచ్చగాళ్ల పనిపట్టు
భారతీయులం ఒకటేనంటూ పిడికిలెత్తి వెయి ఒట్టు
కుట్రలు చేసే శత్రుమూకల తోలు తీసి ఆరబెట్టు
దమ్మేవుంది..ధైర్యంవుంది తలవంచని తెగపొగరేవుంది ॥మేమే ఇండియన్స్॥

రచన: సుద్దాల అశోక్ తేజ | 2 | గానం: చిత్ర, రకీబ్

ప: అహ అల్లరి అల్లరి చూపులతో ఒక గిల్లరి మొదలాయె
ఇహ మెల్లగ మెల్లగ ఎదలోన చిరుగిల్లుడు షురువాయె
అరె చెక్కిలి గిలిగిలి గింతాయె ఈ తిక్క గాలివలనా
మది ఉక్కిరి బిక్కిరి అయిపోయె ఈ రాతిరి దయవలనా
కో: తాన్న దీన్నా తాన్న తన్నినాన తళాంగు తక్కధిన్నా
చ: బుగ్గే నిమురుకుంటే నాకు అరె మొటిమై తగులుతుంటదే..
లేలేత నడుములోని మడతా తనముద్దుకై వేచివున్నదే..
ఇన్నాళ్ల నా ఎదురు చూపులన్ని తన తల్వారు కళ్లలోన చిక్కుకున్నవే
మొత్తం నేలమీది మల్లెలన్ని తన నవ్వుల్లో కుమ్మరిస్తడె
కో: తాన్న దీన్నా తాన్న తన్నినాన తళాంగు తక్కధిన్నా
చ: పేరే పలుకుతుంటే చాలు నా పెదవే తీయగవుతదీ
కనుచూపే తాకుతుంటే నన్నూ అబ్బ - నా మనసు పచ్చిగవుతదే..



చ : నా సిగ్గును దాచుకునే కౌగిలివే నువ్వు
నా వన్నీ దోచుకునే కోరికవే నువ్వు
ముని పంటితొ నను గిచ్చే నేరానివి నువ్వు
నా నడుమును నడిపించే నేస్తానివి నువ్వు
తీరని దాహం నువ్వు నా మోహం నువ్వు
తప్పని స్నేహం నువ్వూ... నువ్వూ..
తీయని గాయం చేసే అన్యాయం నువ్వు
అయినా ఇష్టం నువ్వూ.. నువ్వూ.. ॥నువ్వు॥
మై మరపిస్తూ నువ్వు మురిపిస్తుంటే నువ్వు
నే కోరుకునే నా మరోజన్మ నువ్వు
కైపెక్కిస్తూ నువ్వు కవ్విస్తుంటే నువ్వు
నాకే తెలియని నా కొత్తపేరు నువ్వు
నా అందం నువ్వు ఆనందం నువ్వు
నేనంటే నువ్వూ..
నా పంతం నువ్వు... నా సొంతం నువ్వు
నా అంతం నువ్వూ... ॥నువ్వు॥

రచన: 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి | 6 | గానం: కల్పన

ప : ముసుగు వెయ్యద్దు మనసు మీద
వలలు వెయ్యద్దు వయసుమీద (2)
ఎగరనివ్వాలి కుర్రాళ్లరెక్కల్ని తుఫాను వేగాలతో
ఎవడి ఆనందం వాడిదంటే ఒప్పకోలేరా
అనుభవించందె తెలియదంటె తప్ప అంటారా
మనసు చెప్పిందె మనకు వేదం కాదనేవారె లేరుగా
మనకు తోచిందె చేసి చూద్దాం ఎవడు ఏమంటె ఏంటిరా ॥ముసుగు॥
చ : సూర్యుడైనా చూపగలడా రెయిచాటున్న రేపుని
చీకటైనా ఆపగలడా వచ్చేకలల్ని వద్దనీ
పిరికి పరదా కప్పగలదా ఉరకలేస్తున్న ఆశని
దేవుడైనా చెప్పగలడా సమస్యలనేవి రావనీ
ఎన్నో అందాలు స్వాగతిస్తూ కళ్లముందుండగా
అందుకోకుండా ఆగిపోతూ ఉసూరు మంటేఎలా
ఈ ఉడుకూ ఈ దుడుకూ ఈ వెనక్కి తిరగని పరుగు
ఉండదుగా కడవరకూ ఈ వయస్సునిలాగె కరిగిపోనీకు ॥ముసుగు॥
చ: కొంత కాలం నేలకొచ్చాం అతిథులై వుండి వెళ్లగా
కోటలైనా కొంపలైనా ఏవీ స్థిరాస్థి కాదుగా
కాస్త స్నేహం కాస్త సహనం పంచుకోవచ్చు హాయిగా
అంతకన్నా సొంతమంటూ ప్రపంచ పటంలో లేదుగా
నిన్న లేవైనా గురుతుకొస్తే తీపి అనిపించనీ
ఉన్నకొన్నాళ్లు గుండెనిండా సరదాలు పండించనీ
నీవెవరో నేనెవరో ఈ క్షణాన కలిసి నడుద్దాం
సావాసం సంతోషం ఇవి అందించి అందర్లో నవ్వు నింపుదాం ॥ముసుగు॥

రేయిలయా ఉయ్యాలయా ఇది నా దినచర్యా...యా..
ఆ: వెన్నెల వేటలు చీకటి పాటలు నేర్పవయా...
ఓదార్పవయా ఓ నా గురువర్యా...యా...
అ: ప్రేమంటే ప్రియా...మహా విష్ణుమాయ
ఆ: పోవాలి గయా...మన్మధపేట వయా...
అ: నీకే హార్ప్రదియా సరసం స్టార్టుకియా
ఆ: ఓ ప్రియా...యా...యా...ఇది కలయా...నా ప్రియా...యా...యా...జతకలియా...
ప్రణయారంభానికి తొలి విదియా మైనేప్యార్‌కియా...మైనేప్యార్‌కియా
లాల...లలల...లాల... ॥3॥
ఓ...ఓ...ఓ...షో...ఇన్‌ద న్యూడల్

రచన: చంద్రబోస్ **4** గానం: కీరవాణి

ప/అ: అమ్మగారి నాన్నగారి తాతగారి బామ్మగారి చాటునున్న చంటిపాపరో...
కో: హో ఎక్...సో...హో...ఎక్‌సో
అ: కళ్లజోడు బాపుగారి రాఘవేంద్రరావు గారి ఫిల్ములోని పడుచుపాపరో
కో: హో...ఎక్‌సో...హో...ఎక్‌సో...
అ: సీతారామయ్యగారి కో: మనుమరాలురో
బెల్లంతో కలుపుకుంటే కో: మరమరాలురో
నో అంటే ఎస్ అనిరో పొమ్మంటే రమ్మనిరో
ఛీ అంటూ కసురుకుంటే...టోటల్‌గా ఓకే రో...రో...రో ॥అమ్మగారి॥
చ: ఉత్తరాన్ని చించిందంటే నీ పై చిత్తశుద్ధివున్నట్టే
గిప్పతిప్పి పంపిందంటే నిన్ను గాడుగిప్ప అనుకున్నట్టే...ఏ...
బండబూతు తిట్టిందంటే నీపై బండెడంత ప్రేమున్నట్టే
చెప్పు చేతబట్టిందంటే నీ చెప్పు చేతల్లో ఉంటుందన్నట్టే
కస్ అంటే కిస్సనిరో బుస్ అంటే కస్‌అనిరో...
ఆడవాళ్ల మాటలకు అర్థాలే రివర్స్‌రో ॥అమ్మగారి॥
చ: పైటకాస్త సర్దిందంటే...నిన్ను సైటుకొట్టమన్నట్టే
వెనక్కి తిరిగి చూసిందంటే నీ పై ముందు చూపులున్నట్టే
పళ్లు కాస్త కొరికిందంటే...నీకు పచ్చజెండా చూపినట్టే...
అన్నతోటి చెప్పిందంటే...నిన్ను అల్లుడిగా ఇంట్లోకి రమ్మన్నట్టే...
అబ్బ అంటే తప్పదనిరో ...ఉహు అంటే ఉన్నదనిరో...
ఆడాళ్ల మాటలకు కొత్త డిక్షనరీ కావాల్రో... ॥అమ్మగారి॥

రచన: చంద్రబోస్ **5** గానం: సాధనాసర్గమ్, కళ్యాణ్ మల్లిక్

అ: సన్నజాజి పువ్వా సన్నజాజి పువ్వా చిరుచిరు నవ్వేనవ్వవా ॥2॥
నీ చిరుచిరునగవుల కిలకిల సడితో వలపుల పాటలు పాడవా
వలపుల తెలుగుల తొలి పిలుపులతో చెలిమికి నా మది చూపవా
ఆ: సన్నజాజి పువ్వా సన్నజాజి పువ్వా చిరుచిరు నవ్వేనవ్వవా ॥2॥
నీ చిరుచిరునగవుల కిలకిల సడితో వలపుల పాటలు పాడవా
వలపుల తెలుగుల తొలి పిలుపులతో చెలిమికి నా మది చూపవా ॥సన్న॥
అ: ఏ తోటలో ఏ కొమ్మకో తారల్లే విరిసిన పువ్వా
నాదో కోరిక వినవా తన సిగలో జాబిలి కావా



నువ్వే నా సాయంసంధ్యా
నువ్వేలేని జీవితం నాకసలు ఉందా...
కో: సంధ్యా...సంధ్యా...
ఆ: హు ఈజ్ కాలింగ్ మి హు ఈజ్ టచింగ్ మి
అ: నీ పేరే... కో: టు...టు...టు...టుటర
అ: నా పెదవులు పలికే ప్రియ మంత్రం
నా హృదయం చదివే శుభమంత్రం
ప్రతిఅణువణువువణువు ఉచ్చరించే ప్రాణమంత్రం
ఆ: నీ మాటే... కో: టు...టు...టుటర
ఆ: నా మనసునుతాకే మధుమంత్రం
నా మమతను నేర్పే మృదు మంత్రం
నవనాడులలోన ప్రతిధ్వనించే వేదమంత్రం
అ: సంధ్యా...సంధ్యా...
ఆ: పిలిచెదెవరంట...తలచేదెవరంట కో: టు...టు...టుటర...షో...షో...షో...
అ: నీ పేరే ఏ కోయిల పాడని సుమగీతం ఏ కవులు రాయని రసగీతం
ఆ భగవద్గీతకు బాష్యం చెప్పే భావగీతం
ఆ: నీ మాటే...నా రాతను మార్చే చలిగీతం అది నాతిచరామి సంగీతం
లోలోతున తీయని యాతన పెంచే యుగళగీతం
అ: సంధ్యా...సంధ్యా...
ఆ: విన్నా నీ మాట...ఉంటా నీ వెంటా...

రచన: చంద్రబోస్ **3** గానం: కుమార్‌సాను, సాధనా సర్గమ్

కో: హో...హో...హో...హా...హా...హా...హో...షో ఇన్ ద న్యూడల్
అ: సఖియా...యా...యా...ఇది కలయా
చెలియా...యా...యా...జత కలియా...
ప్రణయారంభానికి తొలి విదియ
మైనే ప్యార్‌కియా... మైనే ప్యార్‌కియా...
ఆ: ఓ ప్రియా...యా...యా...ఇది కలయా
నా ప్రియా...యా...యా...విదియ జత కలియా
ప్రణయారంభానికి తొలి విదియ
మైనే ప్యార్‌కియా...మైనే ప్యార్‌కియా...
ఆ: అల్లరిచూపుల ఆవిరి సైగలు తెలిసెనయ్యా
నను గెలిచెనయ్యా అంటీ ప్రియతనయా...యా...
అ: బుగ్గలసొట్టల గుట్టెడు సొగసులు మెరిసెనయ్యా
నను ముంచెనయ్యా బ్యూటీనేజో హుయా...యా..
ఆ: నీ ఛామనఛాయ మెచ్చా మామమియా
అ: తడిముద్దులియ్య రెడీ వన్‌టూత్రీ యా
ఆ: నిన్నే కిస్సుకియా...నీకే ఛాన్సుదియా
అ: సఖియా...యా...యా...ఇది కలయా
ఆ: ఓ ప్రియా...యా...యా...జత కలియా
అ: పొద్దున ఊసులు మధ్యన ఉరుకులు



రచన: 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి **4** గానం:యస్.పి.బాలు

ఖడ్గం... ఖడ్గం... ఖడ్గం... ఖడ్గం...
ఓం కారనాదంతో అంకురించిన వేద ధాత్రికి సంకేతం ఈ ఖడ్గం
హ్రీంకార నాదంలో సంచరించే ఆదిశక్తికి ఆకారం ఈ ఖడ్గం
తరతరాలుగా కదలివచ్చిన చరిత ఈ ఖడ్గం
యుగయుగాలుగ గమనమాగని ఘనత ఈ ఖడ్గం
తనకళ్లముందెన్ని సామ్రాజ్యశఖరాలు మన్నుపాలైనా
క్షణమైన తనగాధ గతములో విడిచి మృతిఒడి చేరనిదీ ఖడ్గం
పూటకో పడమరను దాటి పూర్వాద్రిపై నిత్యప్రభాతమై వెలుగుతున్నదీ భరత ఖడ్గం
కేవలం ఆయుధం కాదు ఈ ఖడ్గం, ఏదో మహోద్భుతం ఉన్నదీ ఖడ్గం (2)
మూడువన్నెల కేతనముగా మింటికి ఎగసి కాలానికి ఎదురేగు యశోరాశి ఈ ఖడ్గం
హరిని ధరపై అవతరించగ గెలుచుకొచ్చిన భక్తి ఖడ్గం
నరునిలో దైవాంశనే దర్శించి కొలిచిన ముక్తిమార్గం
ఆర్తరక్షణకై ధరించిన ధీరగుణమీఖడ్గం
ధూర్తశిక్షణకై వహించిన కఠకుతనమీ ఖడ్గం
హుంకరించి అహంకరించి అతిక్రమించిన ఆకతాయుల
అంతుచూసిన క్షాత్రస్తత్వం అస్తమించని అర్క ఖడ్గం
శరణుకోరి శిరస్సు వంచి సమాశ్రయించిన అన్నిజాతుల
పొదువుకున్న ఉదారతత్వం జగతిమరువని ధర్మఖడ్గం
నిద్దురమత్తును వదిలించే కెంజాయుల జిలుగీ ఖడ్గం
చిక్కటి చీకటి చీల్చుకువచ్చే తెల్లని వెలుగీ ఖడ్గం
మట్టిని చీల్చుకు చిగురించే సిరిపచ్చని చిగురీ ఖడ్గం
కెంజాయల జిలుగీ ఖడ్గం.. తెలతెల్లని వెలుగీ ఖడ్గం.. సిరిపచ్చని చిగురీఖడ్గం..

రచన: 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి **5** గానం:సుమంగళి

ప: నువ్వు... నువ్వు... నువ్వే నువ్వు నువ్వు... నువ్వు... నువ్వూ...
నువ్వు... నువ్వు... నువ్వే నువ్వు నువ్వు... నువ్వు... నువ్వూ...
నాలోనే నువ్వు నాతోనే నువ్వు నా చుట్టూ నువ్వు నేనంతా నువ్వు
నా పెదవి పైన నువ్వు నా మెడవంపున నువ్వు
నా గుండె మీద నువ్వు నా ఒళ్లంతా నువ్వు
బుగ్గల్లో నువ్వూ... మొగ్గల్లే నువ్వు... ముద్దసే నువ్వూ...
నిద్దర్లో నువ్వూ... పొద్దుల్లో నువ్వు ప్రతినిమిషం నువ్వూ... ॥నువ్వు॥
చ: నా వయసును వేధించే వెచ్చదనం నువ్వు
నా మనసును లాలించే చల్లదనం నువ్వు
పైటే బరువనిపించే పచ్చిదనం నువ్వు
బైట పడాలనిపించే పిచ్చిదనం నువ్వు
నా ప్రతి యుద్ధం నువ్వూ నా సైన్యం నువ్వు
నా ప్రియ శత్రువు నువ్వూ... నువ్వూ...
మెత్తని ముల్లై గిల్లె తొలిచినుకే నువ్వు
నచ్చే కష్టం నువ్వూ... నువ్వూ... ॥నువ్వు॥



మెరిసే మెరుపల్లె వాడొస్తే అబ్బ నా గుండెలోన పిడుగు పడుతున్నదే
ఎదపై ఒక్కసారి హత్తుకుంటే ఇక - నా ఊపిరాగి పోతదే...
కో: తాన్న దీన్నా తాన్న తన్ననాన తళాంగు తక్కధిన్నా

రచన: చిర్రావూరి విజయ్ కుమార్ **3** గానం: శ్రీ

గోవిందా... గోవిందా...గోవిందా గోవిందా
నుదుటిరాతను మార్చేవాడా ఉచిత సేవలు చేసేవాడా
లంచమడగని ఓ మంచివాడా లోకమంతా ఏలేవాడా
స్వార్థమంటూ లేనివాడా బాధలన్నీ తీర్చేవాడా
కోర్కెలే నెరవేర్చేవాడా నాకునువ్వే తోడూనీడా ॥గోవిందా॥
కో: గోవిందా గోవిందా... అరె బాగు చెయ్‌నను గోవిందా
కో: బాగుచెయ్ నను గోవిందా
జూబ్లీహిల్స్‌లో బంగ్లా ఇవ్వు లేనిచో హైటెక్‌సిటి ఇవ్వు
హైజాకవ్వని ఫ్లైటొకటివ్వు వెంటతిరిగే శాటిలైటివ్వు
పనికి రాని చవటలకిచ్చి పరమబేవార్స్‌గాళ్లకిచ్చి
నాకుఎందుకు ఇయ్యవు పిలిచి కోట్లకధిపతి చెయ్‌రా మెచ్చి ॥గోవిందా॥
పెట్రోలడగని కారు ఇవ్వు బిల్లు ఇవ్వని బారు ఇవ్వు
కోరినంత పుడ్డు పెట్టి డబ్బులడగని హోటలు ఇవ్వు
అసెంబ్లీలో బ్రోకర్ పోస్టో రాజ్యసభలో ఎం.పి.సీటో
పట్టుపడని మ్యాచ్‌ఫిక్సింగ్ స్కాముల సంపాదనివ్వు
ఓటమెరుగని రేసులివ్వు లాసురాని షేరులివ్వు
సింగిల్ నెంబర్ లాట్రీలివ్వు టేక్స్ అడగని ఆస్తులివ్వు
పనికిరాని చవటలకిచ్చి పరమ బేవార్స్‌గాళ్లకిచ్చి
పనికిరాని చవటలకిచ్చి పరమ బేవార్స్‌గాళ్లకిచ్చి
నాకు ఎందుకు ఇయ్యవు పిలిచి కోట్లకధిపతి చెయ్‌రా మెచ్చీ... ॥గోవిందా॥
వందనోట్ల తోటలివ్వు గోల్డ్‌నిధుల కోటలివ్వు
లేకపోతే -వెయ్యిటన్నుల -కోహినూర్ డైమండ్స్ ఇవ్వు
మాస్‌హీరో చాన్సులివ్వు -హిట్టు సినిమా స్టోరీలివ్వు
స్లిమ్ముగున్న -సొమ్ములున్న-హీరోయిన్నే వైఫుగ ఇవ్వు
హాలీవుడ్‌లో స్టూడియోనివ్వు-స్విస్సుబ్యాంకులో బిలియన్లివ్వు
కోట్లుతెచ్చే కొడుకులనివ్వు -హీరోలయ్యే మనవలనివ్వు
నన్నుకూడా సి.ఎం.చెయ్యి లేకపోతే పి.ఎం.చెయ్యి
తెలుగు తెరపై - తిరుగులేని -తరిగిపోని లైఫునియ్యి ॥గోవిందా॥
కో: గోవిందా గోవిందా
బాగుచెయ్‌నను గోవిందా
కో: బాగుచెయ్‌నను గోవిందా
అరె పైకితేనను గోవిందా
కో: గోవిందా గోవిందా
లక్కుమార్చి నను కరుణిస్తే తిరుపతొస్తె త్వరగా చూస్తే
ఏడుకొండలు ఏసి చేస్తా...ఎయిత్‌వండర్ నీగుడి చేస్తా...॥ ఏడు ॥ ॥గోవిందా॥
అయ్య బాబోయ్ దేవుడు మాయమైపోయాడేంటీ?

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# యువరత్న

Gem of The Youth

నందమూరి రామకృష్ణ యు.నారాయణరావు

యం.యం. కీరవాణి చంద్రబోస్


నందమూరి రామకృష్ణ


కీరవాణి


యు. నారాయణరావు


చంద్రబోస్


కులశేఖర్


ఆర్.పి.పట్నాయక్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ - మాటలు | : సతీష్ |
| పాటలు | : చంద్రబోస్, కులశేఖర్ |
| సినిమాటోగ్రఫీ | : వి.శ్రీనివాసరెడ్డి |
| థ్రిల్స్ | : హార్స్‌మెన్ బాబు |
| స్టిల్స్ | : దాస్ |
| పబ్లిసిటీ డిజైన్స్ | : సురేష్ బుజ్జి |
| ప్రొడక్షన్ | : రాము, వీరభద్రరావు, రాయుడు |
| పి.ఆర్.ఓ. | : బి.ఎ. రాజు |
| కూర్పు | : కోటగిరి వెంకటేశ్వరరావు |
| ప్రొడక్షన్ | : అంజయ్య |
| సంగీతం | : ఎం.ఎం.కీరవాణి |
| నిర్మాత | : నందమూరి రామకృష్ణ |
| దర్శకత్వం | : యు.నారాయణరావు |

## తారాగణం

తారకరత్న, జివిధ, చంద్రమోహన్, సుధ, తనికెళ్ల భరణి, ఎల్.బి.శ్రీరామ్,ఎం.ఎస్.నారాయణ, సన, సునీల్, చిత్రం శ్రీను, ఖయ్యూమ్, కృష్ణప్రియ



పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

కార్తికేయా క్రియేషన్స్

# ఖడ్గం

మధుమురళి కృష్ణవంశీ


కృష్ణవంశీ

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | :సత్యానంద్ |
| పాటలు | : సిరివెన్నెల సీతారామశాస్త్రి, శక్తి, సుద్దాల అశోక్‌తేజ, విజయ్‌కుమార్ |
| సంగీతం | : దేవీ శ్రీ ప్రసాద్ |
| కెమెరా | :ఎస్.కె.భూపతి |
| ఎడిటింగ్ | : శ్రీకర్ ప్రసాద్ |
| కొరియోగ్రఫీ | :బృంద, శంకర్, రాజశేఖర్ |
| ఆర్ట్ | : పేకేటి రంగా |
| స్టిల్స్ | : పాండ్యన్ |
| థ్రిల్స్ | :హార్స్‌మెన్ బాబు, రామ్‌లక్ష్మణ్ |
| పి.ఆర్.ఓ. | : వేణు గోపాల్ |
| పబ్లిసిటీ డిజైన్స్ | : అనిల్‌భాను |
| కో-డైరక్టర్ | :సూర్యదేవర లలిత ప్రభాకర్, నాగ్ |
| అసోసియేట్ డైరక్టర్స్ | : రమణ, గోపాల్‌రెడ్డి, కుమార్, కళ్యాణ్, నారాయణ |
| నిర్మాత | : మధు మురళి |
| దర్శకత్వం | : కృష్ణవంశీ |


సీతారామశాస్త్రి


సుద్దాల అశోక్‌తేజ


దేవిశ్రీ ప్రసాద్


శక్తి


చిర్రావూరి విజయ్‌కుమార్

## తారాగణం

శ్రీకాంత్, ప్రకాష్‌రాజ్, రవితేజ, బ్రహ్మాజీ, ఉత్తేజ్, ఎం.ఎస్.నారాయణ, గిరిబాబు, ఆహుతిప్రసాద్, రఘుబాబు, షఫి, రామచంద్రరావు, పృథ్వి, సోనాలిబింద్రే, కిమశర్మ, పూజా భారతి, సంగీత, పుష్పలత, పావలాశ్యామల, అయేషాజలీల్

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం: గూంజ్ ఉఠీ షెహనాయి
సంగీతం: వసంత్ దేశాయ్
రచన: భరత్ వ్యాస్
గానం: లతా మంగేష్కర్
అభినయం: రాజేంద్ర కుమార్, అమిత

# తేరే సుర్ ఔర్ మేరేగీత్...



తేరేసుర్ ఔర్ మేరేగీత్ (2)
దోనోం మిల్‌కర్ బనేగీ ప్రీత్
తేరే సుర్ ఔర్ మేరేగీత్
ధడ్‌కన్ మేం తూ హీ తూ ఛాయా హువా
॥ధడ్‌కన్ మేం॥
దునియా కే మేలే మేం లాఖోం మిలే
మగర్ తూ హీ తూ దిల్ కో భాయా హువా
మైం తేరీ జోగన్ తూ మేరా మీత్
దోనోం మిల్‌కర్ బనేగీ ప్రీత్
ముఝుకో అగర్ భూల్ జావోగే తుమ్
ముఝుసే అగర్ దూర్ జావోగే తుమ్
॥ముఝుకో అగర్॥
మేరీ మొహబ్బత్ మేం తాసీర్ హై (2)
తో ఖించ్‌కే మేరే పాస్ ఆవోగే తుమ్
దేఖో హమారీ హోగీ జీత్
దోనోం మిల్‌కర్ బనేగీ ప్రీత్
తేరే సుర్ ఔర్ మేరే గీత్





పండిట్ బిస్మిల్లా ఖాన్‌కు సినిమా సంగీత దర్శకునిగా ఎన్నో అవకాశాలు వచ్చినా ఆ వాతావరణం నచ్చక ఆయన తిరస్కరించారు. సినిమా సంగీతంలో ఉండే పరిధులు, ప్రతిబంధకాలు ఆయనకు నచ్చేవి కావు. కానీ 'గూంజ్ ఉఠీ షహనాయి' చిత్రంలో సన్నాయికి ఉండే ప్రాముఖ్యత దృష్ట్యా ఆయనను సన్నాయి వాయించడానికి ఒప్పించారు చిత్ర నిర్మాతలు శంకర్ భాయ్ భట్, విజయ్ భట్.

శాస్త్రీయ సంగీత కచ్చేరీలు ఇచ్చే గాత్ర, వాద్య విద్వాంసులను సినిమాలలో ఉపయోగించుకునే సంప్రదాయం ఎప్పటినుంచో ఉంది. ఉదాహరణకి ఈమని శంకర శాస్త్రిగారు 'సీతారామకళ్యాణం' సినిమాలో రుద్రవీణ వాయించటం, ఆయన శిష్యుడు చిట్టిబాబు 'డాక్టర్ చక్రవర్తి' సినిమాలో 'పాడమని నన్నడగవలెనా' పాటకు వీణ వాయించటం, 'మురిపించే మువ్వలు' సినిమాలో 'నీలీలపాడెద దేవా' పాటకు కారుకురిచ్చి



అరుణాచలం నాదస్వరం వాయించటం, 'పూజాఫలం' సినిమాలో అక్కినేని నాగేశ్వరరావు వయొలిన్ వాయించే సన్నివేశాలకు పరూర్ గోపాలకృష్ణన్ వయొలిన్ వాయించడం ఇలా చెప్పుకుంటే చాలా ఉన్నాయి. బిస్మిలాఖాన్ షెహనాయి వాయిద్యం మన తెలుగులో 'సన్నాయి అప్పన్న'లో కూడ వినిపించింది.

'వచన్' మొదలైన చిత్రాలలో వివిధ పాత్రలను పోషించిన రాజేంద్రకుమార్ కు హీరోగా ఇది తొలి చిత్రం. ఇందులో వీణా







విద్వాంసుడు ఉస్తాద్ అబ్దుల్ హలీమ్ జాఫర్ ఖాన్, బిస్మిల్లా ఖాన్‌ల జుగల్‌బందీ ఎంతో ప్రసిద్ధిగాంచింది. జుగల్‌బందీ అంటే ఇద్దరు కళాకారులు తమ గాత్రాలను గానీ వాయిద్యాలను గానీ మేళవించే ప్రక్రియ. జాఫర్‌ఖాన్ గారి వీణ, బిస్మిల్లాఖాన్ గారి షహనాయి కలసిన అద్భుతమైన సంగీతం చిత్రానికి అదనపు ఆకర్షణ.



'సుర్' అంటే స్వరం. బహువచనానికి కూడా 'సుర్' అనే అంటారు. 'గీత్' అంటే గీతాలు. ప్రీత్ అంటే ప్రేమ. ఛాయాహువా అంటే వ్యాపించివుంది. ఛాయా అంటే నచ్చిన

**'నీ స్వరాలు నా పదాలు**
**రెండూ కలిసి ప్రేమయ్యేను'**

సన్నాయిపై అతను పలికించే స్వరాలు, ఆమె పాడే పదాలు కలిసిప్రేమ పుడుతుందని ఆమె అంటోంది. కళలన్నీ ప్రేమ స్వరూపాలే కదా. ఇక్కడ 'ఇది కథ కాదు' చిత్రంలోని 'సరిగమలు గలగలలు' పాట గుర్తు వస్తుంది. ప్రియుడి సంగీతానికి ప్రియురాలు నాట్యం తోడైన ప్రేమ కథ ఆ గీతం.



'ధడ్‌కన్' అంటే 'గుండె సవ్వడి' 'ఖయాల్' అంటే 'తలపు', ఊహ. 'జోగన్' అంటే 'భర్తురాలనే' అనే అర్థం వస్తుంది. 'మీత్' అంటే మిత్రుడు, సఖుడు. 'దునియా కా మేలా' అంటే 'జగన్నాటకం' అని చెప్పుకోవచ్చు.



**'గుండె సవ్వడిలో నీవు ఒదిగి ఉన్నావు**
**తలపుల్లో నీవే నిండి ఉన్నావు**
**ఈ జగాన ఎందరో తారసపడ్డారు**
**కానీ నీవే నా మనసుకు నచ్చావు**
**నిన్నే ఆరాధిస్తాను, నీవే నా సఖుడవు'**

అతడినే తన సర్వస్వంగా భావించి పూజిస్తోంది ఆమె. ఆమె హృదయంలో, ఆమె ఊహల్లో అన్నిటా అతనే. ఈ జగన్నాటకంలో ఎందరు ఎదురుపడినా మనసుకు నచ్చినది అతనే.



'భూల్ జానా' అంటే మరచిపోవటం. 'దూర్‌జానా' అంటే దూరమవటం. 'జీత్' అంటే గెలుపు. తాసీర్ అంటే గుణం.

'నీవు నన్ను మరచిపోతే నీవు నాకు దూరమైతే
నా ప్రేమలోని పాశం నా వద్దకు రప్పిస్తుంది నిన్ను
మనమే గెలుస్తాం చూడు.'

అతడు తనను మరచిపోయి దూరమైనా తన ప్రేమ అతన్ని తన వద్దకు రప్పిస్తుందనే నమ్మకం ఆమెది. ఎలాంటి ప్రతికూల పరిస్థితులలోనైనా తామే గెలుస్తామనే విశ్వాసం ఆమె ప్రేమలో ఉంది.

- పి.వి. సత్యనారాయణరాజు

# న్యూస్ వ్యూస్



ఇల్టన్

గతవర్షం నవంబరు 2వ తారీకున సర్ ఇల్టన్ జాన్ బెంగుళూర్‌లో కచ్చేరీ చేసాడు. 'దిస్ ఈజ్ యువర్‌సాంగ్' తో ప్రారంభించి తను సంగీతం అందించిన 'లయన్‌కింగ్' పాటలతో సహా 'బోర్డర్ సాంగ్' 'రాకెట్‌మాన్' 'టైనీ డాన్సర్' వంటి పాటలతో 15,000 మంది శ్రోతల హృదయాలను దోచుకున్నాడు. కానీ అందరినీ కదిలించిన పాట మాత్రం డయానాపై పాడిన 'క్యాండిల్ ఇన్ ది విండ్', శాక్రిఫైస్.

## ఆకాశవాణి సంగీత సమ్మేళనం - 2002

1954వ సంవత్సరం నుండి ఆకాశవాణి ఏటేటా వినిపించే సంగీత సమ్మేళనం నవంబరు 16 నుండి ప్రారంభం కాబోతుంది. దేశంలోని వివిధ నగరాలలో నిర్వహించిన కచ్చేరీలు 5 వారాలపాటు ప్రతీరోజూ రాత్రి 10 గం॥ల నుండి 11 గం॥ల వరకు ఆకాశవాణి ముఖ్యకేంద్రాల ద్వారా వినవచ్చు. శ్రోతల సౌకర్యార్థం ఈ పక్షంలో వినవచ్చే కార్యక్రమాల వివరాలు అందిస్తున్నాం.

నవంబర్

| | | | | |
|---|---|---|---|---|
| 16 శనివారం | - | తిరువిళా జయశంకర్ | - | నాదస్వరం |
| 17 ఆదివారం | - | పండిట్ రామ్‌నారాయణ్ | - | సారంగి |
| 18 సోమవారం | - | సుగంధా కళామేఘం | - | గాత్రం |
| 19 మంగళవారం | - | విదుషి సులోచనా బృహస్పతి | - | గాత్రం |
| 20 బుధవారం | - | టి.ఎస్.శంకరన్ | - | ఫ్లూటు |
| 21 గురువారం | - | గణేశమోహన్ | - | సితార్ |
| 22 శుక్రవారం | - | రాజకుమార్ భారతి | - | గాత్రం |
| 23 శనివారం | - | పండిత గోకులోత్సవజీ మహరాజ్ | - | గాత్రం |
| 24 ఆదివారం | - | కె.ఎల్.గిండే | - | ఫ్లూటు |
| 25 సోమవారం | - | ఎమ్.చంద్రశేఖరన్ | - | వయోలిన్ |
| 26 మంగళవారం | - | అజయ్‌ఫోన్కర్ | - | గాత్రం |
| 27 బుధవారం | - | మధురై టి.ఎన్.శేషగోపాలన్ | - | గాత్రం |
| 28 గురువారం | - | రాజీవ్ తారానాథ్ | - | సరోద్ |
| 29 శుక్రవారం | - | కళ్యాణి లక్ష్మీనారాయణ | - | వీణ |
| 30 శనివారం | - | పండిట్ మణిప్రసాద్ | - | గాత్రం |

MAA TV

## మా టీవీ సమర్పించు

## పాడాలని వుంది





కార్యక్రమాల వివరాలు

సూత్రధారి :యస్పీ బాలసుబ్రహ్మణ్యం

న్యాయ నిర్ణేత: కోటి

ఫైనల్స్ మొదటిభాగం : 16-11-02

ఫైనల్స్ రెండవభాగం: 23-11-02



1. మృదుల

శివానీ భవానీ..... (స్వాతికిరణం)

వినిపించని రాగాలే (చదువుకున్న అమ్మాయిలు)



2. కళ్యాణ్ వసంత్

శివశంకరి...శివానందలహరి (జగదేకవీరుని కథ)

అలిగితివా సఖీప్రియా (శ్రీ కృష్ణార్జున యుద్ధం)



3. సౌమ్య వారణాసి

నినుచేర మనసాయెరా (బొబ్బిలియుద్ధం)

వెన్నెల్లో గోదారి అందం (సితార)



4. ప్రణవ శేషసాయి

శ్రీ తుంబుర నారద గానామృతం (భైరవద్వీపం)

మాటేరాని చిన్నదాని (ఓ పాపలాలీ)



5. పల్లవిసూరి

శ్రీగౌరి శ్రీగౌరియె (విచిత్ర దాంపత్యం)

నెమలికి నేర్పిన నడకలివే (సప్తపది)

## కొంటెకొశ్చెన్లు-తుంటరి జవాబులు



టి.యస్.ఆర్.శివప్రసాద్, మౌలాలీ

✪ ఒకచెంపమీద కొడితే రెండో చెంప చూపించమన్నారు గాంధీగారు. ఎందుకలా!?

★ ఒక కన్ను కన్నూకాదు ఒకబిడ్డ బిడ్డాకాదూ అన్నారు. తాంబూలం లో ఒక్క ఆకు పెట్టకూడదన్నారు. దక్షిణ ఇచ్చేటప్పుడు కూడా ఒక్క పండు కూడదన్నారు. ఇదీ మన సంప్రదాయం. బహుశా గాంధీగారుకూడా అందుకే చెప్పివుంటారు.

✪ ఆనాడు షాజహాన్ తన భార్య కోసం తాజ్‌మహల్ కట్టించాడు. ఈనాటి భర్తలు తమ భార్యలకోసం ఏం కడుతున్నారు?

★ చిట్‌లు

✪ 'ఉష్ణం ఉష్ణేన శీతలం' అనే సూక్తి ఎప్పుడు పుట్టింది? ఋజువులు ఏవైనా ఉన్నాయా?

★ నిప్పులాంటి సీత అగ్నిప్రవేశం చెయ్యగానే ఆ మంటలు చల్లారిపోయి ఆవిడగారు సేఫ్‌గా బైటికి రావడమే పెద్దఋజువు. బహుశా అప్పుడే పుట్టిఉంటుందీ సూక్తి.

## డబుల్‌రోల్



★ అతను అందర్నీ 'దగా'చేసి 'ఎదగాలి' అని అనుకుంటూ ఉంటాడు.

★ ఆ'నలుగు' పిండి 'నలుగురికి' చాలదూ!?

-పి.పి.యస్.అప్పారావు
రామచంద్రాపురం

★ అక్కడికివెళ్లి ఆ 'గుహలో' నుండి 'హలో' అని అరిచిచూడు

-సి.వరహాలరావు
చందానగర్



## చిలిపి లిపి



key do = కీడు

బి.విశ్వజ
చందానగర్

Ball Flowers =బంతిపూలు

-రామ్‌శంకర్
సింహాచలం

Vc గి ,Way Sawరి = విసిగి,వేసారి

-బి.శ్రీరామ్
రుద్రారం

## ఈ రూటే వేరు



దస్తూరి = పదవసారి (దస్+తూరి)

-ఎస్.కే.రావ్
అరకు

మిస్‌లీడ్= పెళ్లికాని యువతి నాయకత్వం వహించుట

సేనాపతి= నా భర్త అని చెప్పు

-డి.బల్తజార్
ఆర్.సి.పురం

## చిలిపి కవిత



ఇల్లు ఓ అసెంబ్లీ అయితే
అత్త -ప్రభుత్వం
కోడలు -ప్రతిపక్షం
మొగుడూ, పిల్లలూ ప్రజానీకం
గిన్నెలు -చెంబులూ ఎదురుకాల్పుల్లో
మరణించే నక్సలైట్లు
ఇరుగు-పొరుగుదిన పత్రికలు
బంధు మిత్రులు పాఠకులు

-కె.వెంకటేశ్వర్లు
విశాఖపట్నం.

## పేరు -రిపేరు




'నువ్వు -నేను' -'కలసివుంటే కలదు సుఖం'

-మాధవీ సనారా
ఖరగ్‌పూర్

హాయ్ -బావగారూ బావున్నారా-ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం

-కందుకూరి శివరామకృష్ణ ప్రసాద్
మదనపల్లి

'అత్తా నీ కొడుకు జాగ్రత్త - టాప్‌లేచిపోద్ది'
'అమ్మ నా కోడలా -ఇదెక్కడి న్యాయం'.

-మామిడి మహేంద్ర
పూణే

## పేరడీ పేరేడ్



ఈ చీకటి రాత్రిలో -ఏ దుండగులొత్తురో
ఈ మేడల మీదన - ఏ బాంబులు వేత్తురో
ఓ...ఓ...ఓ...ఓ... ॥ఈ చీకటి॥
గునపాలను బల్లేలను
బహునేర్పుగ గుచ్చెదరు
కడపబాంబులే తెచ్చి
గోడలన్ని పేల్చెదరు ॥ ఈ చీకటి॥
కదలలేము మెదలలేము
పెదవి విప్పి పలుకలేము
చిరు యలికిడి విన్నంతనే...
దడదడమని గుండెలదురు ॥ఈ చీకటి॥
పైన గేటు వేసినాము
లోన కప్ప పెట్టినాము
ఐనగాని దొంగలన్న
భయమే దడ తెప్పించును ॥ఈ చీకటి॥

-బద్ది నాగేశ్వరరావు
అనకాపల్లి

(అమరశిల్పి జక్కన్న చిత్రంలో ఈ నల్లని రాళ్లలో....అనే పాటకు పేరడీ)



## సీరియల్ 20

- మల్లాది వెంకట కృష్ణమూర్తి





### జరిగిన కథ

అనన్య బామ్మ గారికి, గ్రామం అనే ఆయనకు ఆవిడ ఇల్లు గురించి కుదిరిన ఒప్పందం ప్రకారం బామ్మ బతికున్నంతకాలం అప్రతీనెలా గ్రామం డబ్బుఇవ్వాలి. బామ్మపోయాక ఇల్లు అతని స్వంతం అవుతుంది. కాలక్రమేనా గ్రామం, అతని కొడుకులు పోతారు కానీ బామ్మ ఆరోగ్యంగా ఉంటుంది. బామ్మ చస్తే ఇల్లు తన స్వంతమవుతుందని గ్రామం మనుమలలో ఒకడైన లింగమయ్య రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే సుబ్బారావుకి చెప్తాడు. బామ్మకు చావు 'ఎరేంజ్' చేయడానికి హరకేశం అనే కిరాయి హంతకుడి సాయం తీసుకోమంటాడు సుబ్బారావు. తెలివిగా హత్యచేయగల హరకేశం బామ్మను చంపడానికి కొత్తరకం ప్లానువేసి వాళ్ళ ఇంటికి వచ్చాడు.

ఆ రాత్రి అంతా గాఢ నిద్రలో వుండగా హరకేశం సైకిల్ దిగి, దాన్ని బామ్మ ఇంటి కాంపౌండ్ వాల్‌కి ఆనించి స్టాండ్ వేసాడు. తర్వాత నెమ్మదిగా సైకిల్ సీట్ మీదకు ఎక్కి చేతులు పైకి చాపితే కాంపౌండ్ వాల్ పైభాగం అందుతోంది. చేతిలో సిద్దంగావున్న, నాలుగు మడతలుగా మడచిన చిన్నపిల్లల రబ్బరు మ్యాట్‌ని ఆ గోడ మీద పరిచాడు. ఎప్పుడో చాలా కాలం క్రితం ఆ గోడ మీద దొంగలు రాకుండా అతికించిన గాజుముక్కలున్నాయి. అయితే రబ్బర్ మ్యాట్ వల్ల, అవి గోడమీదకి ఎక్కిన హరకేశానికి ఎలాంటి హాని కలిగించలేకపోయాయి.

గోడమీంచి అందే బాదంచెట్టుకొమ్మని అందుకుని, ఆ చెట్టుకొమ్మ ఆధారంగా లోపలికి చేతులతో జరిగి కిందకి దూకాడు. కింద పెరుగుతున్న తోటకూర పాదులో పడ్డాడు.

కొద్దిసేపు కదలకుండ నిలబడి చుట్టూచూసాడు. అంతా నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగా వుంది. నెమ్మదిగా ఆ భవంతి వైపు కదిలాడు. పైన ఓ కిటికిలోంచి, కింద రెండు కిటికీల్లోంచి నైట్ బల్బ్ కాంతి బయటకు పడుతోంది. కింద లైటు పడుతున్న ఓ కిటికీ దగ్గరకి వెళ్ళి లోపలికి తొంగిచూసాడు.

మంచం మీద పడుకుని వున్న ఓ పడుచు పిల్లని చూసి, ఆమె లింగమయ్య చెప్పిన బామ్మ మనుమరాలు అనన్య అని గ్రహించాడు. రెండో కిటికీ దగ్గరకీ నడిచి లోపలికి చూసాడు. లోపల పాత కాలపు పెద్ద పందిరి పట్టె మంచం మీద పడుకుని వున్న బామ్మ కనబడింది. తలదాక ముసుగు పెట్టుకుని వుంది.

జేబులోంచి చిన్న చింత పిక్కని తీసి కిటికీ లోంచి లోపలికి విసిరాడు. అది గోడకు వేలాడే అద్దాన్ని చప్పుడుచేస్తూ తాకి కింద పడింది.

ఆ శబ్దానికి బామ్మకి మెలకువ రాలేదని నిశ్చయించుకున్నాక హరకేశం జేబులోంచి టేప్‌ని తీసాడు. అది మెటల్ స్ట్రిప్‌తో చేసిన, కార్పెంటర్స్ ఉపయోగించే టేపు. దాన్ని నెమ్మది నెమ్మదిగా బయటకు తీస్తూ రెండుగజాలు బయటకు తీసి ఆ టేప్‌ని కిటికీలోంచి లోపలికి పోనించాడు. సరిగ్గా బామ్మ నడుం దాకా వెళ్లిందా రెండు గజాల టేప్. బామ్మ తల దాకా ఇంకో రెండున్నర అడుగుల దాకా వెలితి వుందని తెలుసుకున్నాక మొత్తం 'మూడు గజాల మేర' అని మనసులో గుర్తుంచుకున్నాడు.

టేప్‌ని మళ్ళీ దాని హోల్డర్‌లోకి ఎక్కించి జేబులో పెట్టుకున్నాక చీకట్లో ఆ బిల్డింగ్ చుట్టూ తిరిగి చూసాడు. అడ్డదిడ్డంగా పెరిగిన గడ్డి, పొదలు, పిచ్చిమొక్కలతో నిండి వుందా ఆవరణంతా. అతను వెతికేది ఓ చోట కనబడింది.

ఎప్పుడో కాకరపాదు కోసం వేసిన చిన్న వాసాల పందిరి కనిపించింది, ఆ వాసాలు వరీక్షించి చూసాక అది తనకు పనికివస్తుందని తృప్తిచెందాడు.

**తెలుగు సినిమాలని చూడ్డం శర్మగారు ఎందుకు మానేసారంటే, కాశీలో బుతుని వదిలేసానన్నారట. అలాగే కాశీలో హింసని వదలని, ప్రాణాలు తీసే హరకేశం ఇప్పుడు వేసిన చిత్రమైన పథకం ఏమిటి? ఈ సీరియల్‌లో ఆ వివరాలు, పథకాలు చదవచ్చు.**

మరోసారి కిటికీ దగ్గరకి వెళ్ళి లోపలికి చూసాడు. ప్రశాంతంగా నిద్ర పోతోందా ముసలావిడ.

మర్నాడు సరిగ్గా ఆ సమయానికి బామ్మ పని ఖతం అనుకుని వెనక్కి తిరిగాడు.

* * *

'తలచినదే జరిగినదా దైవం ఎందులకు, జరిగినదే తలచితివా శాంతిలేదు నీకు'

ఘటోత్కచుడి చిత్రానికి పూజచెయ్యడం పూర్తయ్యాక, వెంకటేశ్వర మహాత్యం లోని ఎన్.టి.ఆర్. బొమ్మకి పూజచేస్తూ మళ్ళీ భక్తిగా పాడుతూ పూజ చేయసాగింది అనన్య.

"శేషశైలా వాసా శ్రీ వెంకటేశా, శయనించు మా అయ్య శ్రీ తిరుమలేశ"

ఆ తర్వాత 'హమ్ తుమ్ ఏక్ కమరేమె బంద్ హో' అనే పాట బాణీలో స్వయంగా రాసిన శ్రీ సాయినాథుని పాట పాడుతూ, ఆయన వేషంలో వున్న విజయచందర్ ఫోటోకి హారతి ఇచ్చింది అనన్య.

"శ్రీ సాయి సేవ చేయాలనుంది జాగుసేయక దిగిరా...." హారతిచ్చి దాన్ని భక్తిగా తన కళ్ళకద్దుకుని బామ్మ దగ్గరకి వెళ్ళింది.

"ఏమిటి ఇవాళ నీ పాట స్టయిల్ మార్చినట్టున్నావ్?" నవ్వుతూ అడిగింది బామ్మ హారతి కళ్ళకద్దుకున్నాక.

"అవును బామ్మా నా చిన్నప్పటినించి పాడుతూవస్తున్న సినిమా పాటలు నాకే విసుగేస్తున్నాయి. ఇంక దేవుళ్ళకెందుకు విసుగేయదు అనిపించి సినిమా బాణీల్లో నేనే కొన్ని పాటలని ఆఫీస్ అవర్స్‌లో రాసుకుంటున్నాను".

"శుభం, వెన్నెల్లో హాయి హాయి, ట్యూన్‌లో ఒకటి ఆలోచించు దేవుళ్ళు ఇష్టపడొచ్చు".

"ఈ మధ్య అన్నమయ్య, మంజునాధలు తప్పితే భక్తి పాటలున్న సినిమాలే బొత్తిగారావడం లేదు బామ్మా."

"అవును గానీ కొబ్బరి ముక్క ఇంకాస్త పెట్టు. తియ్యగా బావుంది."

తన ప్రాణాల మీద జరుగుతున్న కుట్ర గురించి తెలీని బామ్మ, అనన్య బేంక్‌కి వెళ్ళగానే కంప్యూటర్ ఆన్‌చేసి సోలిటైర్ గేమ్‌ని నిశ్చింతగా ఆడుకోసాగింది.

* * *



అదే రోజు ఉదయం నిద్రలేచిన రాజు తన తల్లితో చెప్పాడు.

"అమ్మా నా కివాళ కూడా కల్లో షిర్డి సాయి బాబా కనిపించాడు."

"ఏమన్నారు?" కాఫీ తాగుతూ పేపర్ తిరగేస్తున్న వాసవి యధాలాపంగా అడిగింది.

"రేపటికల్లా మరియమ్మ చచ్చిపోతుందని చెప్పారు"

"ఎవరు?"

"మరియమ్మ మమ్మీ"

"అదే మరియమ్మంటే ఎవరు?" కొద్దిగా ఆందోళనగా అడిగింది వాసవి.

"మా స్కూల్లో ఆయా"

కొద్ది క్షణాల తర్వాత చెప్పింది

"నాతో చెప్పినట్లుగా ఈ సంగతి స్కూల్లో ఎవరితో చెప్పకు, నీకు పిచ్చనుకుంటారు."

"ఎవరితోనూ చెప్పను మమ్మీ,ఒక్క మరియమ్మతోనే చెప్తాను."

"ఇంకానయం. అసలు చెప్పకూడనిది ఆవిడకే, కొట్టినా కొడుతుంది జాగ్రత్త"

"పాపం చెప్తే, ఇంకోరోజులో చచ్చిపోతానని తెలిస్తే, చేయాల్సిన పనులు చేసకుంటుంది కదా మమ్మీ"

"అలా అయితే అసలు నువ్వు ఇవాళ స్కూల్‌కే వెళ్ళకు" కోపంగా అరిచింది వాసవి.

"మానేయమంటే మానేస్తాను"

"మానేయ్"

వాసవి ఆరోజు స్కూల్‌కి పంపనేలేదు. మధ్యాహ్నం నంద్యాల నుంచి భర్త ఫోన్ రాగానే చెప్పింది.

"మీ ఫోన్ కోసమే పొద్దున్నించి ఎదురు చూస్తున్నానండి. ఎప్పుడొస్తున్నారు?"

"రెండ్రోజుల్లో, ఓ రోజు కర్నూలు, ఇంకోరోజు ఆదోని కేంప్."

"ఇవాళ్ళ రాజుని నేను స్కూల్‌కి పంపలేదు."

"ఏం?"

**ఈ రోజుల్లో చెత్తసినిమా అంటే అన్న, చెల్లెళ్ళిద్దరూ కలిసి చూడదగ్గదిట. హింస, సెక్స్ లేకపోయినా ఆ పోలిక ఈ సీరియల్‌కు వర్తించదు. నవ్వు తెప్పించేది కావాలంటే ఓసారి ఈ పక్షం చదివి చూడండి.**

"నాకెందుకోభయంగా వుందండి"

"దేనికి భయం?"

"వాడికేవయినాఅతీంద్రియ శక్తులొచ్చా యేమో నని"

"అదేంటి?"

"వారంక్రితం వాడికి కల్లో సాయిబాబా కన్పించి మీ బాత్‌రూంలోని బల్లి చచ్చి పోతుందని చెప్పాడట, నిజంగా ఆరోజు చచ్చిన బల్లి మన బాత్‌రూమ్‌లో కనిపించింది."

"కలత నిద్రలో ఎన్నో కలలు. అన్నీ నిజం అవుతాయా? దాని ఆయుష్షు తీరి అది చచ్చివుంటుంది"

"అంతకుమునుపు కూడా వాడు కలల్లో బాబా కనిపించి చెప్పాడని చెప్పినవన్నీ నిజం అవుతూనే వచ్చాయి కదండి?"

"నన్నడిగితే వాడికి ముందురోజు ఆ చచ్చిన బల్లి కనిపిస్తే, దాన్ని బాత్‌రూంలో వుంచి, ఆ కల వచ్చిందని చెప్పివుంటాడు గోరింతలు కొండంతలు చేసుకుని ఆలోచించక, ఇంతకీ దేనికి జడిసి బడికి పంపలేదు వాడ్ని?"

"రేపు వాళ్ళ స్కూల్లో ఆయా మరియమ్మ చచ్చిపోతుందనీ రాత్రి కల్లో బాబా చెప్పాడని చెప్పాడు. స్కూల్లో అందరికీ అది చెప్తే ఎంత అసహ్యంగా ఉంటుంది? వీడు డైరెక్ట్‌గా మరియమ్మతోనే ఆ విషయం చెప్తానన్నాడు. అందుకని భయం వేసి పంపలేదు"

"వాడో పిచ్చి మొద్దు, నువ్వింకా పిచ్చిమొద్దువి, ఇంకెప్పుడూ ఇలాంటి కారణాలకి వాడిని బడి మాన్పించక" కోప్పడ్డాడు వాసవి భర్త.

"ఇన్ని కలలు ఒక దాని తర్వాత ఒకటి నిజం అవుతున్నాయంటే..." అర్థోక్తిగా ఆగిపోయింది వాసవి.

"అందుకే ఇప్పుడే చెప్పాగా నువ్వో పిచ్చి మొద్దువని" నవ్వాడు వాసవి భర్త ఆ తర్వాత ఇతర విషయాలు మాట్లాడుకున్నారు వాళ్ళు.

* * *

ఆ మధ్యాహ్నం లంచ్ అవర్‌లో అనన్య, ఆమె ఫ్రెండ్ రజిత పెళ్ళి కాని టీనేజి అమ్మాయిలు మాట్లాడుకునే విషయాలు మాట్లాడుకోసాగారు. వాళ్ళిద్దరూ పెళ్ళి కాని టీనేజి అమ్మాయిలే కాబట్టి అలాంటి టాపిక్ మాట్లాడుకోవడం సహజం. తన లంచ్ ముగించుకొని వాళ్ళకి కొద్ది దూరంలో కూర్చుని, ఆ దినపత్రికను తిరగేస్తున్న నిరుపమ్‌కి వాళ్ళ మాటలు వినబడుతున్నాయి.

"పూర్వం పది రూపాయలకి సినిమా, నాలుగు రూపాయలకి వారపత్రిక వచ్చేవి. ఇప్పుడు సినిమా ఏభై. వార పత్రిక పది రూపాయలు. ఎంత జీతం వచ్చినా చాలని రోజులివి అంటోంది మా బామ్మ పొద్దున్నే" చెప్పింది అనన్య రజితకు.

"నన్నడిగితే, అందుకే జీతగాడిని చేసుకునేకంటే, కోటీశ్వరుడ్ని చేసుకోవడం బెస్ట్" చెప్పింది రజిత నవ్వుతూ.

"అవును. లేకపోతే మనం ఇతర్ల భార్యల్లా ప్రతీదానికి డబ్బు లెక్క చూసుకోవాలి" చెప్పింది అనన్య కూడా నవ్వుతూ.

"ఓ పూట హోలీడే ఇన్‌లో భోజనం చేసి, లైఫ్‌స్టైల్‌లో జీన్స్, టీ షర్ట్ కొనాలంటే, మన జీతంలో నాలుగోవంతు మాయం అవుతుంది. అదే ఓ కోటీశ్వరుడ్ని చేసుకుంటే, ప్రతిరోజు అలా చేసినా ఇంకా బోలెడంత డబ్బుంటుంది" చెప్పింది రజిత.

"మన బేంక్‌కి కొందరు కోటీశ్వరులు వస్తుంటారు కదా?"

"వస్తే వాళ్ళు కోటీశ్వరులే కాదు. ఉత్త కోటు, సూటులేసుకున్న వారిని కోటీశ్వరులనరు జనరల్ మేనేజర్లో, ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లో అంటారు.



నిజమైన కోటీశ్వరుడు డబ్బు వేయడానికి, తియ్యడానికి స్వయంగా బేంక్‌కి రాడు. అందుకు అతనికి టైం వుండదు. ఆ టైంలో ఏ ఓషన్ పార్క్‌లోనో సర్దాగా గడుపుతూంటాడు. అందుకనే జియంలని, సిఇఓలని ఇలాంటి జీతగాళ్ళని ఉంచుకుంటారు'' వివరించింది అనన్య.

"కరక్టే. మరి ఎలా వాళ్ళని మనం పరిచయం చేసుకునేది? అసలు పరిచయం అంటూ అయితేనే కదా మనం పెళ్ళిదాకా వాడ్ని లాక్కెళ్ళగలిగేది" అడిగింది రజిత.

వాళ్ల సంభాషణ సీరియస్‌గా వినబడుతున్నా, ఆ ఇద్దరి మనసుల్లోని కొంటెతనం గమనించని నిరుపమ్, తను ప్రేమించే అనన్య మాటలు శ్రద్ధగా వినసాగాడు.

"కోటీశ్వరుల్ని కలుసుకోవాలంటే, వాళ్ళుండే పేటల్లో మనం మకాం పెట్టాలి. ఆరు బై ఎనిమిది గదికి నెలకి ఆరువేల రూపాయలిచ్చయినా సరే" చెప్పింది అనన్య.

''అవును జూబ్లిహిల్స్‌లో ఆ మాత్రం వుంటాయి రెంట్స్. పుస్తకాల షాపులకి వెళ్ళి కూడా వాళ్ళ వివరాలు కూపీలాగచ్చు" చెప్పింది రజిత.

"వాళ్ళు పుస్తకాలు చదువుతారనుకోను నేను"

"అదికాదు, పుస్తకాల షాపుల్లో రిచ్ అండ్ ఫేమస్ వాళ్ళ జీవిత చరిత్రల పుస్తకాలు దొరుకుతాయి. కొన్ని కొని, పెళ్ళీడుకొచ్చిన వాళ్ళ కొడుకుల లేదా మనవల వివరాలు చదివి తెలుసుకోవచ్చు" వివరించింది రజిత.

"నిజమే నువ్వు చెప్పింది వింటే నాకొక ఐడియా వచ్చింది. పేపర్లో మరణించిన వారి వార్తలు వస్తుంటాయి కదా. ధనవంతులైతేనే ప్రాముఖ్యత ఇచ్చి వాళ్ళ మరణం గురించి రాస్తూంటారు. 'ఫలానా ఆయన భార్య మరణించింది' అన్న వార్త చదివి కట్‌చేసి దాచుకుని, ఆర్నెల్ల తర్వాత వాడితో పరిచయం చేసుకుంటే, పెళ్ళిదాకా తీసుకెళ్ళచ్చు" చెప్పింది అనన్య.

''గుడ్ ఐడియా, కాని భార్య మరణించిందంటే అతని వయసు ఫిఫ్టీ ప్లస్ వుంటుంది కదే?"

"ఉంటే మనకి మరీ మంచిది, త్వరగా చస్తాడు. జీవితాంతం మనం ఆ ముసలాడితో వేగనక్కర్లేదు"

"డబ్బున్న వాళ్ళ పెళ్ళికి హాజరైతే చాలు అక్కడ పెళ్ళి కాని ధనవంతుల అబ్బాయిలు కో కొల్లలుగా దొరుకుతారు. సూపర్ బజార్‌లో మనకే బ్రాండ్ టూత్‌పేస్ట్ కావాలో ఎన్నుకున్నట్లు, అక్కడ మన టేస్ట్‌కి తగ్గ వాడిని ఎంపిక చేసుకుని వాడితో పరిచయం చేసుకోవచ్చు".

"కానీ వాళ్ళ పెళ్ళిళ్ళకి మనకి శుభలేఖలు రావు కదా"

"దాని కోసం చూడకుండా వెళ్ళాలి.. మన రిచ్ హాబీతో మనం చేసిన తప్పుని తర్వాతెప్పుడయినా నింపాదిగా చెప్తే మన నిజాయితీకి మెచ్చుకుంటాడు కూడా"

"నిజమే మనం ఓ కోటీశ్వరుడ్ని పెళ్ళి చేసుకోవడానికి మనకి కోట్లుండక్కర్లేదు, అతనికి నచ్చే అందం, వయసు వుంటేచాలు''

**ఆల్కహాల్ వల్ల వచ్చేది అనారోగ్యం, పోయేది డిగ్నిటీ. ఈ సీరియల్ చదవడం వల్ల పోయేది చిరాకు. వచ్చేది చిరునవ్వు.**

"మనకి రెండూ వున్నాయి కదా ఇంకా భయందేనికి?" చెప్పింది రజిత ఉత్సాహంగా.

అనన్య నిరుపమ్‌ని అడిగింది.

"ఎక్స్‌క్యూజ్‌మీ. పేపర్లో ఇవాళ ఎవరి భార్యయినా పోయిన వార్త కాని, ఎవరి పెళ్ళికి సంబంధించిన వార్త కానీ వుందా?"

"లేవు" కోపంగా చెప్పాడు నిరుపమ్.

"అరె! ఇవాళ లేవటే" చెప్పింది అనన్య.

"పోన్లే రేపో, ఎల్లుండో అలాంటి వార్తలు రాకపోవు, రోజు పేపర్లు చూస్తుంటే సరి"

"మనిద్దరం ఓ ప్రామిస్ చేసుకోవాలే" చెప్పింది అనన్య.

"ఏమిటి?"

"ఒకవేళ నాకంటే ముందే నీకో రిచ్ హజ్‌బెండ్ దొరికితే, నీ సర్కిల్‌లోని రిచ్ అబ్బాయిలని నాకు పరిచయం చేయాలి. అలాగే నాకు ముందు అలాంటి హజ్బెండ్ దొరికితే నీకు హెల్ప్ చేస్తాను ఏం?"

"వండ్రఫుల్ ఐడియా! ప్రామిస్" చెప్పింది రజిత అనన్యతో చేతులు కలిపి.

"హౌటు మీట్ ఏ రిచ్‌మేన్?' అనే పుస్తకం వాల్డెన్‌లో చూసిన గుర్తు. బిల్‌గేట్స్‌కి పెళ్ళయిందంటావా?"అడిగింది అనన్య.

"ఏమో! అయినా మనకి అమెరికాకి వీసా దొరకాలిగా అంబానీకయితే పెళ్ళయింది. ఎంక్వయిరీ చేసాను" చెప్పింది రజిత.

"ఆ కోటీశ్వరుడికి కూడా పెళ్ళిళ్ళయ్యాయి అసలు మన ఎ.పి.లో బాగా రిచ్ ఎవరబ్బా?"

వెంటనే రజిత ఓ పేరు చెప్పింది.

"లాభంలేదు, ఆయన కొడుకులిద్దరికీ పెళ్ళయిపోయాయి"

ఇద్దరూ రకరకాల వ్యాపారాల్లోవృత్తుల్లోని డబ్బున్న వాళ్ళ పేర్లు చర్చించుకుంటుంటే చేతిలోని పేపర్‌ని విసిరికొట్టి నిరుపమ్ లేచి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళాక ఫక్కున నవ్వింది రజిత. ఆమె నవ్వుతో శృతి కలిపింది అనన్య.

"నిజం అనుకున్నట్లున్నాడు" చెప్పింది రజిత.

"అవును"

"నువ్వంటే మంచి ఇదనుకుంటాను'' అడిగింది రజిత.

''అవును కాని ఎక్స్‌ప్రెస్ చేయలేక పోతున్నాడు."

"పాపం ఈరోజుల్లో కూడా ఇతనికి అదేం బలహీనత? 'ఐ లవ్ యూ' అని ఒకరంటే, నో అని ఇంకొకరంటే, 'ఇట్సాల్‌రైట్' అని ఇంకొకర్ని ప్రేమించే రోజులివి."

"అందుకే అతను ఈ కాలం మనిషి



కాదంటున్నాను" నవ్వింది అనన్య.

లంచ్ టైం ముగిసాక ఇద్దరూ తమ తమ సీట్లలోకి వెళ్ళారు. అనన్య నిజంగా ఏ రాయలసీమ రెడ్డి కొడుకునో, లేదా గోదావరి జిల్లా వెలమదొరల కొడుకునో చేసుకోవాలనుకుంటూందే మోనను కున్న నిరుపమ్ ఓ తెల్ల కాగితం అందుకొని ఉద్వేగంగా ఇలా రాసాడు.

కుమారి అనన్య గారికి,

తర్వాత ఏం రాయాలో అయిదారు నిమిషాలు ఆలోచించినా అర్థం కాలేదు. అనన్య తర్వాత 'గారి'ని కొట్టేసాడు. 'ఐ లవ్ యూ' లేదా 'నిన్ను నేను ప్రేమిస్తున్నాను'లో ఏది రాద్దామా అని కాసేపు ఆలోచించాక అవి రెండూ ప్రేమలేఖ లో అతి చెత్తవాక్యాలని పించాయి నిరుపమ్‌కి.

ఆరోజు సాయంత్రం వేండ్ మార్క్ కి వెళ్ళి 'హాట్‌రైటు ఏ లవ్ లెటర్' వుంటే కొనాలనుకుని నిర్ణయించుకున్నాక ప్రేమలేఖ నాపి బేంక్ పనిలో పడ్డాడు నిరుపమ్.

* * *

హరకేశం సైకిల్‌ని ఇంట్లో పెట్టి, ఇమ్లిబన్ బస్టాండ్‌కి వెళ్ళాడు. వికారాబాద్ వెళ్ళే పాసింజర్ బస్ ఎక్కి దారిలో హైద్రాబాద్ కి పాతిక కిలోమీటర్ల దూరంలో వున్న ఓ చిన్న పల్లెటూరులో దిగాడు. అది అతని స్వగ్రామం.

"నరానరి 'ఇక్కడ పాము మంత్రం ఇవ్వబడును' అన్న బోర్డున్న చిన్న పెంకుటింట్లోకి వెళ్ళాడు. ఆ ఇంట్లోని నలభై ఏళ్ళ ఓ శాస్త్రీతో రెండు నిమిషాలు మాట్లాడాడు.

బేరం కుదిరాక, చింత నిప్పుల్లాంటి కళ్ళు గల ఆ జులపాల ఆసామి చెప్పుల్లేకుండా బయటకు నడిచాడు. అతని వెంటే వెళ్ళాడు హరకేశం. పావు కిలోమీటర్ దూరంలో వున్న ఓ పొలంలోని చిన్న పుట్ట లో రెండు తప్ప అన్ని రంధ్రాలు మూసి, ఓ రంధ్రంలోకి పొగ పెట్టాడు. కొద్దిసేపట్లో రెండో రంధ్రంలోంచి జరజర తాచుపాము పిల్లలు నాలుగు బయటకు వచ్చాయి. వెనకే పెద్ద తాచు వచ్చింది. అది మూడున్నర అడుగుల పొడవుండటం, గోధుమ రంగులో వుండడం చూసి తృప్తి పడ్డాడు హరకేశం.

దాన్ని ఉత్త చేతులతో ఎంతో చలాకీగా మెడకింద చెయ్యివేసి పట్టుకున్నాడు ఆ జులపాలవాడు. అది అతని చేతికి చుట్టుకుంది.

ఇంటికి తిరిగి వచ్చాక దాన్ని ఓ జనపనార సంచీలో వేసి మూటకట్టాడు వాడు. అతని కో అయిదు వందల రూపాయల నోటిచ్చాడు హరకేశం. పల్లెటూరిలో పుట్టి పెరిగిన హరకేశానికి తాచుపాములంటే ఎలాంటి భయంలేదు. చిన్నప్పుడు నాగుల చవితి ముందు రోజుల్లో వీటిని పట్టుకున్న వాళ్ళదగ్గర కొని సిటీకి తీసుకుని వచ్చి ఇంటింటికి వెళ్ళి వాటిని ఆడించి డబ్బు చేసుకునే వాడు హరకేశం.

ఆ మూటతో హైద్రాబాద్ కి వెళ్ళే బస్ ఎక్కాడు. ఆ రాత్రికి బామ్మ చావు ఆ పాముతో ముడిందని అనుకోసాగాడు హరకేశం గాఢ నమ్మకంతో.

దారిలో బస్సులో తన పథకం గురించి ఆలోచించాడు. బామ్మ ఇంట్లో పాముంది, కనీసం పాము పుట్ట వుంది. అందులో పాముందో లేదో పోలీసులకి రూఢీగా తెలీకపోయినా వంటి మీద పాము కాటు గుర్తులు చూసాక 'ఏ పుట్టలో ఏ పాముందో కదా?' అనుకుని అది పాము కాటు మరణంగా కేసుని క్లోజ్ చేస్తారన్న ధీమా హరకేశంలో వుంది.

అయితే అందుకు పాము వెళ్ళి బామ్మని కాటేయాలి. అందుకో చక్కటి ప్లాన్ ఆల్‌రెడీ ఆలోచించి పెట్టుకున్నాడు కాబట్టి హరకేశంకి హుషారుగా వుంది.

రాత్రి పడుకున్న బామ్మ మర్నాడు ఉదయం మంచం మీంచి శవంగా లేస్తుంది. తక్షణం సరికొత్త వందనోట్ల బండిల్స్ తన చేతుల్లోకి వస్తాయి.

బస్సు దిగి పామున్న గోనె సంచీతో ఇంటికెళ్ళాడు. దాన్ని అటక మీద పెడుతూ చెప్పాడు భార్యతో..

"జాగ్రత్త, దీని జోలికి వెళ్ళకు"

"లోపల ఏముంది?" అడిగింది ఆసక్తిగా

"పాము"

"ఈసారి పాముతో చంపుతున్నావ న్నమాట"

"అవును, ఇదంతా ఎలా గ్రహించావు?"

"ఆ సుబ్బారావు ఊరికే నీ దగ్గరకి మనిషిని పంపడు కదా. అలాగే నువ్వు ఏ మనిషినీ నీ చేతులతో, కత్తితోనో, తాడుతోనో, పిస్తోలుతోనో చంపవు కదా. అందుకని తెలుసుకోగలిగాను. అన్నట్లు ఇందాక లింగమయ్య నీ కోసం వచ్చి వెళ్ళాడు".

వెంటనే హరకేశం లింగమయ్యకు ఫోన్ చేసాడు. అతను లైన్‌లోకి రాగానే అడిగాడు.

"ఏమిటి? ప్లాన్ మారిందా?"

"లేదే"

"మరెందుకొచ్చావు?"

"పనెంతదాకా అయిందో తెలుసుకు రమ్మని సుబ్బారావు సారు నన్ను మీ ఇంటికి పంపారు."

"ఇదేమైనా బిల్డింగ్ కట్టడానికి పునాదులు తీయడంలాంటిదా? ఎంతదాకా అయిందో తెలుసుకోడానికి. ఒక్క క్షణంలో అయ్యే పనిది. కొస్త కొస్త అయ్యే పని కాదు"

"ఇవాళ రాత్రి కి అంతా రెడీ చేసావా అని కనుక్కోమన్నారు"

"అంతా రెడీ చేసాను. రేపు పుదయం నువ్వు రామ్‌నగర్‌లోని బామ్మ ఇంటివైపు వెళ్తే అక్కడ నీకు ఏడుపులు వినబడుతాయి."

"వెరీ గుడ్! ఈ ముక్కే సుబ్బారావ్ సార్‌కి చెప్తాను"

"రేపు పుదయాని కల్లా డబ్బు సిద్ధం చెయ్య మన్నానని చెప్పు"

"ఆ విషయంలో నిశ్చింతగా వుండు"

"ఈ రాత్రికి బామ్మ చావు విషయంలో కూడా నీవు నిశ్చింతగా వుండు" హామీ ఇచ్చాడు హరకేశం.

**(ఇంకావుంది)**





# సినిమా సంగీతానికి రూపురేఖలు దిద్దిన
# ఆర్.సి.బోరాల్

భారత దేశంలో టాకీలు పుట్టిన తరువాత క్రమంగా ఆయా చిత్రాల విజయానికి సంగీతం ప్రధాన కారణం కానారంభించింది. కాగా అప్పటి దర్శక నిర్మాతల, ప్రేక్షక శ్రోతల అభిరుచి కారణంగా అలనాటి శాస్త్రీయ సంగీతకారులే సినిమాలకు సంగీతం సమకూర్చక తప్పలేదు. అలాంటి వారిలో ఆద్యులు "ఆర్.సి.బోరాల్".

సినిమా సంగీతానికి సంప్రదాయ విలువలను ఆపాదించి దానికి సమగ్రమైన రూపురేఖలను దిద్దిన సంగీత కారుడు ఆర్.సి.బోరాల్ పూర్తి పేరు "రాయ్ చంద్ బోరాల్". పశ్చిమ బెంగాల్‌లోని సంగీత కారుల కుటుంబంలో 1904లో జన్మించిన బోరాల్ తండ్రి లాల్‌చంద్ బోరాల్ గొప్ప సంగీత విద్వాంసుడు. హిందుస్తానీ, బెంగాలీ సంప్రదాయ సంగీతాల్లో నిష్ణాతులైన ఆర్.సి. తొలుత లక్నో, బెనారస్‌లలో జరిగిన సంగీత మహాసభల్లో పాల్గొని ప్రసిద్ధుల ప్రశంసలందుకున్నారు. సినిమాలోకి రావడానికి ముందు కొన్నేళ్ల పాటు రేడియో సంగీత విభాగంలో పనిచేశారు. అయితే ముప్పైలలో టాకీలు రావడంతో సంగీతానికి విలువ పెరిగి బోరాల్ సినీ సంగీతం పట్ల ఆకర్షితులైనారు.

సంగీత దర్శకునిగా బోరాల్ పనిచేసిన తొలి హిందీ చిత్రం "మొహబ్బత్ కె ఆంసూ"(1932). విశేషమేమిటంటే మహా నటగాయకుడు కె.ఎల్.సైగల్ హీరోగా నటించిన తొలి చిత్రం కూడా ఇదే. అప్పట్లో సినిమాల్లో లేని రీ రికార్డింగ్, ప్లేబ్యాక్ విధానాలను దర్శకుడు నితిన్‌బోస్‌తో కలిసి వాటిని తొలిసారిగా పరిచయం చేశారు. సైగల్, బెంగాల్ కోకిలగా చెప్పుకునే కానన్ దేవిలు బోరాల్ సంగీతంలోనే అద్భుతమైన పాటలు పాడారు.

ఒక సందర్భంలో ప్రసిద్ధ తెలుగు సంగీత సంగీత దర్శకులు పెండ్యాల నాగేశ్వరరావు విజయచిత్రలో "తొలి సంవత్సరాల చిత్ర సంగీతం" శీర్షికన వ్యాసం రాస్తూ "కలకత్తా న్యూ థియేటర్స్ కు, భారత దేశానికి కూడా గొప్ప పేరు తీసుకొచ్చిన మహనీయుడు ఆర్.సి.బోరాల్, సంగీతంలో కొత్త పోకడలు చూపి భావానికి ప్రాధాన్యత కల్పించాడు. కావలసిన "ఎఫెక్ట్" కోసం రాగాన్ని -రాగాన్ని మిళితం చేసి, కొత్తమెలొడి సృష్టించాడు. కొత్త లయలు వెలయించాడు. సైగల్, పంకజ్ మల్లిక్, పహాడీ సన్యాల్, కానన్ బాల మొదలైన గాయకులను పరిచయం చేసి వారందరికీ యావద్భారత కీర్తి లభించే స్థాయిలో అద్భుతమైన సంగీత సృష్టి చేసి ఆ సంగీతానికి శాశ్వతత్వం ప్రసాదించాడు. నా అభిప్రాయంలో సినిమా పాటలకు భావప్రాధాన్యం, సాహిత్య ప్రాధాన్యం అప్పుడప్పుడే కలిగింది. పాటలను సంగీతం ఒక్కటే 'డామినేట్' చేయకూడదనీ, భావానికీ, సాహిత్యానికీ ప్రాధాన్యత ఇవ్వాలని చేసి చూపిన సంగీతకారుడు బోరాల్. ప్రెసిడెంట్, సీత, విద్యాపతి, చండీదాస్, స్ట్రీట్ సింగర్ వంటి బోరాల్ సంగీతంలో సమకూర్చిన చిత్రాల లోని సంగీతం దేశంలోని సంగీతాభిమానులందరిమీద మధురమైన జల్లులు కురిపించింది. ఆ పాటల గ్రామఫోన్ రికార్డులు విపరీతంగా అమ్ముడైనవి, నాకు తెలిసి అప్పుడే, ఆ కాలంలోనే ఆంధ్రదేశంలో ఎక్కువ మంది గ్రామఫోన్ రికార్డులు కొనుక్కోవడం జరిగింది. భాష అర్థం కాకపోయినా, భావం తెలియక పోయినా, సైగల్, పంకజ్ మల్లిక్ మొదలైన వారు పాడిన పాటలను ఔత్సాహిక గాయకులు, సంగీతాభిమానులూ పాడుతూ ఉండేవారు అన్న విషయాన్ని బట్టి చూస్తే ఆర్.సి.బోరాల్ భారతీయ సినీ సంగీతాన్ని మలుపుతిప్పినవారని చెప్పుకోక తప్పదు. బోరాల్ స్వర కల్పనలో భారతీయ శాస్త్రీయ సంగీతపు నీడలు స్పష్టంగా కనిపిస్తాయి. కంపోజింగ్స్‌లో ఎక్కడా రాజీపడేవారుకారు. సంప్రదాయ విధానంలో సైగల్ చే గజల్స్‌ను కొత్త శైలిలో పాడించారు. సినీ సంగీతంలో ఆర్కెస్ట్రాకు ప్రాధాన్యత పెంచారాయన. కథనంలోకి మ్యూజిక్ ఎఫెక్ట్స్‌ను చొప్పించి కొత్తదనానికి శ్రీకారం చుట్టారు.

బోరాల్ సంగీతం సమకూర్చిన చిత్రాల్లోని పాటలు ఆ రోజుల్లో ఉత్తర భారతీయులను అనుభూతి పారవశ్యంలో ముంచెత్తాయి. బాబుల్‌మోరా, ప్యార్‌కహా మిలే (స్ట్రీట్ సింగర్), అల్‌బేలా మస్తానా(వాపస్) వంటి పాటలు అలనాటి సినీ గీతాభిమానులను మైమరిపించాయి. వాపస్ చిత్రానికి "బి.ఎస్.జె.ఎ" అవార్డును, సినీ రంగానికి చేసిన విశిష్టసేవలకు గాను 1978లో అత్యున్నత దాదాసాహెబ్ అవార్డును అందుకున్నారు. యాభైఏళ్లపాటు సినీ సంగీతానికి సేవలందించిన ఆర్.సి.బోరాల్ 1981 నవంబర్ 25 న మరణించారు. సినీ రంగ చరిత్రలో ఆ పాత మధుర సినీ స్వరాలస్రష్టగా బోరాల్ స్థానం సుస్థిరం.

- హెచ్. రమేష్‌బాబు



ప్రెసిడెంట్ నుండి అవార్డు స్వీకరిస్తూ...

ఆర్.సి.బోరాల్(1930-81)

-తొలి బెంగాలీ చిత్రం: దేనాపోనా (1931).

-1934 ' పియర్ బ్రదర్స్' అనే ఏనిమేటెడ్ షార్ట్‌కు దర్శకత్వం వహించారు.

-శ్యామ్‌లాహా, అమర్ మల్లిక్‌తో కలిసి యం.యల్.బి. ప్రొడక్షన్స్ స్థాపించారు.

-బిమల్‌రాయ్ తొలి చిత్రాలు 'ఉదయేర్ పథే', 'అన్‌జాన్ గఢ్', 'మా' చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించారు.

- చెప్పుకోదగ్గ చిత్రాలు - చండీదాస్ (1932); పూరన్‌భక్త్ (1933), దేవదాస్ (1935), మాయా (1936), ప్రెసిడెంట్, విద్యాపతి (1937), స్ట్రీట్‌సింగర్ (1938), సవేరా (1939), హార్‌జీత్ (1940), లగాన్ (1941), వాపస్ (1943), హమ్‌రాహీ (1944), అమర్‌సైగల్ (1955), నతున్ ఫసల్ (1960).



బోరల్‌కు ఎంతో ఖ్యాతి తెచ్చిన 'విద్యాపతి' చిత్రంలో పహాడీ సన్యాల్, పృథ్వీరాజ్ కపూర్.

**నవంబర్ 16 బి.యన్.రెడ్డి జయంతిని పురస్కరించుకుని....**




నలభై ఏళ్ళుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



# బైట వారికి చాదస్తం, హాస్యమూ ఆయనకి మాత్రం అంతా సీరియస్సే

**"బంగారు పంజరం"** (బి.ఎన్.రెడ్డి గారి చివరి చిత్రం)లో ఒకపాత్ర ఇంట్రడక్షన్. ఆ పాత్రధారి చేతిలో చేతికర్ర వుంటుంది. (ఇంకా ఎందుకు దాపరికం? మొహమాటం అడ్డొచ్చి చెప్పలేదు గాని, ఆ పాత్రధారిని నేనే) ఆ కర్ర మీద కెమెరా వుంటుంది. అక్కడ నుంచి వెనక్కి వెళ్ళి ఆ పాత్రనీ తక్కిన పాత్రల్ని 'రివీల్' చేస్తుంది. ఆ చేతికర్ర మీద డిజైన్ ఉండాలి; స్టైల్‌గా వుండాలి. ఇది రెడ్డిగారు రాసుకున్నది. బిఎన్‌గారి మనసు బాగాతెలిసిన ఆర్ట్ డైరక్టర్ శేఖర్ బజార్లో వెతికి కాశ్మీర్ ఎంపోరియమ్‌లో ఆ చేతి కర్ర కొనుక్కొచ్చారు. బిఎన్ చూశారు. "నేను ఊహించిన డిజైన్ ఇది కాదు" అన్నారాయన నిరాశగా. శేఖర్‌గారు బదులు చెప్పలేదు. "మళ్ళీ వెతకండి. ఇంకా ఆర్టిస్టిక్‌గా వుండే డిజైన్‌గల చేతికర్ర తీసుకోండి. ఆలస్యమైనా పర్వాలేదు. వచ్చిన తర్వాతనే షాట్ తీస్తాను"అన్నారు రెడ్డిగారు. తన అసిస్టెంటుని కూడా తీసుకొని శేఖర్‌గారు వాయువేగమనోవేగాల కంటే జోరుగా కారు నడిపించి, ఆర్ట్‌గాలరీలు, హాండీక్రాఫ్ట్ దుకాణాలు తిరిగి-రెండుగంటల తర్వాత ఇంకో చేతికర్ర తెచ్చారు. "యస్..దీసీజ్ వాట్ ఎగ్జాట్లీ ఐ వాంటెడ్"అన్నారు మెరిసిపోతున్న ముఖంతో. ఆనందంగా షాటు తీశారు."ఆలస్యమైనా అందమైన షాటు తీశాను" అనుకున్నారు రెడ్డిగారు. "వట్టి చాదస్తం! ఏ డిజైనయితేనేం - ఏమంత తెలుస్తుంది గనక! రెండు గంటల టైమ్ పోయింది, కాల్షీట్ వేస్టయింది" అని గొణుకున్నారు 'బిఎన్ తత్వం'ఎరిగివున్నవాళ్లుకూడా. "అది చాదస్తం కాదు పెర్‌ఫెక్షన్" అంటారు బిఎన్. ఆమర్నాడు ఇది విన్న తక్కిన సినిమావాళ్ళు నవ్వుకున్నారు. "బిఎన్నిజమ్ ఈజ్ పెర్‌ఫెక్షనిజమ్- యస్ ఇది నిజమ్"అని మాత్రం ఎవరూ అనలేదు. ఇలాంటి ఉదాహరణలు ఇంకా వున్నాయని శేఖర్ గారు చెప్పేవారు. "కుళ్ళుకాలవ, చెత్తా చెదారంతో బురద పరమ చండాలంగా వుండాలని సెట్టు వేయించినా అదికూడా కళాత్మకంగానే వుండాలంటారు బిఎన్" అని శేఖర్ గారు నవ్వుతూ చెప్పేవారు. బిఎన్‌రెడ్డి గారు ఎక్కువగా ఇంగ్లీష్ లోనే మాట్లాడేవారు. అలాగే మరో "వాహిని స్తంభం" కె.వి.రెడ్డి గారు కూడా. అందర్ని "బ్రదర్"అని సంబోధించే వారు ఇద్దరూ. (ఆ బ్రదరే తర్వాత తర్వాత ఎన్.టి.రామారావు గారికి అలవాటయింది. 'బ్రదర్' అనడం వారి దగ్గరే నేర్చుకున్నాను అనికూడా చెప్పేవారు రామారావు.)



రెడ్డిగారికి హాస్యం ఇష్టమేగాని, తియ్యడానికి అంత మనస్కరించేది కాదు. సరదా గానూ, చమత్కారం గానూ మాట్లాడం కూడా తెలుసు. ఒకసారి వాహిని ఆఫీసులో ఆయన కూచుని వుండగా, మిత్రుడెవరో వచ్చారు. "అల్పాహారం అయిందా?" అని అడిగారా మిత్రుడు."అల్పాహారం అనకండి. అది అల్పులు తినే ఆహారం అన్నమాట" అని తానూ నవ్వారు రెడ్డి గారు. ఆయనది అరెస్టింగ్ పర్సనాల్టీ. మంచి కాంప్లెక్షన్. ఖద్దరూ పంచె, జుబ్బా, కళ్ళ జోడూ- చూడగానే ఆకర్షించేవారు. సిగరెట్లు కాల్చేరోజుల్లో చూపుడు, మధ్య వేళ్ళ మధ్య సిగరెట్టు పెట్టి ధాటీగా, గాట్టిగా, ఘాటుగా దమ్ములాగి గుప్పుమని పొగ వదిలేవారు.

"బంగారు పంజరం" షూటింగులో వాణిశ్రీ (నాయిక) ఆయన్ని పొగిడి, ఇబ్బందిలో పడింది. ఓరోజు "మీరు చాలా అందంగా వుంటారు. చిన్నప్పుడు, అంటే 20, 25 వయసులో ఇంకా అందంగా వుండేవారనుకుంటాను. హీరో పర్సనాల్టీ వుండేదేమో. అలాంటి అవకాశం రాలేదా?" అన్నట్టుగా ఏదో అడిగింది. బిఎన్ నవ్వేసి "ఈజిట్?" అని "అలా నేను ఏమీ అనుకోలేదు. ముఖం చాలా ఆకర్షణీయంగా వుండాలి సినిమానటులకి పర్సనాలిటీ కంటే. హీరో హీరోయిన్ల ఫేసెస్ మీదనే మేము ఎక్కువగా డిపెండ్ అవతాం. వాల్యూబుల్ ఫేసస్, క్లోజప్స్‌లో చాలా హాయిగా, బహు సుందరంగా వుండాలి. అందుకే మీ మేకప్. మీ హెయిర్ స్టైయిలూ చూస్తాను సెట్‌లోకి రాగానే." అని అలా మాట్లాడుతూ ఆమె ముఖంలోకి చూసి, ఓ అర్థ నిముషం పాటు పరిశీలించి- "ఇవాళ



ఏమిటమ్మా-నీ ముఖం డల్‌గా వున్నట్టుంది. మేకప్‌లో తేడా వచ్చిందా'' అని అడిగారు. "లేదండి. రాత్రి రెండు గంటల వరకు వేరే షూటింగ్‌లో వున్నాను. వాళ్లది పిక్చర్ ఫినిషింగ్.ఇంటికి వెళ్లి పడుకునేసరికి మూడు దాటిపోయింది. ఎనిమిది గంటలకల్లా స్టూడియోకి వచ్చేశాను..'' అని ఇంకా ఏదో చెబుతూ వుంటే- "నోనో...నువ్వు అలా రాత్రులు పని చెయ్యకూడదు. మీరు బాగా రెస్టు తీసుకుని మర్నాడు ఫ్రెష్‌గా రావాలనే కదా, సాయంకాలం ఆరింటికే పాకప్ చేసి పంపేస్తున్నాను... నా సినిమా... లక్షల వ్యాపారం అంతా మీ ఫేసెస్ మీదనే ఆధారపడి వుంది. నో - నేను షూటింగ్ చెయ్యను. ఇవాళ కాన్సిల్ చేస్తున్నాను... బాగా రెస్ట్ తీసుకుని, రేపు ఉదయమే ఫ్రెష్‌గా రా...'' అని బిఎన్ అనే సరికి ఆమె బిత్తరపోయింది. "లేదు సార్.. ఆ డల్‌నెస్ ఏమీ వుండదు. ఉషారుగానే వుంటాను.. ఇంకోసారి టచప్ చేసుకుని...'' అని వాణిశ్రీ చెబుతున్నా వినకుండా "నోనో...ఐ కాంట్ అండ్ ఐ డోంట్..''అని మేనేజర్ని పిలిచి, షూటింగ్ కాన్సిల్ చెయ్యమని, లేచి వెళ్లిపోయాడు బి.ఎన్. అందరికీ ఆశ్చర్యం! అందరికీ విస్మయం!.. సరిగ్గా షాటు తీసేముందు అంతా సిద్ధమైన తర్వాత, షూటింగ్ కాన్సిలా!... ఇదివిన్న పరిశ్రమ అంతా ఒక్కసారి ముక్కున వేలువేసుకొని- "ఇదే బిఎన్ చాదస్తం" అని వ్యాఖ్యానించింది.

వాహిని ఆఫీసులో వచ్చేవారికి ఇవ్వడానికి ఖరీదైన కాఫీ కప్పులు, సాసర్లూ వుండేవి. కళాత్మక మైనవన్నమాట. బిఎన్ గారి మనస్తత్వం బాగా తెలిసిన డి.వి.నరసరాజు గారు- "లోపలి కాఫీ ఎలా వున్నా ఎంత అధ్వాన్నంగా వున్నా పర్వాలేదు, కప్పులు సాసర్లు మాత్రం నీటుగా వుండాలి.'' అని చెబుతూ వుంటారు.

"పూజాఫలం'' సినిమాకి రెడ్డిగారి దగ్గర సహాయకుడిగా పనిచేసే అవకాశాన్ని నాకు నరసరాజుగారే కలిగించారు. అయితే కొంత కాలం మాత్రమే చెయ్యగలిగాను- అది వేరే విషయం. ఆ టైమ్‌లో ఆయనతో పాటు విశాఖపట్నం ప్రయాణించాను- ఆయన్ని యూనివర్శిటి వారు ఆహ్వానించారు. ఏ ఊరు వెళ్లినా ఆయన ఒక్కరూ వెళ్లరు. కూడా ఎవరో వుండాలి. రాత్రి 9 గంటల ప్రాంతాల హౌరా మెయిల్లో ప్రయాణం. సాయంకాలం నాలుగు గంటల నుంచే హడావిడి ఆరంభమయింది. విజయవాడలోని వాహినీ డిస్ట్రిబ్యూషన్ ఆఫీసుకి ఫోన్ చేయించి తాను విశాఖపట్నం వెళ్తున్నట్టూ, ఉదయమే బ్రేక్ ఫాస్ట్ రైలుకి అందించమన్నట్టూ చెప్పారు. రాజమండ్రిలో వేరెవరికో చెప్పారు... కాఫీతో రమ్మని, ఆయనకి అన్ని అనుమానాలే. రైలుస్టేషన్‌లో రాత్రి ఎనిమిది గంటలకల్లా వుండాలి. అంటే ఏడున్నర, ఏడునలభై కల్లా బయల్దేరాలి. ఆవేళకి తన కారుంటుందో వుండదో! తన భార్య ఎక్కడికైనా వెళ్లి సకాలానికి తిరిగి రాకపోతే?- అందుకని ఆలోచించి, నాగిరెడ్డి గారికి ఫోన్ చేసి "బ్రదర్- నాకు ఏడున్నరకి కారు పంపించాలి. ఊరు వెళ్లాలి'' అంటే-ఆయన "ఓ యస్'' అన్నారు. మళ్ళీ ఇంకో ఆలోచన, విజయా ప్రొడక్షన్ ఆఫీసు. అంతా హడావుడే. కార్లుంటాయి గాని, వేళకి వస్తుందో రాదో! పైగా తమ్ముడు పంపడం మరిచిపోతే? లాభంలేదు. అని, వాహినీ డిస్ట్రిబ్యూషన్ ఆఫీసు (మద్రాసు) దాసు గారికి ఫోన్ చేసి విషయం చెప్పి కారు పంపమన్నారు. సరే అన్నారాయన. మళ్ళీ అనుమానం. ఇంకెవరో మిత్రుడికి ఫోన్ చేసి ఆ విషయమే చెప్పారు. మొత్తానికి రాత్రి ఏడున్నర ప్రాంతంలో ఆయన కారు కాక, ఆయన ఇంటి ముందు ఎనిమిది కార్లు సిద్ధమైనాయి! అందరూ ఆయనపట్ల సిన్సియరే కదా! తక్కిన వారికి "సారీ'' లు చెప్పి ఆయన కార్లోనే బయల్దేరాం. వెనకాల ఇంకో కార్లో ప్రొడక్షన్ మేనేజర్, అసిస్టెంటూ వచ్చారు. ఆయన లగేజి ఆయనతో వుండగా, నా పెట్టె ఆ కారులో వుంది. ఒక రోజు ప్రయాణం, ఒక రోజు విశాఖపట్నం- మర్నాడు తిరిగి బయల్దేరడం. అంతా కలిపి గట్టిగా రెండు రోజులు లేదు. దానికి ఆయనది, పెద్దసూటుకేసు, హోల్డాలు, బెడ్డూ వగైరా. విశాఖపట్నం బసలో ఎలాంటి దుప్పట్లు ఇస్తారో అని- ఓమూడు దుప్పట్లు వగైరాలతో పెద్ద బెడ్డు తయారైంది!

అప్పుడు ఫస్టు క్లాసులుండేవి రైల్లో. మా రెండూ ఒక బోగీలో ఇచ్చారు. హడావిడిగా, ప్రొడక్షన్ మేనేజరూ వాళ్లూ సామాన్లు పెట్టించి, ఆయన బెర్త్ (కిందనే) చూపించారు. అందులో నలుగురు ప్రయాణికులుంటారుగదా, మేమిద్దరం కాక తక్కిన ఇద్దరూ ఎవరు? ఏవూరు వెళతారు? అదీ ఆయనకే కావాలి. బయట ఆ నాలుగు పేర్లే అతికించి వున్నాయి. నేను చదివి, చెప్పాను. అయితే చిన్నగా నవ్వుతూ ఇంకో మాట చెప్పాను. "మీ పేరు పి.యన్.రెడ్డి అని రాశారు" అని. అంతే! చెప్పడం పొరపాటయింది. "అదెలా వేస్తారు- నా పేరు తప్పుగా? ఐయామ్ నాట్ పి.ఎన్.రెడ్డి." అన్నారు బిఎన్. ఏదో పొరపాటున అక్షరం తారుమారై వుంటుందని ఎంత చెప్పినా ఆయన వినలేదు. "ఒక వేళ ఆ పి.ఎన్.రెడ్డి అనే ఆయన వస్తే, నా గతేమిటి? దిగిపోవలసిందే కదా" అని ప్రారంభించారు. "నా పేరు సరిగ్గానే వుంది కదా సార్... అంచేత అందులో తప్పుండదు" అని నేను ఒప్పించడానికి ప్రయత్నించాను. ప్రొడక్షన్ మేనేజరూ చెప్పాడు. ఆయన రాద్ధాంతం ఇంతా అంతా కాదు. టికెట్ ఎగ్జామినర్ వచ్చి, చెప్పేవరకూ ఆయన "గొడవ" చేస్తూనే వున్నారు.



ఆ టి.టి.ఇ. "ఇటీజ్ అవర్ మిస్టేక్ సార్... ప్లీజ్ ఎక్స్యూజ్ '' అని చెప్పిన తర్వాత గాని ఆయన చల్లబడలేదు. తీరా, బండి బయల్దేరాక, ఆయన సీటు "చక్రం'' మీద వచ్చిందట. అలా ఎందుకు టిక్కట్టు తీసుకున్నారంటారు. చక్రం శబ్దం ఎక్కువగా వుంటుందని తనకి నిద్ర రాదనీ మళ్లీ "అల్లరి''! అంతా చిన్నపిల్ల వాడి మనస్తత్వం... ఎదురుగా వున్న ఇంకో పాసెంజర్ తన సీటుకి మారమని "అర్థించారు.'' అప్పుడు గాని రెడ్డి గారు శాంతించలేదు...

అనుమానాలు, చాదస్తం, పెర్‌ఫెక్షన్, మేధాశక్తి సహృదయం, సరసత్వం- ఇలా ఎన్నో కలిసిన మేధావి బి.ఎన్.రెడ్డి గారు. ఆయనకి అన్ని పకడ్బందీగా వుండాలి. తేడా వస్తే సహించరు. అది బయటి వారికి చాదస్తం, హ్యూమరూ! ఆయనకి మాత్రం అంతా సీరియస్సే!

పండిట్ రామ్‌నారాయణ సారంగీ కచ్చేరి నవంబరు 17 రాత్రి 10:00 గం॥లకు ఆకాశవాణిలో ప్రసారమవుతున్న సందర్భంగా...



# సారంగీకి 'సోలో' స్థాయినిచ్చిన పండిత్ రామ్‌నారాయణ్

దేశానికి వన్నె తెచ్చే హిందూస్తానీ శాస్త్రీయ సంగీత కళాకారులలో ముఖ్యుడు సారంగీ విద్వాంసుడు పండిట్ రామ్‌నారాయణ్. ఈనాడు రకరకాల వాయిద్యాలమీద శాస్త్రీయ సంగీతం వాయిస్తున్నారు కానీ పూర్వకాలంలో గాత్రం, వీణ మాత్రమే శాస్త్రీయసంగీతానికి తగినవిగా భావించేవారు. ఆధునిక యుగంలలో ఒక్కొక్క వాయిద్యానికి మారుపేరు అనదగిన హిందూస్తానీ కళాకారులెందరో ఉన్నారు. వేణువుకు పన్నాలాల్ ఘోష్, సితారుకు రవిశంకర్, షహనాయికి బిస్మిల్లా, సంతూర్‌కు శివకుమార శర్మ వగైరాల సరసలన చేర్చదగిన వ్యక్తి రామ్‌నారాయణ్. ఆయన కుమార్తె అరుణ, మనుమడు (పౌత్రుడు) హర్ష్ ముగ్గురూ కలిసి సారంగీల సంగీతకచేరీ చేశారు. ఆ తరవాత కొన్నాళ్లకు ముంబాయిలో ప్రముఖ కర్ణాటక వేణువిద్వాంసుడు రమణితో కలసి ఒక జుగల్‌బందీ కచేరీ కూడా చేశారు. సారంగీ వాయిద్యం గురించీ, రామ్‌నారాయణ్ గురించి పరిచయం చేసే ప్రయత్నమే ఈ వ్యాసం.

సారంగీ శబ్దం మనకు ముగల్ కట్టడాలనూ, ఆ నాటి రాజభవనాలనూ, మేలిముసుగులు ధరించిన రాచరికపు స్త్రీలనూ, నవాబులనూ తలపిస్తుంది. మనం తరచుగా చూసే సినిమాల్లో, డాక్యుమెంటరీలలో, కశ్మీర్ అనగానే సంతూర్ సంగీతాన్ని, పై సన్నివేశాలకు సారంగీని మ్యూజిక్ డైరక్టర్లు తరచుగా వాడుతూంటారు. ప్రముఖ రాజకీయ నాయకులు కాలం చేసినప్పుడల్లా రేడియో వినబడేది కూడా సారంగీ సంగీతమే. హిందూస్తానీ శాస్త్రీయ సంగీతంలో పరిచయం ఉన్నవారికి మాత్రం సారంగీ అనేది గాయకులకు పక్కవాద్యంగా ఉపకరిస్తుందని తెలుసు. అటువంటి సారంగీ పక్కవాద్యంగానే కాక ఈనాడు సోలో కచేరిగా కూడా ప్రతిష్ఠ పొందిందంటే అందులో రామ్‌నారాయణ్ పాత్ర అతి ముఖ్యమైనది.

పాతహిందీసినిమాల్లో రామ్‌నారాయణ్ చాలా పాటలకు సారంగీ వాయించారు. శంకర్-జైకిషన్ సారథ్యంలో 'సీమా' చిత్రంలోని లతా మంగేశ్కర్ జైజైవంతీ రాగంలో పాడిన 'మన్ మోహనా బడే ఝూఠే' అనే పాటకు సారంగీ వాయించడమే కాక స్వరకల్పనలోనూ రామ్‌నారాయణ్ సహాయం చేశారట. నౌషద్ సంగీతాన్నం దించిన గంగా జమునాలో లతా పాడిన 'దో హంసోంకా జోడా' పాటలో సారంగీ అద్భుతంగా పలికిందంటే అది పండిట్‌జీ చలవే. కశ్మీర్ కీ కలీ లో 'దీవానా హువా బాదల్' అనే పాటలో ఓ.పి.నయ్యర్ బాణీకి వన్నె తెచ్చిందీ ఆయనే. ఇవి శాస్త్రీయకళకు నిదర్శనాలు కాకపోయినా పామరులను ఆకట్టుకున్నాయనేదీ మరిచిపోరాదు.



సారంగీ టెక్నిక్‌లలో రామ్‌నారాయణ్ ప్రతిభ అసామాన్యం. శాస్త్రీయరాగాలపై ఆయనకు ఉన్న అధికారమూ, మూడు స్థాయిలలోనూ అవలీలగా సాగే స్వరప్రస్తారమూ కొట్టవచ్చినట్టు వినిపిస్తాయి. కేవలం పక్క వాద్యంగా అణిగి ఉండకుండా ఎంతో అగ్రెసివ్‌గా పలుకుతుంది ఆయన సారంగీ. అసలు సారంగీ గాత్రంలాగే వినబడుతుంది. గాయకులను మించిన ఆర్తీ, ఆవేదనా పలుకుతాయి. గుండెల్ని పిండేసే ఆ ఆవేశాన్ని చాలామంది శ్రోతలు భరించలేరు కూడా. ఈ లక్షణాలన్నీ రామ్‌నారాయణ్ సంగీతంలో ఉన్నాయి.

వ్యక్తిగతంగా రామ్‌నారాయణ్ నిరాడంబరుడేయ అయినా చెప్పేదేదో నిర్మొహమాటంగా చెప్పగలరు. ఇతర కళాకారుల గురించి తనకు నచ్చని విషయాలను కుండ పగలేసినట్టుగా చెప్పడానికి వెనకాడడు. ఈ రచయిత ఆయన్ని కలుసుకున్నప్పుడు అనేక విషయాలు ముచ్చటించటం జరిగింది.

సారంగీకి సంగీత ప్రపంచంలో తగిన గుర్తింపు రాలేదనే బాధ ఆయనకు ఎక్కువ. తానొక్కడూ ఎంత శ్రమపడ్డా ఈ రోజుల్లో సారంగీ విని ఆనందించేవారూ, కచేరీలు ఏర్పాటు చేసేవారూ తగ్గిపోయారనేది ఆయన ఫిర్యాదు. పరిస్థితుల దృష్ట్యా ఆయన తన కుమారుడైన బ్రిజ్ నారాయణ్‌కు సారంగీ నేర్పకుండా సరోద్ నేర్పించాడు. బ్రిజ్ నారాయణ్ నేటి మేటి సరోద్ కళాకారులలో ఒకరు. ఆయన కుమార్తె అరుణా కల్లే మాత్రం సారంగీలో మంచి నైపుణ్యం సంపాదించింది. ప్రస్తుతం తన భర్తతో కెనడాలో నివాసముంటోంది. రామ్‌నారాయణ్ ప్రతిభకు వారసులు వీరే.

రామ్‌నారాయణ్ సారంగీ గురించి చాలా విషయాలు చెప్పారు. దక్షిణాదిలో గాయకులకు వయొలిన్ లాగే ఉత్తరాదిలో గాయకులకు సారంగీని పక్క వాద్యంగా వాడతారు. గాయకులు పలికించే గమకాలన్నీ అదే స్థాయిలో సారంగీ మీద పలుకుతాయి. ఈ కారణంగా కొందరు గాయకులు సారంగీ తమ గాత్రంతో పోటీ పడుతుందని. చిరాకు పడడం కద్దు. అటువంటివారు సారంగీకి బదులుగా హార్మోనియం ఉపయోగించడానికి ఇష్టపడతారు. వి.బి కేస్కర్ కేంద్ర మంత్రిగా ఉన్నప్పుడు హార్మోనియం మన రాగ సంగీతానికి పూర్తిగా న్యాయం చెయ్యని కారణంగా దాన్ని నిషేధించడం జరిగింది

ఆ విధంగా రేడియోలో సారంగీ వినబడే అవకాశాలు పెరిగాయి. అయినప్పటికీ హార్మోనియం అలవాటయిన ఉస్తాద్ అమీర్‌ఖాన్ వంటి మహా గాయకులు సారంగీ అంటే ఇష్టపడనందువల్ల కేవలం తబలాతోనే రేడియో కచేరీలు చేశారు. తమాషా ఏమిటంటే అమీర్‌ఖాన్, ఆలీఖాన్‌లు ఇద్దరూ కూడా సారంగీ వాయిద్యకారుల వంశాల్లో జన్మించినవారే. ఎటొచ్చి మొదట్లో జానపద వాయిద్యంగా ఉండిన సారంగీ క్రమంగా నాట్యకత్తెలకు పక్కవాయిద్యంగా "పతనం" చెందడంతో తమ సారంగీ సంప్రదాయం గురించి చెప్పుకోవడమంటే కొందరు విద్వాంసులకు ఇష్టం ఉండేది కాదు.



వ్యాసకర్తతో రామ్‌నారాయణ్



మూడు తీగల సారంగీ వాయిద్యం. కమాను లావుగా ఉంటుంది. ధ్వని వెలువడే రెసోనేటర్ చర్మంతో కప్పబడి ఉంటుంది.

రామ్‌నారాయణ్ 1925లో రాజస్థాన్‌లోని ఉదయపూర్‌లో జన్మించారు. వారి వంశంలో అయిదారు తరాలుగా శాస్త్రీయ సంగీత సంప్రదాయం కొనసాగుతూ వస్తోంది. రామ్‌నారాయణ్ తండ్రి నాథూజీ బియావత్ సారంగీని పోలిన దిల్‌రుబా అనే వాయిద్యంలో దిట్ట, సారంగీలాగా కాకుండా దానికి సితార్‌లాగా మెట్లుంటాయి. రామ్‌నారాయణ్ అయిదేళ్ళవాడై ఉండగానే ఒక చిన్న సారంగీ తీసుకుని వాయించడం మొదలుపెట్టాడట. ఏడో ఏటి నుంచీ పద్ధతిప్రకారం సాధన మొదలయింది. మాధవప్రసాద్, పండిత్ ఉదయ్‌లాల్, ఉస్తాద్ వహీద్ ఖాన్ వంటి విద్వాంసుల మార్గదర్శకత్వంలో శిక్షణ పొంది, తన పధ్నాలుగో ఏటనే రామ్‌నారాయణ్ లాహోర్ రేడియో స్టేషన్‌లో సారంగీ వాద్యకారుడిగా ఉద్యోగం సంపాదించాడు. స్వాతంత్ర్యానంతరం ఆయన ఢిల్లీ ఆలిండియా రేడియోకు వచ్చారు. రామ్‌నారాయణ్ ఎన్నో సంవత్సరాలపాటు బడేగులాం ఆలీఖాన్, ఓంకార్‌నాథ్ ఠాకుర్ వంటి అనేక ప్రసిద్ధుల వద్ద పక్కవాయిద్యం వాయించారు. ఆ అనుభవంవల్ల ఆయనకు సంగీతం గురించిన అవగాహన పెరిగింది. తరవాత బిస్మిల్లాఖాన్ వంటి దిగ్గజాలతో జుగల్‌బందీ కచేరీలు చేశారు.

రామ్‌నారాయణ్ అన్నగారు పండిత్ చతుర్‌లాల్ మంచి తబలా విద్వాంసుడు. చిన్నవయసులోనే కాలం చేసిన ప్రతిభావంతుడు. మొదట్లో పండిత్ రవిశంకర్‌తో దేశవిదేశాల్లో పర్యటించారు కూడా. ఆయన సాంగత్యం తొలిరోజుల్లో రామ్‌నారాయణ్‌ను ప్రభావితం చేసింది. వీరిద్దరూ కలిసి జర్మనీ వగైరా దేశాల్లో వాయించిన కచేరీలు అక్కడి శ్రోతలను ఉర్రూతలూగించాయి.

1950 దశకంలోనే రామ్‌నారాయణ్ సారంగీ మీద పరిశోధనలు మొదలుపెట్టి, సారంగీ నిర్మాణంలోనూ, కమాను వేసే పద్ధతిలోనూ కొన్ని మార్పులు ప్రవేశపెట్టారు. గట్టి ఆత్మవిశ్వాసంతో సారంగీకి స్వయం ప్రతిపత్తి కలిగించడానికి ప్రయత్నం చేసి అందరూ హర్షించకపోయినా సోలో కచేరీలు ప్రారంభించారు. క్రమంగా పక్క వాయిద్యం వాయించడం మానుకున్నారు. ఆ పట్టుదలకు 1957 నుంచీ మంచి ఫలితాలు కలగసాగాయి. ఆయనకు పద్మశ్రీ, పద్మభూషణ, సంగీతనాటక అకాడమీ బహుమతి, అనేక ఇతర గౌరవ సన్మానాలూ లభించడమే కాక దేశవిదేశాల్లో కచేరీల అవకాశాలు కలిగాయి. యొహుదీ మెనూహిన్ వంటి విశ్వవిఖ్యాత సంగీతజ్ఞులు ఆయన ప్రతిభను కొనియాడారు. జీవితంలో సంగీతానికి చేసిన సేవకు గుర్తింపుగా రామ్‌నారాయణ్‌కు 1999లో ఆదిత్య విక్రమ్ బిర్లా కళాశిఖర పురస్కారం లభించింది.

సినిమావాతావరణం సరిపడని రామ్‌నారాయణ్ మాత్రం తాను రేడియో ఉద్యోగం మానుకున్నాక కేవలం ఆర్థిక పరిస్థితుల కారణంగానే వాయించవలసి వచ్చిందని అంటారు. ఆయనకు భారతీయ సంగీత సంప్రదాయం అంటేఎంతో గర్వం. రాజీ ధోరణి ఆయనకు నచ్చదు. సారంగీ అనేది నూరు రంగులు వెదజల్లగలిగిన "సౌరంగీ" అంటారాయన. నూతన పద్ధతులను ఆయన గౌరవిస్తారు కాని హిందుస్తానీ సంగీతంలో నావెల్టీ కోసమని కర్ణాటక ధోరణులను ప్రవేశపెట్టడం ఆయనకు నచ్చదు. ఆయనకు సమకాలికుడూ, అతి ప్రతిభావంతుడూ అయిన సారంగీ విద్వాంసుడు సుల్తాన్‌ఖాన్ లాగా గజల్ సంగీతానికి, ఫ్యూజన్ సంగీతంలో నూతన ప్రయోగాలకూ ప్రయత్నించడం ఆయనకు సరిపడదు.

రామ్‌నారాయణ్‌కు శిష్యులకు సంగీతం నేర్పడమంటే ఆసక్తి. వయసు పైబడుతున్నందువల్ల తన సంప్రదాయం తనతో అంతరించిపోకుండాలని ఆయన తాపత్రయం. ఏడు దశాబ్దాలుగా సారంగీ సంగీతానికి మారుపేరుగా నిలిచిన పండితుడు రామ్‌నారాయణ్.

-డా॥ కొడవటిగంటి రోహిణీప్రసాద్

## సరళీస్వరాలు - వక్రభ్రమణాలు



హార్మణీ వాయిస్తూ పాడే వీధి గాయకుడు
అవుతాడా ఎప్పటికైనా కాంగ్రెసు నాయకుడు
అనాడు రేడియో పెడుతుంది హార్మణీకి నమస్కారం
ఆనాడేనా తొలగిస్తుందా ఈ నాటి బహిష్కారం
(ఆలిండియా రేడియో హార్మోనియం వాద్యాన్ని నిషేధించిన విషయాన్ని ఎద్దేవా చేస్తూ ఆరుద్ర తన ఇంటింటి పజ్యాలులో రాసిన పద్యమిది)

# పద్మనాభం ఆత్మకథ



## సీరియల్ 5



నేను సినిమారంగాన్ని విడిచినా, అది నన్ను విడవలేదు. 'వీరకుమార్'కు అడ్వాన్సు తీసుకున్నానుగా, 'షూటింగ్ ప్రారంభం చేస్తారు. వచ్చి నటించమను' అని కబురు పెడుతూ సి.పుల్లయ్య గారు బైరాగికి డబ్బు యిచ్చి శింహాద్రిపురం నా అడ్రసుకు పంపారు. మా నాన్న శేషయ్యగారు ఆ 50 రూపాయలు తీసుకొని కొనకండ్లకు వచ్చారు. 'జెమినీ వారు 50 రూపాయలు పంపారు. షూటింగ్ వున్నది నిన్ను రమ్మన్నారు. పెద్దలతో వ్యవహారం, వెళ్లకపోతే బాగుండదు' అని నచ్చచెప్పి ఆ డబ్బు చేతిలో పెట్టి మద్రాసు పంపారు.

'వీరకుమార్ 'దర్శకులు సి.పుల్లయ్య గారయితే, అసిస్టెంట్ వారి కుమారులు సి.ఎస్.రావు గారు. నల్ల రామమూర్తిగారి యింట్లో వున్నాను. ఆ సినిమా షూటింగు జరుగుతూండగానే విజయాసంస్థతో నాకు పరిచయం ఏర్పడింది. అది నా కెరియర్‌ను మలుపు తిప్పింది.

నాగిరెడ్డి, చక్రపాణి నిర్మాతలుగా మారి విజయా బ్యానర్‌పై తొలిప్రయత్నంగా 'షావుకారు' సినిమా తీస్తున్నట్లుగా విన్నాను. డైరక్టరు ఎల్.వి.ప్రసాదు. ఆయన అసిస్టెంటు డైరెక్టర్ తాతినేని ప్రకాశరావు గారు నాకు పరిచితులే! బ్యాట్‌మింటన్‌లో కలిసేవాళ్లం! "మీ 'షావుకారు'లో వేషం ఇప్పించండి" అని అడిగాను. ఆయన నవ్వేసి "మాకు పెద్ద పెద్ద పర్శనాలిటీలు కావాలి. బుడతగాడివి నీకు వేషం లేదు" అన్నారు.అలా అన్నా పోలయ్య అనే నౌకరు వేషం నన్ను వెతుక్కుంటూ వచ్చింది.

ముందు ఆ వేషానికి బాలకృష్ణను చూశారు. కానీ అతను చక్రపాణిగారికి నచ్చలేదు. "వీడు ముదురుగా వున్నాడు, ఇంకెవరైనా లేరా?" అని అడిగేరు. వెంటనే ఎల్.వి.ప్రసాద్‌గారు - " 'రాధిక'లో కృష్ణుడిగా యాక్టు చేసిన అబ్బాయి పద్మనాభం వున్నాడు. ఈ వేషానికి సరిపోతాడు" అని చక్రపాణిగారికి, నాగిరెడ్డిగారికి చెప్పారు.

మరుసటిరోజు తాతినేని ప్రకాశరావు బ్యాట్‌మింటన్‌లో కలిసినప్పుడు "ఒరే అల్లుడూ, నీకు 'షావుకారు'లో వేషముంది. విజయా ఆఫీసుకురా" అని అన్నారు. ఆర్కాటు మొదలియార్ వీధిలో విజయా ఆఫీసుకు వెళ్లాను. శ్రీ నాగిరెడ్డిగారు, చక్రపాణిగారు, తాతినెని ప్రకాశరావు, రజనికాంత్ అందరూ వున్నారు. నేను పాడిన ఇమిటేషన్ పాటలు విన్నారు.

నాగిరెడ్డిగారి వూరు ఎద్దులయ్యగారి కొత్తపల్లెకు ఒక మైలు దూరంలోనే మా వూరు శింహాద్రిపురం వుంది. " మా ప్రాంతంవాడివా?" అంటూ నాగిరెడ్డిగారు ఆనంద పడ్డారు. నెలకు 150 రూపాయలు జీతం ఇస్తామన్నారు. అంతలో చక్రపాణిగారికి ఓ సందేహం - "పోలయ్య వేషానికి గుండుంటుంది. మరి నువ్వు గుండు గీయిస్తావా?" అని అడిగారు. త్యాగయ్యలోనే అనుభవం వచ్చిందిగా, " తలవెంట్రుకలే కాదు తలకూడా తీయించేమన్నా తీయిస్తాను" అన్నాను. అలా అనేసరికి అందరూ ఫక్కున నవ్వారు.

'షావుకారు' పాత్ర వేసినది -గోవిందరాజుల సుబ్బారావు గారు. హీరో రామారావు గారు, హీరోయిన్ జానకి. శాంతకుమారి, శివరాం, సీత, ఎస్.వి. రంగారావు, శ్రీవత్స, జోగారావు, బాలకృష్ణ, వల్లం నరసింహారావు లతో బాటు నేను పోలాయి వేషం వేశాను. మ్యూజిక్ ఘంటసాల వెంకటేశ్వరరావు గారు, ఫొటోగ్రఫీ మార్కస్‌బార్ట్‌లే.. కళ మాధవపెద్ది గోఖలే, అసిస్టెంట్ కళాధర్, దర్శకులు ఎల్.వి.ప్రసాద్, అసిస్టెంట్స్ తాతినేని ప్రకాశరావు, రజనీకాంత, ఆచార్య ఆత్రేయ రచన. ఇలాటి హేమాహేమీ లతో 'షావుకారు' షూటింగ్ 1949లో ప్రారంభమై చక్కగా జరుగుతూ వుంది. షావుకారు వల్ల నాకు 'పాతాళభైరవి' లో వేషం ఇచ్చారు కె.వి.రెడ్డిగారు.

కె.వి.రెడ్డిగారు నాకు కొత్త కాదు. 'త్యాగయ్య'లో ఆయన డైరక్షన్‌లో వేశాక, 'రాధిక' తరువాత ఒకసారి కె.వి.రెడ్డి గారిని వాహినీ స్టూడియో లో కలిశాను. 'గుణసుందరి కథ' తీస్తున్నారు. పాడమన్నారు. గొంతు సరిగా లేదు. కె.వి.రెడ్డిగారు చికాకు పడ్డారు. "బాగా పాడేవాడివే, ఏమయింది? యిలా తయారయింది? గొంతు ఇలా వుంటే కప్పులు కడగడానికి కూడా నీవు పనికి రావు." అన్నారు. ఇంకేమంటాం? నమస్కారం పెట్టి వచ్చేశాను. ఆ తరువాత సినిమాలు విరమించుకుని శింహాద్రిపురం వెళ్లిపోయాను.

అయినా అదృష్టదేవత కరణం లెక్కలు నేర్చుకుంటూ వున్న నన్ను రెక్కబట్టుకుని మళ్లీ సినిమాలలోకి లాక్కురావడమే కాదు, కె.వి.రెడ్డి గారు మనసు మార్చుకునేట్లు చేసింది. అప్పుడు కె.వి.రెడ్డిగారు 'పాతాళ భైరవి' స్క్రిప్టు చేస్తున్నారు. రచయిత పింగళి నాగేంద్రరావు గారు. హీరోగా రాజారెడ్డి, మాంత్రికుడుగా ముక్కామల వగైరా తారాగణం అని అనుకున్నారు రెడ్డిగారు. ఎప్పుడైతే 'షావుకారు' రషస్ చూశారోఆయన మనసు మార్చుకొని హీరోగా రామారావుగారుని, మాంత్రికుడుగా రంగారావు గారిని అనుకొన్నారు. బాలకృష్ణను అంజిగా, నన్ను సదాజపుడుగా అనుకొన్నారు.

ఈ విషయం ప్రొడక్షన్ మేనేజరు చలపతిరావు గారు మాకు చెప్పి, 3 ఏళ్లు పర్మినెంట్ ఆర్టిస్టులుగా వుండడాన్ని యిష్టపడతారా? అని అడిగి



అందరి దగ్గర సమ్మతి తీసుకున్నారు. ఇది ఎంతో కలిసొచ్చిన సందర్భం అని నా మనసు ఎంతో ఆనంద పడింది.

'షావుకారు' రిలీజ్ అయింది. వైవిధ్యం గల ఉత్తమ చిత్రంగా ఆంధ్ర ప్రజానీకం హర్షం వ్యక్తం చేసింది. 'పాతాళ భైరవి' స్క్రిప్టు పూర్తి అయింది. కె.వి.రెడ్డిగారు అందరికీ స్క్రిప్టు వినిపించి పోర్షన్స్ యిచ్చారు. 'సదాజపుడుగా నీ క్యారెక్టర్ మంచిది. బాగా చేయాలి నాయనా' అన్నారు రెడ్డిగారు. 'అలాగే సార్' అన్నాను.

కోడంబాకంలో విజయా వాహినీ స్టూడియో దగ్గరగా ఒక చిన్నరూము తీసుకొని నేను, బాలకృష్ణ వున్నాము. 'తుకారాం' నాటకంలో బాలకృష్ణతో కలిసి వేస్తూన్నప్పుడు ఒకసారి గుంటూరులో నాకు మలేరియా జ్వరం వచ్చింది. అప్పుడు బాలకృష్ణ నన్ను ఏలూరుకు తీసుకుపోయి 10 రోజులు వుంచుకొని తిరిగి నయం కాగానే మద్రాసుకు చేర్చాడు. అప్పటి నుంచి బాలకృష్ణ నాకు శ్రేయోభిలాషి అయ్యాడు. బండారు వెంకటేశ్వరరావు గారి 'వెంకటేశ్వర మహాత్మ్యం'లో బాలకృష్ణ నటన చూసి, కె.వి.రెడ్డి గారు పాతాళభైరవిలో అంజిపాత్ర యిచ్చారు.

నాకు పర్మినెంటు ఆర్టిస్టుగా నెలకు 150 రూపాయిలు జీతం. పిక్చరుకు 500 రూపాయల బోనస్. పాతాళ భైరవి తెలుగు, తమిళంలో తీసారు. విజయాలో మా అందరికి ఒక యూనివర్సిటీలో వున్నట్లు వుండేది. ప్రతి రోజూ షూటింగు వున్నా లేకపోయినా అటెండెన్స్ వేయాలి. 30 తారీకున జీతాలు యిచ్చేవారు. స్టంటు మాస్టర్ రాఘవులు రామారావు గారికి, బాలకృష్ణకు స్టంటు నేర్పేవాడు. 'లలలూ..' అనే పాట లక్ష్మీకాంతం, మేము డాన్సు ప్రాక్టీసు పసుమర్తి కృష్ణమూర్తి గారి పర్యవేక్షణలో ఒక నెల రిహార్సల్స్ చేశాం.



అలాగే సీన్సు కూడా ప్రాక్టీసు చేసేవారం. మాంత్రికుడు అందరికీ అరటి పండ్లు యివ్వడం, టోపీలు పెట్టడం సీను జరుగుతూవుంది. ముందుగా అందరికీ టోపీలు పెట్టి తాళ్లతో టోపీలు పైకి లాగారు. ట్రిక్ షాట్ వల్ల వాళ్లందరికీ టోపీలు పైనుంచి వచ్చినట్లు కనపడుతుంది. నా క్లోజప్ షాట్. పైనుంచి కిందకు చూడమన్నారు. నాకు సందేహం వచ్చి ఎందుకలా చూడాలని అడిగాను. ఆయన కోపంగా కె.వి.రెడ్డిగారు చెప్పింది చెయ్యి అన్నారు. కె.వి.రెడ్డి గారంటే అందరికీ హడలు. చిన్నతప్పు కనిపించినా సింహంలా అరిచేవారు. నేను ఇక ప్రశ్నలు ఆపి, వినయంగా తలవూపి వారు చెప్పినట్లే పైనుంచి కిందకు చూశాను. షాట్ అయింది. నన్ను వెళ్లి కూర్చోమని చెప్పి అప్పుడు "ఏం నాయనా, నేను నిన్ను గట్టిగా మందలించినందుకు బాధపడ్డావా? పై నుంచి టోపీలు అందరి తలల మీదకు వస్తాయి. అందుకే నిన్ను ఆశ్చర్యంగా పైనుంచి కిందకు చూడమన్నాను" అని వివరించారు. ఆయన సహృదయానికి నా మనసులో జోహార్లు అర్పించాను.

'పాతాళభైరవి' సినిమా షూటింగు సందర్భంగా కొన్ని విషయాలు ముచ్చటిస్తాను. నేను భూతద్దంలో గురువు ఎక్కడున్నాడో చూసే సన్నివేశం తీస్తున్నారు.ప్రసిద్ధ హిందీ దర్శకులు శ్రీ శాంతారాం గారు వచ్చి కాసేపు చూసి వెళ్లారు. అలాంటి పెద్దవారి ముందు నటించే అదృష్టం కలిగిందన్న ఆనందంతో తబ్బిబ్బయ్యాను.

కె.వి.రెడ్డి గారి పర్‌ఫెక్షన్ గురించి ఓ సంఘటన నాకు భయం వేసింది. కత్తులున్న గుహ లాంగ్ షాట్. తోటరాముడు, మాంత్రికుడు వెళతారు. ప్రతికత్తి ఒక పూలహారం అవుతుంది. అదే లాంగ్ షాట్‌లో సదాజపుడు 'జై పాతాళభైరవి' అంటూ గురువును వెతుక్కుంటూ పోవాలి. నేను వేషం వేసుకుని ఆ షాట్ కోసం చూస్తున్నాను. అసిస్టెంట్స్ తిలక్, జంబులింగం ఆ షాట్ గురించి చెప్పడం మరచిపోయారు. కె.వి.రెడ్డి గారికి జ్ఞాపకం



వచ్చింది. సదాజపుడు ఆ లాంగ్ షాట్‌లో వెళ్లాలని స్క్రిప్టులో రాసుకున్నానే అనుకుంటూ స్క్రిప్టు తీసి చూశారు. "యిందులో ఉంది. ఎందుకు జ్ఞాపకం చేయలేదు. మీరేమైనా నిద్రపోతున్నారా?" అని గట్టిగా అరిచేటప్పటికి యిద్దరు అసిస్టెంట్లూ తెల్లబోయారు. కెమెరా యాంగిల్ అప్పటికే మార్చారు. మళ్ళీ కెమెరా తీసుకొచ్చి లాంగ్ షాట్ అరేంజ్ చేశారు. కెమెరా ఆన్ అయింది "యాక్షన్" అన్నారు కె.వి. గారు. జై పాతాళభైరవి, జై పాతాళభైరవి అంటూ భయంగా అటూ యిటూ



చూస్తూ గుహలోకి వెళ్లిపోయాను. రెడ్డి గారి స్క్రిప్టు అంత పకడ్‌బందీగా వుండేది.

'పాతాళభైరవి' పిక్చర్ విడుదల. 1950 లో విడుదలైంది. తెలుగు, తమిళం ఒకేసారి. ఇటు ఆంధ్రా, అటు తమిళనాడులో అత్యంత వైభవంగా 100 రోజులు ఆడింది. నెల్లూరు విజయమహలులో శతదినోత్సవం జరుగుతోంది. ఇసక వేస్తే రాలని జనం. నటీనటులందరికీ ప్రజలు నీరాజనాలు పడుతున్నారు. రామారావు, రంగారావు, బాలకృష్ణ, రేలంగి గార్ల ఉపన్యాసాలతో ఆనందంలో ఓలలాడారు నెల్లూరు ప్రజలు. ఉపన్యసించడానికి నావంతు రాగానే 'మోసంగురూ' అని అరిచాను. ప్రజలు గొల్లుమన్నారు. చప్పట్లతో హాలు దద్దరిల్లింది.

సభ అయ్యాక బాల్కనీలో నించొని నేను ఏడుస్తున్నాను. కె.వి.రెడ్డి గారు చూసి "ఏం నాయనా ఏడుస్తున్నావు" అనగానే, "ఏడుపు కాదండి ఆనందబాష్పాలు! నా గొంతు బొంగురుపోయి నేను సరిగ్గా పాడకపోతే మీరు విని యిలా పాడితే నీవు కప్పులు కడగడానికి కూడా పనికిరావని అన్నారు. అది నాపట్ల ఆశీర్వాదమైంది ఈ రోజు. మీ దర్శకత్వంలో, మీ ఆశీర్వాదంతో నన్ను ఒక నటుడుగా గుర్తింపు ఇచ్చారు." అని కాళ్లమీద పడ్డాను. ఆయన నవ్వి "అంతా టైం నాయనా" అన్నారు. ఆంధ్రదేశం కాక బెంగుళూరు, మైసూరులలో కూడా శతదినోత్సవ వేడుకలు జరిగాయి.

తరువాత 'పెళ్ళిచేసిచూడు', 'చంద్రహారం' నిర్మాణం తెలుగు, తమిళంలో జరిగాయి. విజయా వారితో కాంట్రాక్టు 3 ఏళ్ళు క్షణాల్లో గడిచిపోయాయి. తోలేటి వెంకటేశ్వరులు 'శ్రీ కాళహస్తి మహాత్మ్యం' వ్రాస్తున్నారు. గుబ్బిప్రొడక్షన్ వారి చిత్రం. ఎ.వి.యం. స్టూడియోలో షూటింగ్ జరుగుతూవుంది. ఇందులో పురోహితుడి కొడుకు కాశి వేషంకు ఆఫర్ వచ్చింది. దాని కన్నడ వెర్షన్ పేరు 'బేడర కణ్ణప్ప'. (హీరో రాజకుమార్) దానిలో కాశి వేషం వేసినది ప్రఖ్యాత హాస్య నటుడు నరసింహరాజు. కర్ణాటకలో విడుదలై 100రోజులు ఆడింది.

కాంట్రాక్టులో ఉన్నాను కాబట్టి నాగిరెడ్డి, చక్రపాణి గార్ల అనుమతి తీసుకుని తోలేటి గారితో ఏ.వి.యం.కు వెళ్లాను. కాశి వేషానికిసెలెక్టు అయ్యాను. వెయ్యి రూపాయలు పారి తోషికం. దర్శకులు ఎస్.ఎన్.సింహ, సంగీతం సుదర్శనం. ఈ వేషానికీ సరేనన్నాను. గుండు గీయించమన్నారు, సరేనన్నాను. ఈ గుండు వల్ల ఓ లాభం కలిగింది.అప్పట్లో కోడంబాకం స్టేషన్ నుంచి ఏ.వి.యం. కు రావాలంటే గుర్రపుబండిలో రావాలి. (25 నెం.బస్సులు రెండే వుండేవి.) గుండుగీయించుకొని జట్కాలో వెళ్లుతుంటే చల్లటిగాలి గుండుకు వీచడంతో హాయిగా నిద్రపట్టేసేది!

ఈ సినిమాలో నటవర్గం రాజకుమార్, లింగమూర్తి, రాజసులోచన, కుమారి. భక్తి, హాస్యం నిండిన కాశి వేషం నాకు రావడం నిజంగా అదృష్టం. తిన్నడికి ఓం నమశ్శివాయ మంత్రాన్ని చెప్పడంతో జ్ఞానోదయం కలిగి మహా భక్తుడై ఈశ్వరునికే కన్నులు అర్పిస్తాడు తిన్నడు. ఇందులో ఘంటసాల గారు అమోఘంగా పాడిన పాటలు - 'మహేశా పాప వినాశ', 'మధురము శివమంత్రం', 'చేకొనవయ్య మాంసమిదే', 'ధన్యుడనైతిని దేవ దేవా'. వీటిని ఆంధ్రప్రజానీకం యిప్పటికీ మరచిపోరు.

1954లో చిత్రపు నారాయణమూర్తి గారి దర్శకత్వంలో 'సతీ

అన్నపూర్ణావారి 'ఇద్దరు మిత్రులు' చిత్రంలో రేలంగి గారి పాత్రకు ఓ పెంపుడు కుక్క ఉంటుంది. దానికోసం చాలాచోట్ల చాలామంది ప్రయత్నించారు. కొందరు తమ పెంపుడు కుక్కల్ని నేరుగా ఆఫీసుకు తీసుకువచ్చారు. (అన్నపూర్ణా చిత్రంలో 'ఛాన్స్' అంటే మాటలా?)



పద్మనాభంగారితో పాటు వారి సతీమణి ప్రమీల కూడా తమ కుక్కపిల్లను తీసుకువచ్చారు. ఆ కుక్కపిల్ల రేలంగిగారి పక్కలో పడుకోవాలి. మంచం మీద పడుకోపెట్టి దుప్పటి ముసుగెట్టగానే అది సెట్‌లోంచి పారిపోయింది.

దాని వెనుక శ్రీమతి ప్రమీల "బుజ్జీ! బుజ్జీ! రామ్మ! నా తల్లి రా!" అంటూ పరుగెత్తింది. ఆమె వెంట"ప్రమీలా! ప్రమీలా!" అంటూ పద్మనాభం గారు పరుగు. వారు కుక్కపిల్ల కోసం స్టూడియో అంతా పరుగులు. పద్మనాభంగారు లేకుండా షాట్ లేదు.

అందుకని, సహాయదర్శకుడు "పద్మనాభంగారు! మీర్రండి. కుక్కపిల్ల లేకపోయినా పరవాలేదు. మీ షాట్ రెడీ!" అంటూ పరుగు. కుక్కపిల్ల దొరికినా అది నటించలేకపోయింది.

చివరకు రేలంగి గారి ఇంటి నుండి వారి పెంపుడు కుక్కను తీసుకువచ్చి చిత్రం పూర్తిచేశారు.

- స్వామి చిత్రానంద

అనసూయ' తీద్దామనుకుని నారదుడుగా నన్ను ఎన్నుకున్నారు. తరువాత కొన్ని కారణాల వల్ల సుందరలాల్ నహతా గారు నారాయణమూర్తిగారిని మార్చి కడారు నాగభూషణం గారిని దర్శకుడిగా తీసుకున్నారు. ఆయనకు ఓ సందేహం వచ్చింది. "పద్మనాభం నారదుడిగా చిన్నవాడు అవుతాడు రఘురామయ్య, సూరిబాబులాంటివారైతే బాగుంటుంది." అని సూచించారు. అప్పటికే నాకు అడ్వాన్సు యివ్వడం జరిగింది. సుందర్‌లాల్ గారు "పరవాలేదు, పద్మనాభంతోనే కానివ్వండి" అని చెప్పారు. నారదుని వేషం చక్కగా కుదిరింది నాకు. "బాగుంది వేషం" అన్నారందరూ.



నాగభూషణం గారు తృప్తిపడ్డారు. "అంతా బాగానే వుందిగానీ కాస్త పొట్టివాడవు అయ్యావు కదా" అని చమత్కరించారు.

ఆ తరువాత నారదుడిగా 'కృష్ణప్రేమ, సతీసుకన్య, కృష్ణలీలలు, శ్రీరామ కథ, సతీతులసి, ప్రమీలార్జునీయంలలో వేస్తేమంచి పేరు వచ్చింది.

'పరివర్తన', 'జయసింహ'లో అతిథి నటుడుగా చేసాను. ఎన్.ఎ.టి. వారి 'పాండురంగమహాత్మ్యం' లో నాయకుడు వ్యసనాలకు బానిసై తల్లిదండ్రు లను చులకనగా చూసి తరువాత పశ్చాత్తాపం చెందుతాడు. శ్రీ రామారావు గారి స్వంత సినిమా. ఇందులో రామారావు తమ్ముడిగా వేసిన వేషం వల్ల నాకు మంచి పేరు వచ్చింది.

ఆర్.ఆర్.పిక్చర్స్ 'కార్తవరాయని కథ' లో నాది కామిడీ విలన్ పాత్ర. హీరో రామారావు గారికి ఆపోజిట్. రామారావు గారు, సావిత్రి, కన్నాంబ గారు ముఖ్య పాత్రలు. నా అసిస్టెంట్‌గా బాలకృష్ణ, ఇ.వి.సరోజ వేశారు. తమిళ వెర్షన్ నా వేషం తంగవేలుకిచ్చారు. అప్పట్లో డైలాగ్ మాడ్యులేషన్, యాక్టింగులో తంగవేలు గారిని మించిన వారు లేరు. ఆయన వేసిన పాత్ర వేయవలసి రావడం వల్ల నాకు కామెడీపై పట్టుదొరికింది. 'కార్తవరాయుని కథ'లో నా కామెడీ బాగా పండింది.

తంగవేలే కాదు నన్ను ఇన్‌స్పైయిర్ చేసిన వారు చాలామంది ఉన్నారు. హాలీవుడ్ నటులలో అయితే -బాబ్‌హోప్, రెడ్‌స్కెలిటిన్, డానీ కే, లారెల్‌హార్డీ..ఇలా ఎందరో. రేలంగి గారి గురించి చెప్పనే అక్కరలేదు. రేలంగి గారితో కలసి రంగున్‌రౌడి నాటకంలో నటించాను. నన్ను సైకిల్ మీద కూర్చోబెట్టుకుని జెమిని స్టూడియోకు తీసుకెళ్లి సి.పుల్లయ్య గారికి పరిచయం చేశారాయన. 'వింధ్యరాణి'లో చిన్న వేషం దొరికింది.

రేలంగి గారు ఎప్పుడూ జోకులు వేస్తూ నవ్వించేవారు. ఒకసారి చిలమత్తూరులో 'రంగూన్‌రౌడి' నాటకం గురించి వెళ్లాము. గగ్గయ్య గారు, ఋష్యేంద్రమణి, రేలంగి, సీత వెళ్లాం. అందరినీ నవ్వించడానికి సీతకు నాకు గుళ్లో పెళ్లి చేశాడు రేలంగి గారు. అంతటితో వూరుకోకుండా ఒక గదిలో మమ్మల్నిద్దరినీ తోసి తలుపులు వేశారు. ఏం చేయాలో తోచక తలుపులు బాదాం కాసేపు. మమ్మల్ని ఏడిపించి తమాషా చేశారు.

1956. కుటుంబగౌరవం, రాజా మలయశింహ సినిమాలు. ప్రజానాట్యమండలి నాగభూషణం, మిక్కిలినేని, చదలవాడ కుటుంబరావు, వల్లం నరసింహరావు ఇతర సభ్యులతో 'శాంతి', అల్లీముతా' నాటకాలు వేశాం.

వాహినీ బి.ఎన్.రెడ్డి గారు "రాజమకుటం" మొదలుపెట్టారు. గుమ్మడి గారి కొడుకు భజరంగడుగా నన్నుతీసుకున్నారు. స్వచ్ఛమైన కామిడీ పాత్ర ఇది. రచన పాలగుమ్మి పద్మరాజు. రామారావు గారు, గుమ్మడి గారు, కన్నాంబ గారు, రాజసులోచన గారితో నటించే అవకాశం దొరికింది.

ఫోటోకర్టెసీ: సంజయ్‌కిశోర్

(ఇంకావుంది)

నిర్మాత డి.బి. నారాయణ ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వంలో ఎన్.టి.ఆర్.తో తీసిన 'దాగుడు మూతలు' సినిమాలో పద్మనాభం చెప్పిన డైలాగులు (గాలి పోయిన టైర్లని చూస్తూ) "బూరెల్లా ఉండేవి చపాతీల్లా అయ్యాయి" లాంటివి చాలా పాపులర్ అయ్యాయి ఆరోజుల్లో!

ఊర్వశి శారద ఆ చిత్రంలో అతనికి జంటగా నటించింది. తాతగారైన గుమ్మడి గురించి శారదతో పద్మనాభం పోట్లాడే సన్నివేశం కూడా ఎంతో ఆహ్లాదంగా ఉంటుంది. 'తాతయ్య అంటే నాకెక్కువ ప్రేమ' అని శారద అంటే 'లేదు నాకే ఎక్కువ ప్రేమ' అని పద్మనాభం వాదనకు దిగుతాడు. 'తాతయ్య ఛస్తే నేను సమాధి కట్టిస్తాను' అని అంటుంది శారద. "తాతయ్యని అర్జంటుగా ఇప్పటికిప్పుడు చావమను తాజ్‌మహల్ కట్టించకపోతే అప్పుడు అడుగు" అని అంటాడు పద్మనాభం.

వీళ్ళిద్దరికీ లవ్‌సాంగ్ ఉందా చిత్రంలో! అది కూడా ఎంతో పాపులర్ అయింది. ఆరుద్ర రాసిన ఆ యుగళగీతానికి కె.వి. మహదేవన్ సంగీతాన్ని అందించగా పిఠాపురం నాగేశ్వరరావు, స్వర్ణలత పాడేరు. ఆపాట సాహిత్యాన్ని ఓసారి చూడండి.



డివ్విడివ్విడివ్విట్టం - నువ్వంటేనే నా కిష్టం
డీడిక్కంది అదృష్టం - గట్టెక్కింది మన కష్టం

బాజాలతో బాకాలతో - పందిట్లో ఇద్దరం ఒకటౌదాం
బాజాలతో బాకాలతో - పందిట్లో ఇద్దరం ఒకటౌదాం ॥ డివ్వి ॥

అందరు చుట్టాలు వస్తారు - ఆనందమానందమంటారు
అబ్బాయి తొందర చూస్తారు - తాము అటు తిరిగి పకపకా నవ్వేరు
॥ డివ్వి ॥
కవ్వించి సిరులెన్ని కలిసొచ్చినా - కాబోవు పెళ్ళామె కడు పచ్చనా
కొండకు వేశాను ఒక నిచ్చెనా - నీకొంగు తగిలితే ఒళ్లు నునువెచ్చనా
॥ డివ్వి ॥
బుక్కా వసంతాలు చల్లుకుంటాం - ఎంచక్కా తలంబ్రాలు పోసుకుంటాం
దీవించివేస్తారు అక్షింతలు - ఇక అవుతాయి సౌఖ్యాలు లక్షింతలు
॥ డివ్వి ॥

సీరియల్

# హాస్యవల్లరి సంగీతలహరి 4

# కిశోర్ జీవనఝరి

- ఎమ్మెస్ స్వాతి



అక్టోబర్ 13, 1987.

కిశోర్‌కుమార్ తన బెడ్‌రూమ్‌లో గుండెనొప్పితో వాలిపోగానే లీనాగంగూలీ (అవును కిశోర్‌తో పెళ్లయ్యాక లీనా చందావర్కర్ భర్త ఇంటిపేరు గంగూలీ స్వీకరించింది.) ముందు ఖంగారుపడలేదు. కిశోర్ ఎప్పుడూవేసే ప్రాక్టికల్ జోకే అనుకుంది. 'ఇక చాల్లే లేలే' అంది. తర్వాత అర్థమయ్యింది. ఇదినిజమైన హార్ట్‌ఎటాకేనని. బావగారు అశోక్‌కుమార్ ఇచ్చిన మందుకోసం వెతకడం, అదిదొరక్కపోవడం జరిగింది.

కొద్దిసేపట్లో కిశోర్ విగత జీవుడయ్యాడు. లీనా హతాశురాలయింది.

కానీ ఈ విషాదాన్ని చిన్నారి సుమిత్ అర్థంచేసుకోలేదు. అతనికప్పుడు ఐదేళ్ళవయస్సు. "కిశోర్‌కుమార్ మర్‌గయాహై" "కిషోర్‌కుమార్ మర్‌గయాహై" అని చప్పట్లు కొడుతూ ఆడాడు. అవునుమరి, తను దొంగ చావు నటించినప్పుడల్లా కిశోర్ తన కొడుకుకి నేర్పించిన ఆట అది!

ఆవేళ కిశోర్ మృతదేహాన్ని చూడడానికి అతిథులు వస్తూంటే, సుమిత్ సంతోషం పట్టనలవి కాలేదు. మేడ మీదకు వెళ్ళండి. అక్కడ పడుకునివున్నాడు. 'కిశోర్‌కుమార్ మర్ గయాహై' అని అందరికీ చెప్పసాగాడు. చివరికి తండ్రి

'ఝుమ్రూ'లో అనూప్ కుమార్, కిశోర్‌కుమార్



## అపూర్వ సహోదరుల సమ్మేళనం 'చల్తీకా నామ్ గాడీ'

చలనచిత్ర చరిత్రలోనే అపూర్వమైన ఘటన అది. నిజజీవితంలో అన్నదమ్ములైన ముగ్గురు నటులు తెరపై కూడా అన్నదమ్ములుగా నటించారు. ఈ సినిమా తీయడానికి వెనుక ఓ కథ వుంది.

బాప్‌రేబాప్ (1944) నుండి నటుడిగా కిషోర్ దశ యెత్తుకుంది. చాలా హిట్లు, ఇంకా చాలా డబ్బులు వచ్చిపడ్డాయి. దాంతో ఇన్‌కంటాక్స్ వారు రంగంలోకి దిగారు. కానీ మన ఖాండ్వా బుల్లాడికి టాక్స్‌ప్లానింగ్ తెలియదు. 'నేను కష్టపడి సంపాదించిన డబ్బుకదా. దీంట్లో ఇంకోవాడికి వాటా ఏముంటుంది.' అనుకున్నాడు కాబోసు జుహులో పెద్ద బంగళా కట్టేశాడు. డబ్బు హాయిగా ఖర్చు పెట్టేడు. అది ఇన్‌కంటాక్స్ వాళ్ల దృష్టికి వచ్చింది. వాళ్లు వెంటపడ్డారు. 'ఇంత టాక్స్ కట్టు లేదా జైలుకి వెళ్ళు ' అన్నారు. కిశోర్‌కు అది ఎంత మాత్రం రుచించలేదు. నాకు సంపాదన లేకపోయినా ఫర్వాలేదు కానీ వీళ్లకు మాత్రం చస్తే పన్ను కట్టను అనుకున్నాడు.

ఫ్రెండ్స్‌ను సలహా అడిగితే బాగా నష్టం వచ్చే సినిమా ఓటి తీయమని సలహాయిచ్చారు. సంపాదించినదంతా దాంట్లో పోయిందని చూపిస్తే టాక్స్ కట్టక్కర్లేదని కిశోర్ ఆశ! హిందీలో చూస్తే తన సినిమాలు హిట్ అయిపోతు న్నాయి. బెంగాలీలో తానెవరో తెలియదు. బెంగాలీలో సినిమా తీస్తే ఫెయిలవడం ఖాయం అనుకుని కథ రాసుకున్నాడు. ఇద్దరన్న దమ్ములు, ఒక్కలాగే ఉంటారు. ఒకడు పాతకాలం ధోరణిలో ఠాగూర్ గీతాలు పాడితే, మరోడు కొత్త తరహాలో యోడలింగ్ పాటలు పాడతాడు. ఇది బెంగాలీలకు నచ్చదని కిశోర్‌కు గట్టి నమ్మకం. ఆ రెండు పాత్రలు తనే వేసాడు. సినిమా పేరు 'లోకోఛురి' (దాగుడు మూతలు). కథ, స్క్రీన్‌ప్లే తనదే. అమల్ మజుందార్‌కు దర్శకత్వం అప్పగించాడు. సంగీతం హేమంతకుమార్ (ఇక్కడో విషయం చెప్పాలి. తను తీసిన రెండు సీరియస్ సినిమాలు 'దూర్ గగన్‌కీ ఛావ్‌మే' 'దూర్‌కారాహీ' రెండింటిలోనూ తన సంగీత దర్శకత్వంలో టైటిల్ సాంగ్స్ హేమంతకుమార్ చేతనే పాడించాడు కిశోర్! తనను తీర్చిదిద్దిన బర్మన్ కూడా గాయకుడే అయినా ఆయన చేత పాడించలేదు. హేమంత కుమార్ అంటే కిశోర్‌కు అలాంటి గౌరవం ఉంది.)



ఫెయిలవుతుందని ఆశపెట్టుకుని తీసిన కిశోర్ తొలిసినిమా 'లోక్‌ఛూరీ' (బెంగాలీ) హిట్ అయికూచుంది!. ఆసినిమాలో కిశోర్, మాలాసిన్హా

ఆ సినిమాలో వేయడానికి కిశోర్ తన బెంగాలీని సరిదిద్దుకోవలసి వచ్చింది. తండ్రి కుటుంబం

చాలా కాలంగా మధ్యప్రదేశ్‌లో ఉండడం చేత ఆయన కొడుకుతో హిందీలో మాట్లాడేవారు. తల్లి మాత్రమే బెంగాలీలో మాట్లాడేది. అందువల్ల బెంగాలీలో కిశోర్ అంత స్ట్రాంగ్ కాదు. కాస్త పట్టుబట్టి, శ్రద్ధపెట్టి బెంగాలీ నేర్చుకుని కిశోర్ డబుల్ రోల్ వేసి పాటలు కూడా పాడేడు.



పిల్లన్నీ, పెద్దల్ని కూడా ఆనందింపచేసిన పాతబండి. అప్పటి నుండి డొక్కుకారు ఏదైనా కనబడితే దాన్ని 'చల్తీకానామ్‌గాడీ' అనడం పరిపాటి అయింది.

అతని కర్మకాలి ఆ సినిమా బెంగాలీలకు విపరీతంగా నచ్చేసింది. పెద్ద హిట్ అయి కూచుంది. దాంతో అతని ఆదాయపు పన్ను బాధలు రెట్టింపయ్యాయి. కిశోర్‌కు కోపం వచ్చింది. ఈసారి హిందీలో ఫ్లాపు తీద్దామనుకున్నాడు. 'చల్తీకా నామ్ గాడీ' కథ అల్లుకున్నాడు. స్క్రీన్‌ప్లే కూడా రాసుకున్నాడు. ముగురన్నదమ్ములు ఓ గరాజ్ నడువుతుంటారు. పెద్దన్న గారు స్త్రీ ద్వేషి. రెండోవాడికి అమ్మాయిలంటే ఇష్టమేకాని బెదురుగొడ్డు. మూడోవాడికి అనుకో కుండా ఓ అందగత్తె (మధుబాల) పరిచయ మవుతుంది. పెద్దన్న గారు ఆ ప్రేమను నిరసిస్తాడు. కాస్త క్రైమ్ కూడా కలిసిన తర్వాత పెద్దన్నగారి ప్రేమతో సహా అందరి కథ సుఖాంతం అవుతుంది.

ఈ సినిమాకు కూడా దర్శకత్వం వహించమని అమల్‌మజుందార్‌ను అడిగాడు కిశోర్. 'కాని నాకు హిందీరాదుగా' అన్నాడు అమల్. 'పర్వాలేదు చెయ్యి' అని కిశోర్ మొహమాట పెట్టాడు. ఇద్దరూ మంచి స్నేహితులు కాబట్టి అప్పటికి కాదనలేకపోయినా షూటింగ్ ప్రారంభం రోజున అమల్‌కి బెదురుపుట్టింది. మొహంచాటేశాడు.

విషయం గ్రహించి కిశోర్ వెళ్లి అమల్‌ను బతిమాలేడు. ఎంతచెప్పినా అమల్ వినలేదు. ఇటు ముహుర్తానికి అందరూ వచ్చేస్తున్నారు. కిశోర్‌కు ఏమీ పాలుపోలేదు.పరుగున నితిన్‌బోస్ ఇంటికి వెళ్లి విషయం చెప్పి ప్రాధేయపడ్డాడు. నితిన్ సరేనన్నాడు. వచ్చి సినిమా తీసిపెట్టాడు.



ఐదు ముప్పావలా ఇవ్వకపోతే అన్నగారు వీపు బద్దలుకొట్టేస్తాడని బతిమాలు కుంటున్న కిశోర్

అన్నదమ్ములతో బాటు సినిమాలో ముఖ్య పాత్ర వహించిన 1928 మోడల్ ఫోర్డు కారు కిశోర్ వాళ్లనాన్నదే. ఆ కారులో ఉన్న విశేషం ఏమిటంటే స్పీడు తక్కువగా ఉన్నప్పుడు హాయిగా దిగి పరిగెట్టుకుంటూ వచ్చి మళ్లీ ఎక్కేయవచ్చు. అంతేకాదు ఓ యాంగిల్‌లో పెట్టి స్టీరింగ్ వదిలేస్తే కారు గిరికీలు కొడుతూ వుంటుంది. ఇవి తెరమీద చూపిస్తే అది మంచి ఎట్రాక్షన్ అయింది.

సినిమాలో కిశోర్‌కు ఏమాత్రం తీసిపోనంత హుషారుగా మధుబాల నటించింది. 'పాంచే రుపయ్యా బారా ఆనా' 'హాల్ కైసాహై జనాబ్‌కా' పాటల్లో ఆమె కిశోర్ తో ఢీ అంటే ఢీ అంది. సినిమా తయారవుతుంటే కిశోర్ కు భయం వేసింది. కొంపదీసి ఇదీ హిట్ అవుతుందా అని! నిర్మాతగా తన పేరువేయకుండా తన సెక్రటరీ అనూప్ శర్మ పేరు వేశాడు. బ్యానర్ కె.యస్.ఫిలింస్ (బహుశా కిశోర్, శర్మ అనియేమో)

అతని భయాలు నిజం చేస్తూ సినిమా సూపర్, డూపర్ హిట్ అయింది. ఇప్పటికీ బెస్ట్ కామెడీ హిందీ సినిమాలలో ఒకటిగా దాన్ని చెప్పుకుంటారు.

శవాన్ని అందరూ తీసుకుని వెళ్లిపోతుంటే అప్పుడు అతనికి తెలిసింది, ఏదో ఘోరం జరిగిందని. అప్పుడు పెద్దపెట్టున ఏడ్చాడు. తల్లి దగ్గరకు తీసుకుని సముదాయించినా ఆగలేదు.

కిశోర్ చనిపోయినట్టు ఖరారు కాగానే బంధువులందరికీ లీనా ఫోన్ చేసి చెప్పింది. అందరికంటె ముందుగా వచ్చిచేరినది అనూప్ కుమార్.

అనూప్‌కుమార్ కిశోర్ కంటె 5 ఏళ్ళు మాత్రమే పెద్ద. అతను కూడా నటుడే. కొన్ని సీరియస్ పాత్రలు కూడా వేసినా ఎక్కువగా హాస్యపాత్రలు నటించాడు. కానీ అటు అన్న అశోక్‌కుమార్ నటనాస్థాయిని కాని ఇటు తమ్ముడు కిశోర్ కుమార్ గాయకస్థాయిని కానీ అందుకోలేక పోయాడు. అందువల్ల అతని గురించి చాలా తక్కువ మందికే తెలిసినా, 'చల్తీకా నామ్ గాడీ' 'ఝుమ్రూ' సినిమాలలో అతని పాత్రధారణ చూసినవారు నటుడిగా అతని స్థాయిని తక్కువగా అంచనా వేయలేరు.

కుంజాలాల్ గంగూలీ, గౌరీదేవి దంపతులకు ప్రథమ సంతానం అశోక్‌కుమార్. అతని తర్వాత సతీదేవి అనే కుమార్తె. ఈమెను శశధర్‌ముఖర్జీ (ఫిల్మిస్తాన్ ఎస్. ముఖర్జీ అంటే అందరికే సులభంగా తెలుస్తుంది.) పెండ్లాడడంతోనే గంగూలీ కుటుంబం సినిమా రంగానికి వచ్చింది. సతీదేవి పుట్టిన పదేళ్లకు అనూప్‌కుమార్ , ఆ తర్వాత ఐదేళ్లకు కిశోర్ పుట్టారు. అందువల్ల ఇంట్లో అందరికంటె కిశోర్‌కుమార్ కు వయసురీత్యా, చదువురీత్యా (అనూప్ చదువులో వెనుకబడి కిశోర్‌కి క్లాస్‌మేట్ అయ్యాడు) సన్నిహితుడు అనూపే! చిన్నప్పటినుండి కిశోర్‌కు దొరికిన బకరా అనూపే ! ఇది తెరమీద కూడా కనబడుతుంది. 'చల్తీకా నామ్ గాడీ'లో హమ్‌థే, వోథీ, ఔర్ సమా రంగీన్, సముఝ్ గయేన' పాటలో కిశోర్ అనూప్‌ను ఊరించి, ఊరించి చివరకు 'సబ్ ఝూఠ్ హై' అని ఏడిపిస్తాడు చూడండి.

కిశోర్, అనూప్ కలిసి క్లాసులు ఎగ్గొట్టి సినిమాలు చూసేవారు. కలిసి ఇంటి దగ్గర తెరలు కట్టి సినిమాసీన్లు అనుకరించి చూపేవారు. కలిసి మెట్రిక్ పాసయ్యి ఇండోర్‌లో కాలేజీలో చేరారు. ఇంటర్ పాసయ్యేక కలిసికట్టుగా చదువుకి గుడ్‌బై చెప్పి బొంబాయిలో పెద్దన్నగారి పంచన చేరారు. అశోక్ కుమార్ అనూప్‌ను కూడా ఆదరించాడు. 1946లో వాళ్ళ తండ్రిగారు ఆస్తి అమ్మేసి పెద్దకొడుకు దగ్గర స్థిరపడదామనుకున్నాడు. కానీ సరైన ధర పలక్కపోవడంతో అశోక్ కుమారే దాన్ని తన కొడుకు (అప్పటికి బాగా చిన్నవాడు) అరూప్ పేరుతో కొనేశాడు. ఆ తర్వాత అనూప్ స్థితి అంత బాగా లేకపోవడం చూసి దాన్ని అతని పేర



అన్నదమ్ముల అనుబంధం: అన్నదమ్ములు ముగ్గురూ - తల్లి గౌరీదేవితో

ట్రాన్స్‌ఫర్ చేశాడు. అంతేకాదు అనూప్ కూతుళ్ల పెళ్లి ఖర్చులకు డబ్బు కావలిసి వస్తే అతనికోసం 'భీమ్‌భవాని' అనే టీవీ సీరియల్ లో నటించాడు. అశోక్, అనూప్ నటించిన ఈ సీరియల్‌కు 'బాసూ చటర్జీ' దర్శకత్వం వహించాడు. అశోక్ సోదర ప్రేమ అటువంటిది!

కిశోర్‌కు కూడా చిన్నన్నగారిపట్ల ప్రేమ తక్కువది కాదు. తనతోబాటే ఫిల్మ్‌రంగంలో ప్రవేశించినా అనూప్ కెరియర్ ముందుకు సాగక పోవడంతో 'చల్తీకా నామ్ గాడీ' (1958) లో కిశోర్ అతనికి పెద్ద పాత్రే ఇచ్చాడు. అలాగే 1961 నాటి 'ఝుమ్రూ' లో కూడా మంచి పాత్ర ఇచ్చాడు. అనూప్ గ్రూచో మార్క్స్‌ను అనుకరించబోయేడు కాని సఫలుడు కాలేదు. కిశోర్ మళ్లీ 'హమ్ దో డాకూ' (1967) అనే సినిమా తీసి తనతో బాటు పార్లర్ హీరో పాత్ర యిచ్చాడు. దురదృష్టవశాత్తు ఆ సినిమా దారుణంగా ఫెయిలయింది.



కిశోర్ సరసన 'చల్తీకానామ్ జిందగీ'లో నటించిన మన వై. విజయ

'చల్తీకా నామ్ గాడీ' మోడల్లో 1981 ఇంకో సినిమా ప్లాను చేశాడు కిశోర్. దానిపేరు 'చల్తీకా నామ్ జిందగీ'. మొదటదానిలాగానే దీనిలో కూడా అన్నదమ్ములు ముగ్గురూ అన్నదమ్ములుగానే నటించారు. దాంట్లో వాళ్లు మోటారు గరాజ్ నడుపుతారు. దీంట్లో హోటల్ నడుపుతారు. సంగీతం, దర్శకత్వం కిశోర్‌వే. ప్రేక్షకులను, విమర్శకులను కూడా మెప్పించలేక పోయిన ఈ చిత్రంలో ముగ్గురన్నదమ్ములతో బాటు, కిశోర్ కొడుకు అమిత్, రీటా బాధురి, ప్రదీప్‌కుమార్ నటించారు. కిశోర్ సరసన మన తెలుగుతార వై. విజయ నటించింది.



స్వీయ దర్శకత్వంలో కిశోర్ నిర్మించిన 'శభాష్ డాడీ'లో అమిత్‌కుమార్ జోడిగా నటించిన జయసుధ

కిశోర్ తెలుగు కనక్షన్ 'విజయ' కే పరిమితం కాలేదు. 'శభాష్ డాడీ ' చిత్రంలో మన జయసుధను తన కుమారుడు అమిత్ కు జోడీగా నటింపచేసాడు. ఆ సినిమా కూడా ఫెయిలయిందనుకోండి!

అనూప్‌కుమార్ వస్తూనే కిశోర్ శవం చూసి భోరుమన్నాడు. తనకంటె చిన్నవాడయినా తన బాగు కోసం తపించి, శ్రమించి పెట్టుబడి పెట్టి సినిమాలు తీసిన తమ్ముడు తనకంటె ముందుగా పరలోకానికి వెళ్లిపోవడం అతన్ని కలచివేసింది.

**(ఇంకావుంది)**

## కొంటె చేష్టల కిశోర్



ఆర్.సి. తల్వార్ అనే నిర్మాత కిశోర్ తో 'మేమ్‌సాబ్' అనే సినిమా తీసాడు. చివర్లో 8వేల రూపాయలు ఎగ్గొట్టాడు. కిశోర్ చాలాసార్లు అడిగేడు కానీ తల్వార్ డబ్బులు విదల్చలేదు. ఇక ఇలా కాదనుకుని ఓరోజు పొద్దున్నే కారేసుకుని కిశోర్ వాళ్ల బిల్డింగ్ ముందుకి వెళ్లి నిలబడ్డాడు, అరిచాడు!

అరే ఓ తల్వార్, ఓ తల్వార్
దేదే మేరే ఆఠ్ హజార్

జనాలంతా బయటకు వచ్చి చూసి కిశోర్‌ను చూసి సంబర పడ్డారు. తల్వార్ ఇరకాటం చూసి నవ్వుకున్నారు. కానీ తల్వార్ మొండిఘటం. డబ్బు ఇవ్వలేదు. కిశోరూవదిలిపెట్టలేదు.

'చల్తీకా నామ్ గాడీ' లో
**'దేదే మేరే పాంచ్ రుపయ్యా బారా అనా**
**మారేగా భయ్యా నా న న నా**

అని పాడిన స్టయిల్లోనే రోజూ ఆఠ్‌హజార్ పాట పాడి వెళ్లేవాడు.

ఓ శుభముహూర్తాన తల్వార్ 'దిగి' వచ్చాడు. ఎనిమిదివేలు ఇచ్చేసి కిశోర్ పాట ఆపించాడు.

## కిశోర్ గీతావళి

**మేరే సప్‌నోంకీ రానీ కబ్ ఆయేగీ తూ**
**ఆయీ రుత్ మస్‌తానీ కబ్ ఆయేగీతూ**
**బీతీ జాయే జిందగానీ కబ్ ఆయేగీతూ**
**చలీ ఆ తూ చలీ ఆ**
**ప్యార్‌కీ గలియాఀ, బాగోంకీ కలియా**
**సబ్ రంగ్‌రలియాఀ, పూఛ్ రహీహైఀ**
**గీత్ పన్‌ఘాట్ పే కిస్ దిన్ గాయేగీ తూ ॥మేరే॥**
**ఫూల్ సీ ఖిల్‌కే, పాసీ ఆ దిల్ కే**
**దూర్ సే మిల్ కే , చైన్ న ఆయే**
**ఔర్ కబ్ తక్ ముఝే తడ్ పాయేగీ తూ ॥మేరే॥**
**క్యాహై భరోసా, ఆశిక్ దిల్ కా**
**ఔర్ కిసీ పే, యే ఆ జాయే**
**ఆ గయా తో బహుత్ పఛ్‌తాయేగీ తూ ॥మేరే॥**



ఆనంద్‌బక్షీ రాసిన ఈ పాటకు సంగీతం ఎస్.డి.బర్మన్, చిత్రం 'ఆరాధన'. ఈ పాట కిశోర్ జీవితాన్నే మలుపుతిప్పింది. ప్లేబాక్ సింగర్‌గా అతనికి రెండవ కెరియర్‌ను ప్రసాదించింది. అంతకుముందు కిశోర్ ప్లేబాక్ పాడకపోలేదు. దేవ్ ఆనంద్ ఒక్కడికే అతడు ప్లేబాక్ పాడాడు, అదీ స్నేహం కారణంగా. తనకూ, దేవ్ ఆనంద్‌కే కాకుండా ఇతరులకు కూడా పాడడం అనేది 'ఆరాధన' తోనే ప్రారంభమైంది. 'ఆరాధన' తర్వాత రాజేష్‌ఖన్నా సూపర్‌స్టార్‌గా, కిశోర్ సూపర్ సింగర్‌గా అయిపోయారు. అ తర్వాత రాజేష్‌ఖన్నాకే కాక ఇంకా ఎందరికో కిశోర్ గాత్ర దానం చేశాడు.

## గాయకులకు అత్యవసరమైన
# వాయిస్ ఎనాలిసిస్

**☆ అసలు మాట ఎలా వెలువడుతుంది?**

❊ స్వరపేటిక (మెడికల్‌గా అయితే లారింక్స్ అంటారు)లో అనేక కండరాలు 'వి' ఆకారంలో ఉండే వాయిస్ కార్డ్స్ (స్వరతంత్రులు) ఉంటాయి. మనం ఊపిరితిత్తుల ద్వారా గాలి వదిలినప్పుడు, ఆ గాలి కారణంగా ఈ తంత్రులు ప్రకంపించి స్వరం బయటకు వెలువడుతుంది.

ఈ కంఠనాళాలు ప్రకంపించే ఫ్రీక్వెన్సీ బట్టి స్థాయి (పిచ్) నిర్ణయించబడుతుంది. ఇది ఆ నాళాల పొడుగు, మందంలపై ఆధారపడి ఉంటుంది. చిన్నా, పెద్దా, ఆడా, మగా కంఠస్వరాలు వేర్వేరుగా ఉండడానికి కారణం ఈ స్థాయీ భేదమే! తీవ్రత (ఇంటెన్సిటీ) బట్టి కంఠంలో హెచ్చుతగ్గులు తెలుస్తాయి. గుణం (క్వాలిటీ) అంటే తీయదనం, బొంగురుదనం, కరుకుదనం - ఇలాటివి. స్థాయి, తీవ్రత, గుణం ఈ మూడూ ఒకదానిపై ఒకటి ఆధారపడతాయి.

**☆ వాయిస్ ఎనాలిసిస్ అంటే?**

❊ ఒక మనిషి స్వరం యొక్క స్థాయి, తీవ్రత, గుణం నిర్ణయించడానికి చేసేదే వాయిస్ ఎనాలిసిస్. వాయిస్ సిగ్నల్‌ను కంప్యూటర్‌లోకి ఫీడ్ చేసినప్పుడు అది ఈ కోణాల ద్వారా దానిని విశ్లేషించి అవి ఏ పరిమితిలో అంటే నార్మల్ రేంజియా, ఎక్కువా, తక్కువా అన్నది తెలుపుతూ రిపోర్టు ఇస్తుంది. ఆ రిపోర్టు బట్టి వాయిస్ ఎనాలిసిస్ చేసే స్పీచ్ పెథాలజిస్టు 1) మీ వాయిస్‌లో లోపం ఏమిటి?, 2) లోపం ఎందుకు జరిగింది?, 3) దానిని సరిదిద్దుకోవటం ఎలా? అని చెప్పగలడు.



**☆ వాయిస్ ఎనాలిసిస్ ఎవరికి అవసరం?**

❊ నిజానికి మాట్లాడేవారందరికీ అవసరమే! ప్రతీయేటా మెడికల్ చెకప్ చేయించుకున్నట్లు 'వాయిస్ హెల్త్' కూడా చూసుకుంటే వృద్ధాప్యంలో వచ్చే సమస్యలను నివారించవచ్చు.

వృత్తిరీత్యా వాయిస్‌పై ఆధారపడేవారికి ఈ ఎనాలిసిస్ మరీ అవసరం. అంటే గాయనీగాయకులు, నటీనటులు, ఉపాధ్యాయులు, ఉపన్యాసకులు, టెలిఫోన్ ఆపరేటర్లు, రిసెప్షనిస్టులు,..ఇలా లిస్టు అనంతంగా సాగుతుంది. ఎందుకంటే ఈ రోజుల్లో మనం కమ్యూనికేషన్ పై చాలా ఆధారపడుతున్నాం. సమస్య వచ్చిన తర్వాత పరిష్కారం వెతకడం కంటే వీరు పీరియాడిక్‌గా చెక్ చేయించుకుంటే మంచిది.

**☆: 'వాయిస్ ప్రాబ్లెమ్స్' అంటే...?**

1) మాట్లాడుతుంటే గొంతులో నొప్పి పెట్టడం

2) రాత్రి అయ్యేటప్పటికి మాట్లాడడానికి అలసటగా ఫీలవడం

3) గట్టిగా మాట్లాడలేక పోవడం

4) మగవాళ్ళు మాట్లాడితే ఆడవాళ్ళు గొంతు చించుకుని మాట్లాడుతున్నట్లు ఉండడం

5) గొంతు బొంగురుపోవడం, జీర రావడం

**☆ గాయనీగాయకులకు వాయిస్ ఎనాలిసిస్ ఎందుకు అవసరం?**

❊ మన స్వరనాళాలు మాట్లాడటానికి ఉద్దేశించినవి. పెద్దగా హెచ్చుతగ్గులు లేకుండా ఒక స్థాయిలో మాట్లాడతాం కాబట్టి వాటికి పెద్ద శ్రమ ఉండదు. కాని పాటలు పాడేవాళ్ళు స్వరనాళాలకు శ్రమ కలిగిస్తారు. అంటే మామూలుగా 200Hz ఫ్రీక్వెన్సీలో పాడగల గాయకుడు అభ్యాసం చేసి ఉదాత్త అనుదాత్తాలు 70Hz నుండి 500Hz వరకు పాడగలడు. ఈ విన్యాసాలకు స్వరనాళాలు ఎంత సహకరిస్తాయో వాయిస్ ఎనాలిసిస్ ద్వారా తెలుస్తుంది.



సరైన పిచ్‌లో పాడకపోతే వాయిస్ బిగ్గరగా పలకదు, పై స్థాయికి చేరదు. ఎనాలిసిస్ ద్వారా గాయకునికి సరైన పిచ్ ఏదో తెలుస్తుంది. దానివల్ల వాయిస్ క్వాలిటీ పెరుగుతుంది."రియల్ ఎనాలిసిస్' అనే టెస్టు చేసినప్పుడు గాయకుడు పాడుతుంటే పిచ్, లౌడ్‌నెస్, క్వాలిటీ ఎలా మారతాయో స్క్రీన్ మీద ప్రత్యక్షంగా కనబడుతుంది. దానివల్ల కావలసిన విధంగా అడ్జస్టు చేసుకోవచ్చును.

**☆ 'రాంగ్ పిచ్' వల్ల ప్రమాదాలేమిటి?**

★ వాయిస్ సరిగ్గా ఉపయోగించకపోయినా, సరైన స్థాయిలో పాడకపోయినా గొంతు కొన్నాళ్లకు బొంగురుపోతుంది, జీరవస్తుంది. స్వరతంత్రులు వాచి ఎర్రబడతాయి, మొద్దుబారుతాయి. సరైన చికిత్స జరగకపోతే 'ఒరిజినల్ వాయిస్' ఎన్నటికీ తిరిగిరాదు. చికిత్స అంటే గొంతుకు విశ్రాంతి కావచ్చు, మందులు కావచ్చు, అవసరమైతే సర్జరీ కావచ్చు.

---






## సినిమా నవ్వులు

అభ్యుదయ భావాలుకల ఒక దర్శకుడు కొందరు వృద్ధ నటీనటులకు తన చిత్రంలో అవకాశం కల్పించి ప్రోత్సహించాలని నిశ్చయించుకున్నాడు. చవగ్గా వస్తారు కదా అని నిర్మాత కూడా ఆమోదించాడు.

ఒక వృద్ధ తారకు అవకాశం లభించింది. ఆ పాత్ర వితంతువు, బీదది - కథానాయిక ఇంట్లో ఉంటూ వంటపనులు చేసి కాలం వెళ్ళబుచ్చుకుంటోంది. పాత్ర వివరాలు సహాయ దర్శకుడు ఆమెకు వివరించాడు.

"పోనీ పట్టుచీర వద్దంటే, మెడలో నా స్వంత గొలుసు-బంగారం కాదులెండి - నాలుగు పేటలుంది వేసుకుంటాను" అంది ఆమె.

"వద్దు" అన్నాడు అసిస్టెంట్.

"పోనీ, ఈ ఆరు జతల గాజులూ...". అదీ కుదరదన్నాడు.

"అయితే ఈ రాళ్ళ ఉంగరం మాత్రం ఉంచుకుంటాను. నామాట కాదనకండి."

"సరేలెండి" అని ఒప్పుకున్నాడు - ఆ ఉంగరం సినిమాలో ఎక్కడ కనిపిస్తుందిలే అని.

ఆ దృశ్యం షూటింగ్ అయిపోయింది. అంతా రషెస్ చూశారు. నిర్మాత గర్వంగా బయటకు వచ్చాడు చవగ్గా తీశామని. ఆయనకు ఆశాభంగం కలిగిస్తూ -

"అదంతా రీటేక్ చెయ్యాలి" అన్నాడు డిస్ట్రిబ్యూటర్. "ఏం?" అన్నారు అంతా.

"చూడండి - ఆ వంటమనిషి చెయ్యి ఎలా ఎత్తిపెట్టి ఉంచిందో అమ్మవారిలా." అన్నాడాయన.

"అవునయ్యా! ఏంటది?రోగమా?" అడిగాడు నిర్మాత.

'ఉంగరం చూపిద్దామని తాపత్రయం కాబోలు. బుద్ధిలేక ఒప్పుకున్నాను" అంటూ గొల్లుమన్నాడు సహాయ దర్శకుడు.

-స్వామి చిత్రానంద



# ఆ పాత మధురం

రాజా

ఏ సినిమా గురించైనా వయోభేదం వలన గాని, సిద్ధాంతాల వలనగాని, పండితులు వర్గీకరించిన కొన్ని నిర్దుష్ట లక్షణాల వలనగాని, అభిరుచి వలనగాని, దినదిన ప్రవర్ధమాన మవుతున్న వైజ్ఞానిక సముపార్జన వలన గాని, వ్యక్తిగత అవేశకావేష సంస్కారాల వలనగాని, మేధోసంపదలోగల వ్యత్యాసాల వలనగాని భిన్నాభిప్రాయాలు ఉండవచ్చు. వీటన్నిటికీ అతీతంగా నిలబడి - తరాల తరబడి - అందరి చేత ఆమోదముద్ర వేయించుకుంటున్న ఏకైక చిత్రం





1957 నుంచి నేటివరకు వన్నె తగ్గని ప్రభావంతో , ప్రాభవంతో అప్రతిహతంగా కొనసాగుతూ ఉన్న ఆ చిత్రాన్ని కళా 'ఖండం' అంటే.. కాదు కళా'పూర్ణం' అని అనేవారు కూడా వున్నారు.

దర్శకుడు కె.వి.రెడ్డి ప్రతిభావ్యుత్పత్తులకు దర్పణంలా నిలిచిన ఈ చిత్రానికి కథ, మాటలు, పాటలు పింగళి నాగేంద్రరావు, సంగీతం ఘంటసాల, సంగీత సాహిత్య సౌరభాలను వెదజల్లే ఈ చిత్రంలోని పాటలలో అణువణువునా ప్రశంసార్హమైన కొన్ని గీతాలివి. వీటిలో యుగళ గీతాలను ఘంటసాల, లీల గానం చేశారు. అక్కినేని, సావిత్రి అభినయించారు.

శ్రీకరులు దేవతలు శ్రీరస్తులనగా,
చిన్నారి శశిరేఖ వర్ధిలవమ్మా
వర్ధిల్లు మాతల్లి వర్ధిల్లవమ్మా -
చిన్నారి శశిరేఖ వర్ధిల్లవమ్మా
సకల సౌభాగ్యవతి రేవతీదేవి
తల్లియై దయలెల్ల వెల్లివిరియగను ॥ సకల ॥
అడుగకే వరములిడు బలరామదేవులే
జనకులై కోరిన వరము లీయగను
వర్ధిల్లు మాతల్లి వర్ధిల్లవమ్మా - చిన్నారి శశిరేఖ వర్ధిల్లవమ్మా
శ్రీకళల విలసిల్లు రుక్మిణీదేవి
పినతల్లియై నిన్ను గారాము శాయ ॥ శ్రీకళల ॥
అఖిల మహిమలు కలుగు కృష్ణపరమాత్ములే
పినతండ్రియై సకల రక్షణలు శాయ
వర్ధిల్లు మాతల్లి వర్ధిల్లవమ్మా - చిన్నారి శశిరేఖ వర్ధిల్లవమ్మా
ఘన వీరమాతయగు శ్రీ సుభద్రాదేవి
మేనత్తయై నిన్ను ముద్దు శాయగను ॥ ఘన ॥
పాండవ యువరాజు బాలుడభిమన్యుడే
బావయై నీవె తన లోకమని మురియ
వర్ధిల్లు మాతల్లి వర్ధిల్లవమ్మా - చిన్నారి శశిరేఖ వర్ధిల్లవమ్మా



సినిమా మొదలవగానే శ్రీకారం తొలి అక్షరంగా వినిపించే విధంగా రాసినట్టు అనిపిస్తుందీ పాట. అంతేకాక ముఖ్యపాత్రల పరిచయం కూడా ఈ పాటలోనే అయిపోయేలా పాటను రూపొందించారు. దేశ్, తిలక్ కామోద్ రాగాలను ఆధార రాగాలను పాటకు తీసుకున్నారు. బేబి సరస్వతి, ఛాయాదేవి, గుమ్మడి, సంధ్య, ఎన్.టి. రామారావు, ఋష్యేంద్రమణి, మాస్టర్ ఆనంద్ కాక ఉపపాత్రధారులెందరో కనిపిస్తారీపాటలో. పాత్రల పరిచయంతో పాటు వాటి స్వభావాలు, ప్రాముఖ్యత కూడా సాహిత్యంలో ప్రతిఫలింపజేయడం ఈ పాట ముఖ్య విశేషం! అడుగకే వరములిడు బలరామదేవులే, అఖిల మహిమలు కల కృష్ణపరమాత్ములే, శ్రీకళలు విలసిల్లు రుక్మిణీదేవి (లక్ష్మీదేవి అవతారం కదా!) లాంటి వాక్యాలు అందుకు ఉదాహరణలు.

లల్లిలలా ... లల్లిలలా
లల్లిలలా ... లల్లిలలా... లల్లిలల్లి... లల్లిలలా ॥ 2 ॥
అల్లీబిల్లీ ఆటలే లల్లిలలా పాటలే ॥ 2 ॥
ఎవరెవరే కోయిలలూ
కుహూ కుహూ కుహూ కుహూ
ఎవరెవరే నెమిళులూ
కకే కకే కకే కకే
ఎవరెవరే ఎవరెవరే
వన్నె లేడి పిల్లలూ ॥ 2 ॥ ॥లల్లిలలా॥
అల్లీబిల్లీ అమ్మాయికి
చల చల చల్లని జోస్యం చెపుతామూ
చక్క చక్కని జోస్యం చెపుతామూ ॥ అల్లీబిల్లి ॥
యవ్వన శోభల పర్వమే
ఇది బావను తలచుకు గర్వమే ॥ యవ్వన ॥
ఆ బావే తనకిక సర్వమే ॥ అల్లీబిల్లి ॥
ఉన్నమాటకీ ఉలుకెందుకు - మరి ఉన్నదె
చెపుతామూ - ॥ ఉన్న మాట ॥
వలదన్నా చెపుతామూ
నూతన విద్యల ప్రవీణుడే బల్ ప్రతిభావంతుడె
నీ బావా - ॥ నూతన ॥
అతి చతుర వీరుడె నీ బావా ॥ అల్లీబిల్లీ ॥
మల్లీ జాజీ మాలతి సంపెగ
పూలబాణములు వేసేనూ ॥ మల్లీ ॥
బాలామణితో మురిసేను
మన బాలామణితో మురిసేను
తన పెళ్ళికి బావను పిలిచేను ॥ అల్లీబిల్లీ ॥



శశిరేఖ చెలికత్తెలు అభినయించిన పాటయిది. చిన్న శశిరేఖ, ఆ వయసు చెలికత్తెలు ఆడుకుంటూ పాడుకుంటూ పెరిగి పెద్దవారయినట్టుగ చూపించటం పాట లక్ష్యం. సాహిత్యం కూడా ఆ పద్ధతిలోనే ఉంటుంది. తొలిచరణంలో పిల్లల మేధస్సుకి పరిమితమైన కోయిలలు, నెమిళులు, లేడిపిల్లలు మలిచరణాలలో యుక్తవయసు వచ్చిన వారి మనసులో చెలరేగే రకరకాల భావాలు... భవిష్యత్తు గురించి, కాబోయే వాని గురించి... ఇలా...! పాటలో తిలంగ్ రాగం ప్రధాన రాగంగా వినిపిస్తుంది. పాటలో చిన్న శశిరేఖ పెరిగి పెద్ద శశిరేఖ అయినట్టుగా నీటిలోని ప్రతిబింబం ద్వారా చూపించే షాటు - ఇవాళ్టికీ ఎందరెందరి మనోఫలకాల పైనో మనోహరంగా నిలిచిపోయి వుంది.



*This feature is sponsored by*

***Shri R.P. Patnayak**, the popular music director in memory of his grand father*

*Late **Sri Baggam Lakshmana Swamy***

అభిమన్యుడు : నీవేనా...
నీవేనా నను తలచినది
నీవేనా నను పిలిచినది
నీవేనా నా మదిలో నిలచి
హృదయము కలవరపరిచినది... నీవేనా
శశిరేఖ : నీవేలే నను తలచినది
నీవేలే నను పిలిచినది
నీవేలే నామదిలో నిలచి
హృదయము కలవరపరిచినది... నీవేలే...
అభిమన్యుడు: కలలోనే ఒక మెలకువగా
ఆ మెలకువలోనే ఒక కలగా ॥ కలలోనే ॥
కలయో నిజమో వైష్ణవమాయో
తెలిసీ తెలియని అయోమయములో ॥ నీవేనా ॥
శశిరేఖ : కన్నుల వెన్నెల కాయించి
నామనసున మల్లెలు పూయించి ॥ కన్నుల ॥
కనులను మనసును కరగించి
మైమరపించి - నన్నలరించి ॥ నీవేలే ॥



ఈపాట భీంప్లాస్ రాగంలో స్వరపరచబడింది. నిజమైన ప్రేమ మెదడులోని పొరలలోకి చొచ్చుకొని పోతుంది. సబ్‌కాన్షస్ స్టేజ్‌లో కూడా ప్రేమించిన వారినే కలవరిస్తూ ఉంటుంది. వారే పిలిచినట్లుగా అనిపిస్తూ ఉంటుంది. కలలోనే ఒక మెలకువగా ఆ మెలకువలోనే ఒక కలగా కలయో నిజమో వైష్ణవ మాయో తెలిసీ తెలియనని అయోమయములో అనే చరణంలో ఆ భావాన్నే అతి గొప్పగా వ్యక్తీకరించారు. ఇక పాత్రోచితమైన పదజాలం ఉపయోగించటం అనే సంప్రదాయం గీత రచయితలకు కథవల్ల గల అవగాహన తెలియచేస్తుంది. 'కలయో నిజమో వైష్ణవ మాయో' అనే పద ప్రయోగం కూడా అటువంటిదే. ఎందుకంటే విష్ణువు అవతారమైన శ్రీకృష్ణుని అభిమానించే అభిమన్యుని నోట 'వైష్ణవమాయ' అని వస్తుందే గానీ 'ఈశ్వరేచ్ఛ' అని రాదుగా.

కోరుకున్నవారిని చూపించే 'ప్రియదర్శిని' పేటికలో శశిరేఖకు అభిమన్యుడు కనిపించి, పాడాక, శశిరేఖ ఆ పేటికను మూసేయబోతూ మరొకసారి తెరిచిచూస్తే అంతవరకు పాడిన అభిమన్యుడు వెళ్ళబోతూ మళ్ళీ వెనుదిరిగి చూడటం - పాట ఉన్నంతకాలం ప్రేక్షకుల గుండెల్లో మరిచిపోలేని చిత్రీకరణ!

గోపికలు: విన్నావ యశోదమ్మా! ॥2॥
మీ చిన్ని కృష్ణుడు చేసినట్టి
అల్లరి చిల్లరి పనులు విన్నావ యశోదమ్మ
యశోద: అన్నెం పున్నెం ఎరుగని పాపడు
మన్నుతినేనే నా చిన్ని తనయుడు
ఏమి చేసెనమ్మా ఎందుకు రవ్వ చేతురమ్మా ...
గోపికలు: ఆఁ... మన్ను తినేవాడా? వెన్న తినేవాడా?
కాలిగజ్జెల సందడి చేయక
పిల్లివలె మా ఇంట్లోదూరి ॥ కాలి ॥
ఎత్తుగ కట్టిన ఉట్టందుకొని
దుత్తలన్నీ క్రింద దించుకొని ॥ ఎత్తు ॥
పాలన్నీ తాగేశనమ్మా,
పెరుగంతా జూరేశనమ్మా,
వెన్నంతా మెక్కేశనమ్మా
కృష్ణుడు: ఒక్కడే ఎట్లా తినేశనమ్మా? ఎక్కడనైనా
కలదమ్మా, ఇది ఎక్కడనైనా కలదమ్మా?
విన్నావటమ్మా... విన్నావటమ్మ
ఓ యశోదా! గోపిక రమణుల కల్లలూ
ఈ గోపిక రమణుల కల్లలూ...



గోపికలు: ఆ... ఎలా బూకరిస్తున్నాడో!
పోనీ పట్టిద్దామంటే చిక్కుతాడా!
భామలందరొక యుక్తిని పన్ని
గుమ్మము నొకరుగ కాచియుండగా
ఒకరింట్లో విని గజ్జెల గలగల
ఒకరింట్లో విని వేణుగానమూ ॥ఒకరింట్లో॥
ఆహాః ఇంకేం
దొంగ దొరికెనని పోయిచూడగా
ఛంగున నెటకో దాటిపోయే
ఎలా వచ్చెనో ఎలా పోయెనో
చిలిపి కృష్ణుడనే అడగవమ్మా... ॥ ఎలా ॥
కృష్ణుడు: నాకేం తెలుసు నేనిక్కడ లేందే!
యశోద: మరి యెక్కడున్నావు?
కృష్ణుడు: కాళింది మడుగున విషమును కలిపె
కాళియు తలపై తాండవమాడి ॥ కాళింది ॥
ఆ విషసర్పము నంతముజేసి
గోవుల చల్లగ కాచానే... ॥ 3 ॥
ద్రౌపది: హే కృష్ణా... హే కృష్ణా...
ముకుందా మొరవినవా,
నీవు వినా దిక్కెవరు దీనురాలి గనవా కృష్ణా
నా హీనగతిని గనవా... కృష్ణా కృష్ణా కృష్ణా...



శ్రీకృష్ణుని చిన్ననాటి ముచ్చట్లు శ్రీకృష్ణుని ఎదుటే ఓ అంతర్నాటకంలా ప్రదర్శించటం, యాదవ కుటుంబమంతా మైమరచి చూస్తుండగా-నిండు కొలువులో ద్రౌపది వస్త్రాపహరణం జరుగుతున్నట్టు ఇక్కడ శ్రీకృష్ణునికి తెలియటం, తద్వారా పాండవులు తమ రాజ్యాలను కోల్పోయారని ఈ పాటద్వారా చూపిస్తారు. తిలంగ్ రాగంలో మొదలై 'కాలిగజ్జెల సందడి చేయక' దగ్గర చారుకేశి రాగాన్ని అందుకుని 'భామలందరొక యుక్తి ని పన్ని' దగ్గర పీలూ రాగాన్ని స్పృశిస్తూ, 'కాళింది మడుగున విషమును కలిపె' దగ్గర శంకరాభరణం స్వరాలపై నడుస్తూ పాట మొత్తం జానపద సంగీత ధోరణిలో సంచరిస్తూ వుంటుంది. ఎన్.టి.రామారావు, సంధ్య, సావిత్రి, గుమ్మడి, ఛాయాదేవి, నాగభూషణం వంటి ముఖ్యపాత్రధారులతో పాటు ఎంతో మంది ఉపపాత్రధారులు కనిపిస్తారీ పాటలో! అంతర్నాటకంలో బాలకృష్ణునిగా వేసింది ప్రముఖ తార పుష్పవల్లి కుమారుడు బాబ్జీ. అక్కడ ఆ ముచ్చట అలావుండగా మధ్యలో 'విన్నావటమ్మ ఓయశోద గోపిక రమణుల కల్లలు' అని బాలకృష్ణుడు అంటుంటే తిలకిస్తున్న రుక్మిణి పాత్రధారిణి సంధ్య నవ్విన నవ్వులు, 'భామలందరొక యుక్తిని పన్ని గుమ్మము నొకరుగ కాచియుండగ' అనే వాక్యం తర్వాత వచ్చే ఇంటర్‌లూడ్‌లో - శశిరేఖ గా నటించిన సావిత్రి చిన్నపిల్లలా ఉత్సాహంగా చేతితో రుక్మిణిని కుదపటం ఇవన్నీ మాయాబజార్ అభిమానులు తల్చుకుని తల్చుకుని మురిసిపోయే ముచ్చట్లు.

అభిమన్యుడు : చూపులు కలిసిన శుభవేళా
ఎందుకు నీకీ కలవరము
ఎందుకు నీకీ కలవరము
ఉల్లాసముగా నేనూహించిన
అందమె నీలో చిందెనులే ॥ చూపులు ॥
శశిరేఖ : చూపులు కలిసిన శుభవేళా
ఎందుకు నీకీ పరవశము
ఎందుకు నీకీ పరవశము
ఏకాంతములో ఆనందించిన
నాకలలే నిజమాయెనులే ॥ చూపులు ॥
అభిమన్యుడు : ఆలాపనలు సల్లాపములు
కలకల కోకిల గీతములే... ॥ ఆలాపనలు ॥
చెలువములన్నీ చిత్రరచనలే.. ॥ చెలువము ॥
చలనములోహో నాట్యములే ॥ చూపులు ॥
శశిరేఖ : శరములవలెనే చతురోక్తులను
చురుకుగ విసిరే నైజములే... ॥ శరము ॥
ఉద్యానమున వీర విహారమే.. ॥ ఉద్యా ॥
చెలి కడనోహో శౌర్యములే. ॥ చూపులు ॥



ఈ పాట బృందావన సారంగ రాగంలో స్వరపరచబడింది. చిన్నప్పట్నించి ఒకరినొకరు ముచ్చటపడ్డ బావ, మరదలు యుక్తవయసు వచ్చాక కలుసుకుంటే అతడికి పరవశంగానే వుంటుంది. ఆమెకు కలవరంగానే ఉంటుంది. ఆ భావాల్నే అచ్చ తెలుగులో అందించారు పింగళి. అదీగాక ప్రేమించిన అమ్మాయి ఏంచేసినా బావుంటుంది. చెలువములన్నీ చిత్రరచనలే చలనము లోహో నాట్యములే' అంటే అదే.





అభిమన్యుడు : లాహిరి లాహిరి - లాహిరిలో
ఓహో జగమే ఊగెనుగా - ఊగెనుగా - తూగెనుగా
శశిరేఖ : లాహిరి - లాహిరి - లాహిరిలో - ఓహో జగమే
ఊగెనుగా - ఊగెనుగా - తూగెనుగా...
అభిమన్యుడు : ఆ.. ఆ.. ఆ..
శశిరేఖ : ఆ... ఆ... ఆ...
తారా చంద్రుల విలాసములతో...
విరిసే వెన్నెల పరవడిలో
అభిమన్యుడు : ఉరవడిలో ॥తారా॥
పూలవలపుతో ఘుమఘుమలాడే
పిల్లవాయువుల లాలనలో ॥లాహిరి॥
అభిమన్యుడు : అలల ఊపులో తీయని తలపులు
చెలరేగే ఈ కలకలలో
శశిరేఖ : మిలమిలలో ॥అలల॥
అభిమన్యుడు : మైమరపించే ప్రేమనౌకలో
హాయిగ చేసే విహరణలో ॥ లాహిరి ॥
శ్రీకృష్ణుడు : రసమయ జగమును రాసక్రీడకూ...
ఉసిగొలిపే ఈ మధురిమలో
రుక్మిణి : ఎల్లరి మనములు
ఝుల్లనచేసే
చల్లని దేవుని అల్లరిలో ॥లాహిరి॥












ఈపాట మోహనరాగంలో స్వరపరచబడింది. ఇవాల్టికీ మోహనరాగానికి ప్రామాణికంగా ఓ సినిమా పాట చెప్పు అని అడిగితే చాలామంది ఉదహరించే పాటయిదే! ఈపాటను అక్కినేని నాగేశ్వరరావు, సావిత్రి పైన మాత్రమే కాకుండా సంధ్య (రుక్మిణి)ని నౌకా విహారానికి తీసుకువెళ్ళి "రసపట్టులో తర్కంకూడదు' వంటి మహత్తరమైన మాటని పలికిన ఎన్.టి.ఆర్. (శ్రీకృష్ణుడు) పైనా, 'కాలహహిమ కాదు ప్రకృతి మహిమ' అంటూ ఛాయాదేవి (రేవతి)ని నౌకా విహారానికి పురిగొల్పిన గుమ్మడి (బలరాముడు) పైనా చిత్రీకరించారీ పాటని. ఈ పాటలో మరో ప్రత్యేకత వెన్నెల...! నిజమైన వెన్నెల ఇలాగే ఉంటుందా అని అనిపించేటంతగా, అసలు వెన్నెల అంటే 'లాహిరి లాహిరి' పాటలో వెన్నెలేనని ఉదహరించేట్టుగా చిత్రీకరించిన మార్కస్ బార్ట్లీ పనితనాన్ని పేర్కొని తీరాలి. అందుకే ఇప్పటకీ ఆంధ్రప్రదేశ్‌లోని కొన్ని ప్రాంతాలలో 'విజయా వారి వెన్నెల' అని కూడా అంటుంటారు.

'మాయాబజార్' అనే దృశ్య కావ్యం గురించి ఎందరు ఎన్నెన్ని కోణాలలో ఎంత చెప్పినా ఇంకా ఎంతో మిగిలిపోతూ ఉంటుంది. అందుకే వచ్చే సంచికలో మరికొంత....

### నటీ నటులు

ఎన్.టి. రామారావు, ఎ. నాగేశ్వరరావు,
సావిత్రి, ఎస్.వి. రంగారావు,
ఋష్యేంద్రమణి, రేలంగి, సూర్యకాంతం,
ముక్కామల, సి.యస్.ఆర్., గుమ్మడి,
ఆర్. నాగేశ్వరరావు,
సంధ్య, రమణారెడ్డి
మొదలగువారు.

**ప్లేబాక్ :**
ఘంటసాల, మాధవపెద్ది, లీల,
వసంతకుమారి, సుశీల, జిక్కి




దర్శకుడు : కె.వి. రెడ్డి
నిర్వహణ : నాగిరెడ్డి, చక్రపాణి

### టెక్నీషియన్లు

కథ, మాటలు, పాటలు : పింగళి నాగేంద్రరావు
సంగీతం : ఘంటసాల
ఛాయాగ్రహణం : మార్కస్ బార్ట్లీ
శబ్దగ్రహణం : ఏ. కృష్ణన్, బి.ఏ.,
శివరాం, బి.ఏ.,
ప్రాసెసింగ్ : ఎస్.సి. సేన్‌గుప్త.
బి.యస్.సి.,

**నృత్యం :**
గోపినాథ్, లలితారావు, ఎం. ఏ; రీటా, సరోజా.

స్టూడియో : వాహిని

# 'ఇక బయలుదేరండి'

ఇలా జరిగితే మీరు మీ బంధువుల ఇంట్లో చాలాకాలంగా తిష్ట వేసినట్టే లెక్క!



చంటి పిల్లాడ్ని, రాత్రి మీ పక్కన పడుకోపెడితే...




రాత్రి పడుకునేటప్పుడు ఫ్యాన్ తీసేస్తే..



కుక్కకి స్నానం చేయించి, ఒళ్ళు తుడిచిన తువ్వాలునే,
మీకు స్నానం చేయమని ఇస్తే..



పేకాట రాదని మొత్తుకున్నా ఇంట్లో అందరూ మొహమాట పెట్టి,
పేకాడించి, మిమ్మల్ని రోజూ ఓడిస్తూ, అప్పుల పాలయేలా చేస్తే..



పక్క ఊళ్ళో సంతకెళ్ళి కూరలు కొనుక్కురా నాయనా.
వచ్చేక ఇంట్లో బూజులు దులుపు. రేపు ఫ్రెండ్స్ వస్తున్నారు అంటే...



వాళ్ళు సినిమాకెళ్తూ
మిమ్మల్ని పిల్లలకి సాయంగా కూర్చోపెడితే...

# సరిగమలు - గలగలలు

## మాధవపెద్ది సురేష్

(సినీ సంగీత దర్శకుడు)





నవంబరు 30 వెన్నెలకంటి పుట్టినరోజును పురస్కరించుకుని

వెన్నెలకంటి రాజేశ్వరరావు గారితో 1990 నుండి పరిచయం. మొదటి కలయికలోనే మా ఇద్దరికీ మంచి స్నేహం కుదిరింది. నాకసలు విరోధులు లేరు, ఉండరు. నా మనస్తత్వం అటువంటిది. ఎప్పుడైనా ఎవరితోనైన ఏదైనా మాటా మాటా అనుకున్న, కోపం ఉన్నా కొద్దిసేపే. మళ్ళీ అసలు ఆ విషయం గుర్తుండదు.

'సంగీతానికి ఇంటిపేరు సాహిత్యం' అని నేను చాలా సార్లు నా మాటల్లో, పాటల్లో చెబుతూనే ఉంటాను. శ్రీ బాలు గారికి చాలా ఇష్టమైన కొటేషన్స్‌లో ఇది ఒకటి.

ఓ సారి నా ఇష్ట దైవమైన షిరిడి సాయిబాబా మీద ఒక ప్రయివేటు క్యాసెట్ రూపొందించటం జరిగింది. 'సాగర్ మేగ్నటిక్స్' సమర్పణలో 'లియో ఆనంద్' ఆధ్వర్యంలో ఈ క్యాసెట్ రూపొందింది. నాకు అదే మొట్టమొదటి ప్రయివేట్ క్యాసెట్, 9 పాటలు నలుగురు ప్రసిద్ధ కవులు రాశారు. వారు శ్రీ సిరివెన్నెల, శ్రీ జొన్నవిత్తుల, శ్రీ వెన్నెలకంటి, శ్రీ డి. నారాయణవర్మ. ఇక్కడ నేను కానీ, ఆ కవులు గానీ ఒక్క నయా పైసా తీసుకోకుండా నిజమైన భక్తితో వర్క్ చేసాము. శ్రీ జంధ్యాల వ్యాఖ్యాత, ఆయన కూడా రెమ్యూనరేషన్ తీసుకోకుండా పనిచేశారు. సుప్రసిద్ధ గాయకులు, గాయనీమణులు ఆ పాటలు వారి వారి గొంతుకలతో ఆర్ద్రత, స్పందన, భక్తి భావం మేళవించి పాడారు. నాకు చాలా పేరు తీసుకువచ్చిన క్యాసెట్ అది. కొన్ని లక్షల క్యాసేట్స్ అమ్ముడు పోయాయి, పోతున్నాయి. శ్రీ బాల సుబ్రహ్మణ్యం, రమేష్‌మనో, వి. రామకృష్ణ శ్రీమతి జిక్కి, సుశీల, శైలజ, వాణీజయరాం అద్భుతంగా పాడారు.

ఎందుకు ఇదంతా చెబుతున్నానంటే నాకు 'బృందావనం' సినిమా కన్ఫర్మ్ అవటానికి ఈ క్యాసేట్ కూడా ఒక కారణం సింగితం శ్రీనివాసరావు గారికి చాలా బాగా నచ్చింది. ఆయన ఒక మంచి మాటన్నాడు 'ఇందులో ఆత్మ ఉంది' అని. వెన్నెలకంటి గారు ఆ క్యాసేట్‌లో 4 పాటలు రాశారు.

1. బాబా రావా మొరవినవా(శ్రీ బాలు), 2. బాబా శరణం(శ్రీ బాలు),

3.శ్రీ గురునాధా (శ్రీమతి పి.సుశీల), 4. చేరుకోనీయి నీ ద్వారకామయి (శ్రీమతి శైలజ).

వెన్నెలకంటి గారికి అందరి కవులతో, సంగీత దర్శకులతో, గాయకులతో సత్సంబంధాలు ఉన్నాయి. ఆయనకంటే అందరికీ ఇష్టం. ఆయన రచనల్లో క్లారిటీ ఉంటుంది, భావం చెడిపోకుండా తననాలకి సరిగ్గా రాస్తారు. నాకు రాసిన పాటల్లో 99 శాతం కరెక్షన్స్ లేకుండా రాశారు.

ముఖ్యంగా నా జీవితంలో 'బృందావనం' పాటలు గొప్ప వరం. 1992 లో విజయావారు షుమారుగా 17 ఏళ్ళ విరామం అనంతరం రావికొండలరావు గారు, సింగీతం శ్రీనివాసరావు గారు, డి.వి. నరసరాజు లాంటి సీనియర్ టెక్నీషియన్స్ ఆధ్వర్యంలో నాకు అవకాశం ఇవ్వటం దైవలీల. అదే విజయావారికీ, మాధవపెద్ది వారికీ ఉన్న అనుబంధం.



గాయకుడు బాలు, సంగీత దర్శకుడు మహరిషితో...



తరువాత అందరికీ విపరీతంగా నచ్చి అన్ని పాటలూ ఆయన చేతనే రాయించారు. నేనూ, వెన్నెలకంటిగారూ అన్ని పాటలకీ కలసి పనిచేశాం. షుమారు 3 వారాలపాటు కంపోజింగ్ జరిగింది. జీవితంలో మరచిపోలేని మధుర క్షణాలు! ఓహో ఓహో ఓహో బుల్లి పావురమా, మధురమే సుధాగానం, ఆ రోజునారాణి, అబ్బోఏమి వింత, మా మామయ్యా ఐదు పాటలూ ఆయనే రాశారు. అంతే కాకుండా విజయా వారి సంస్థలో అన్ని పాటలూ 'ఎస్.పి.బాలు గారు, ఎస్.జానకి గారు' పాడటం విశేషం! పాటలు కూడా వీలున్నంత వరకూ విజయా వారి రాగాల్లోనే కంపోజ్ చేయటం జరిగింది. ఓహో ఓహో ఓహో బుల్లి పావురమా (భీంపలాస్), మధురమే సుధాగానం (మోహన) ఆరోజు నారాణి(దుర్గ) అబ్బో ఏమివింత (దేశ్).

తరువాత నాకు షుమారు 30 పాటలకు పైగా రాశారాన. పుట్టింటి గౌరవం, బదిలీ, శ్రీకృష్ణార్జున విజయం, మాతో పెట్టుకోకు, సహనం, ప్రెసిడెంట్‌గారి అల్లుడు ఇత్యాది సినిమాల్లో అన్నిరకాల భావాల్లో, నవ రసాల్లో అద్భుతంగా రచన చేశారు.

నాకు బాగా నచ్చిన పాటల్లో కొన్ని ఉదహరిస్తాను. బృందావనం లో మధురమే, ఆరోజు నారాణి, ఓహో ఓహో ఓహో బుల్లి పావురమా, శ్రీకృషార్జున విజయంలో భళీ భళీ ఏమి భాగ్యము.(ఈ సినిమాకు 1996 నంది అవార్డు వచ్చింది), పుట్టింటి గౌరవంలో డ్రింకింగ్ సాంగ్, మాతో పెట్టుకోకు లో అన్ని మాస్ సాంగ్స్(నాకు కమర్షియల్ గా మంచి పేరు తెచ్చిన చిత్రం), మదనుడు చేసే విరహాల పూలగాయం(ప్రెసిడెంట్ గారి అల్లుడు) ఇలా చాలా పాటలు ఏ మాత్రం భేషజం లేకుండా 'భేషుగ్గా' రాశారు.

వందకు పైగా డబ్బింగ్ సినిమాలకి మాటలు, పాటలు రాయటం చాలా కష్టమైన పని 'హాట్స్ ఆఫ్ టు హిమ్'. 'వేదిక' అనే సంస్థను స్థాపించి ఎన్నో విజయవంతమైన కార్యక్రమాలు చేశారు. ఆయన తలపెట్టిన చాలా కార్యక్రమాల్లో నేను పాల్గొనటం నా అదృష్టం. 'లహరి' పేరుతో ఒక కొత్త ప్రక్రియతో రచన చేస్తున్నారు. రచనలు, కొన్ని నేను వినటం జరిగింది అద్భుతంగా ఉన్నాయి.

నవంబర్ 30 వ తేదిన నెల్లూరులో జన్మించిన వెన్నెలకంటి ఎస్.బి.ఐ లో పనిచేశారు. ఆయన రచనలో నాకు ఆత్రేయ గారి, వేటూరి గారి ముద్ర కనిపిస్తుంది. ఎందుకంటే ఆయనకి వాళ్ళిద్దరూ ఎంతో ఇష్టమైన కవులు.

ఈ సినీ జీవితంలో ఆయన ఎన్ని రచనలు చేసినా అతి ముఖ్యమైనవి, ఎంతో కాలం అందరూ మరచిపోలేని రచనలు కొన్ని ఉన్నాయి. చిరునవ్వుల వరమిస్తావా - చితి నుంచి బ్రతికొస్తాను, మరు జన్మకి కరుణిస్తావా - ఈ క్షణమే మరణిస్తాను ఎక్సార్డినరి! బుద్ధభూమి రుద్రభూమి అయింది. వేదభూమిలో వేదన మిగిలింది. సింప్లీ సూపర్బ్! (ఈ పాటకి 2000 సంవత్సరానికి వెన్నెలకంటి గారికీ, ఆ పాట పాడిన బాలసుబ్రహ్మణ్యం గారికీ నంది అవార్డు లభించింది) ఇలా ఆయన ఎన్నో మంచి పాటలూ రాయాలనీ, అందుకు ఆయనకు చాలా మంచి అవకాశాలు రావాలనీ సర్వేశ్వరుణ్ని ప్రార్థిస్తున్నా!



**సంగీత దర్శకుడు రామ్‌లక్ష్మణ్‌తో**

---

పూర్వం రోజుల్లో ఆత్రేయ-సినారె ఛలోక్తులు వేసుకునేవారని, శ్రీశ్రీ-ఆరుద్ర ఒకరిమీదొకరు పద్యాల ద్వారా తమ వ్యంగ్యవైభవాన్ని చూపించుకున్నారని పాఠకులలో కొందరికి తెలిసే ఉంటుంది. అటువంటి తమాషాలు, చమత్కారాలు ఈతరం సినీకవుల మధ్య కనిపించవేం అని అనుకునేవారికి ఈ సంఘటనే ఓ ఋజువు.





ఓసారి వెన్నెలకంటి, చంద్రబోస్ ఓ కార్యక్రమంలో కలిశారు. అప్పటికి చిరంజీవి నటించిన 'ఇద్దరు మిత్రులు' సినిమాలో చంద్రబబోస్ రాసిన 'మనసావాచా మనసిస్తే మైసూర్ ప్యాలెస్ రాసిస్తా' అనే పాట బాగా పాపులర్‌గా ఉంది. దాన్ని దృష్టిలో పెట్టుకొని, 'ఏవయ్యా చంద్రబోసూ... అలా ప్యాలెస్‌లూ, బిల్డింగ్‌లు రాసిచ్చేడవేనా...ఎంత నీవి కాకపోతే మాత్రం?' అని అన్నారు వెన్నెలకంటి సరదాగా.

"నేను సరేలెండి సార్ ప్రక్క రాష్ట్రంలోని అదీ బిల్డింగులు మాత్రమే రాసిస్తున్నాను, మరి మీరు ఏరియాలకు ఏరియాలు... అదీ స్వంత రాష్ట్రంలోవి ... 'రావయ్య ముద్దులమావా నీకు రాసిస్తా రాయలసీమ' అంటూ రాసిచ్చేస్తున్నారు" అన్నాడు చంద్రబోస్ 'సమరసింహారెడ్డి' సినిమాలోని వెన్నెలకంటి రాసిన పాటని కోట్ చేస్తూ.

అక్కడ ఉన్న అందరితోపాటు ఈ ఇద్దరూ కూడా మనస్ఫూర్తిగా నవ్వుకుని షెక్‌హ్యాండ్ ఇచ్చేసుకున్నారు.

-రాజా

# వెన్నెలకంటి సినీ గీతాలు

## చిత్రం: అల్లరి ప్రియుడు

సంగీతం: యం.యం.కీరవాణి
గానం: బాలు

ప: ప్రణయమా నీపేరేమిటి ప్రళయమా
గమ్యం తెలియని పయనమా
ప్రేమకు పట్టిన గ్రహణమా
తెలుపుమా తెలుపుమా తెలుపుమా
చ: ప్రేమా కవితా గానమా
నా ప్రాణమున్నది శృతిలేక
గేయమే ఎదగాయమైనది వలపు చితిని రగిలించగా
తీగచాటున రాగమా
ఈ దేహమున్నది జతలేక
దాహమారని స్నేహమై ఎదశిథిల శిశిరమై మారగా
ఓహృదయమా ఇది సాధ్యమా
రెండుగ గుండే చీలునా ఇంకా ఎందుకు శోధనా
తెలుపుమా తెలుపుమా తెలుపుమా తెలుపుమా
చ: ప్రేమసాగర మదనమే జరిగింది గుండెలో ఈవేళ
రాగమన్నది త్యాగమైనది చివరికెవరికీ అమృతం
తీర మెరుగనని కెరటమై చెలరేగు మనసులో ఈవేళ
అశ్రుధారలే అక్షరాలుగా
అనువదించెనా జీవితం
ఓప్రాణమా ఇది న్యాయమా
రాగం అంటే త్యాగమా
వలపుకు ఫలితం శూన్యమా
తెలుపుమా తెలుపుమా తెలుపుమా

## చిత్రం: ముద్దులమామయ్య

సంగీతం: కె.వి.మహాదేవన్
గానం: బాలు,సుశీల,శైలజ

అ: మామయ్య అన్న పిలుపు
మా ఇంట ముద్దులకు పొద్దుపొడుపు
కమ్మగా పాడిన కంటిపాప జోల
కానుకే ఇవ్వనా చెల్లికి ఉయ్యాల
అరచేత పెంచాను చెల్లిని
నా అరుదైన బంగారుతల్లిని
అడుగేస్తే పాదాలు కందవా
నా కన్నుల్లో కన్నీళ్ళు చిందవా
ఆ:1. అమ్మగా లాలించాడు నాన్నగా పాలించాడు
అన్నగా ప్రేమించాడు అన్నీ తానైనాడు
ఆ.2. తన ప్రాణంగా నను పెంచాడు
ఆ దైవంగా దీవించాడు
నా అన్నలాంటి అన్న ఈలోకాన లేడు
అ: ఆరేడు మాసాలు నిండగా
ఈ అన్నయ్య కలలన్నీ పండగా
తేవాలి బంగరు ఊయల కావాలి మా ఇల్లు కోవెల
రెప్పగా నిను కాచనా పాపగా నిను చూడనా
రేపటి ఆశ తీరగ నీ పాపకు జోల పాడనా
ఆ: ఇది అరుదైన ఓ అన్నకథ
అ: ఇది మురిపాల ఓ చెల్లికథ
ఇది చెల్లెలే కాదులే నను కన్నతల్లి

## చిత్రం: డ్యూయెట్

సంగీతం : ఎ.ఆర్.రెహమాన్
గానం : బాలు,చిత్ర.

ప: అంజలి అంజలి పుష్పాంజలి అంజలి అంజలి పుష్పాంజలి
పువ్వంటి పదములకు పుష్పాంజలి
ముద్దైన పెదవులకు మోహాంజలి
హంస నడకలకు గీతాంజలి
కనరాని నగవులకు కవితాంజలి
చ: నిన్నదాక నువ్వూనేను ఇరువురం ఎవరనీ
కమ్మని బంధం ఇలా తెలిపెను ఒకటనీ
కడలిన పడు వానలా కలిసిన మది ఇది
కరిగిన సిరిమోజులా కథ ఇది
నా చెలి ఎదురుగ తొలి స్వప్నం తొణికినది
ఎదలో మధు కావ్యం పలికినది
అంజలి అంజలి వలపుల నా చెలి ॥పువ్వంటి॥
చ: కన్నుల సంకేతమే కలలకు తొలకరీ
వెన్నెల జలపాతమే వలపుకు తదుపరీ
గుండెలో సంగీతమే కురిసెను ఎందుకో
కోయిల పాటే ఇలా పలికెనదెందుకో
చెలువుగ ఎదమారే వెన్నెలగా
అంజలి అంజలి ఇది హృదయాంజలి
నీప్రేమలాహిరికి పుష్పాంజలి
నీ గాన మాధురికి గీతాంజలి
ఎదదోచు నవ్వులకి నటనాంజలి
కవి అయిన నీ మదికి కవితాంజలి ॥అంజలి॥
చ: అంజలి నీ చూపులో వెన్నెల వెల్లువే
అంజలి నా ఊపిరై పలికెను పల్లవే
కన్నుల నువు లేనిదే కలలే రావులే
నామది నువు లేనిదే కవితే లేదులే
తెలిసెను నువ్వేనా మనసువని
మోజుకు నెలవైన వలపువని
అంజలి అంజలి వలపుల నా చెలి. ॥పువ్వంటి॥

## చిత్రం: మహానది

సంగీతం: ఇళయరాజా
గానం: బాలు,చిత్ర

సా: గంగా శంకాశ కావేరి శ్రీరంగేశ మనోహరి
కల్యాణకారి కలుషారి నమస్తే సుధాఝురి
ప: శ్రీరంగ రంగ నాథునీ దివ్యరూపమే చూడవే
శ్రీదేవి రంగ నాయకీ నామం సంతతం పాడవే
నీలవేణిలో ముత్యాలు కృష్ణవేణిలో అలలగీతాలు
నీలవేణిలలో నీటి ముత్యాలు నీరజాక్షునికి పూలుగా
కృష్ణవేణిలో అలలగీతాలు కృష్ణగీతాలే పాడగా
చ: కృష్ణాతీరాన అమరావతిలె శిల్పకళావాణి పలికిన శృతిలో
అలలైపొంగేను జీవనవేదం
కలలే పలికించు మధుసంగీతం
చల్లగా గాలి పల్లకిలలోన పాట ఊరేగగా
వెల్లువై గుండె పల్లెపదమందు పల్లవే పాడగా
శ్రీత్యాగరాజు కీర్తనైసాగే తియ్యనీ జీవితం ॥శ్రీరంగ॥
చ: గంగను మరపించు ఈ కృష్ణవేణి
వెలుగులు ప్రసరించు తెలుగింటిరాణి
పాపాల హరియించు పావన జలము
పచ్చగ ఆనేల పండించు ఫలము
ఈపటి నీటి పాయలే తేటగీతులే పాడగా
సిరులెన్నో పండి ఈభువి స్వర్గలోకమై మారగా
కల్లకపటమే కానరాని ఈ పల్లెసీమలో ॥శ్రీరంగం॥

# వెన్నెలకంటి సినీ గీతాలు

## చిత్రం: శీను

సంగీతం: మణిశర్మ
గానం: హరిహరన్, సుజాత

ప: ప్రేమంటే ఏమిటంటే నిను ప్రేమించినాక తెలిసే
మనసంటే ఏమిటంటే అదినీకివ్వగానే తెలిసే
ఇదివరకు తెలియంది ఈ అనుభవం
ఎదమేలు కొలిపింది ఈ పరిచయం
ఓ.... ॥ప్రేమంటే॥

చ: నీకళ్ల వాకిళ్లలో తలుపు తెరిచెను ప్రేమా ప్రేమా
మోహాల ముంగిళ్లలో వలపు కురిసెను ప్రేమా ప్రేమా
ఈనాడె తెలిసింది తొలిసారిగా
ఎంత తియ్యందీ ప్రేమని
ఆకాశ దీపాలు ఇలచేరగా తెరతీసింది ఆమని
ఇది సంగీతమో తొలి సంకేతమో
ఇది ప్రియ గీతమో మది జలపాతమో ॥ప్రేమంటే॥

చ: ఈనాడు ఏదేవతో మనలు కలిపిన వేళా వేళా
ఈనాడు ఈదేవితో మనసు తెలిపెను చాలా చాలా
కాలాలు ఒకసారి ఆగాలిలే మన తొలిప్రేమ సాక్షిగా
లోకాలు మనవెంట సాగాలిలే
మన ప్రేమికుల తోడుగా
ఇది ఆలాపనో మది ఆరాధనో
మన సరసానికి తొలి సంకీర్తనో ॥ప్రేమంటే॥

## చిత్రం: మహర్షి

సంగీతం: ఇళయరాజా
గానం: బాలు, జానకి

ప: మాటరాని మౌనమిది మౌన వీణగానమిది
గానమిది నీధ్యానమిది ధ్యానములో నా ప్రాణమిది
ప్రాణమైన మూగగుండె రాగమిది

చ: ముత్యాలపాటల్లో కోయిలమ్మ ముద్దారబోసేది ఎప్పుడమ్మా
ఆపాలనవ్వుల్లో వెన్నెలమ్మదీపాలు పెట్టేది ఎన్నడమ్మా
ఈ మౌనరాగాల ప్రేమావేశం ఏనాడో ఒకరి సొంతం
ఆకాశ దీపాలు జాబిలి కోసం నీకేలా ఇంత పంతం
నింగీనేల కూడేవేళా నీకూ నాకూ దూరాలేలా
అందరాని కొమ్మఇదికొమ్మచాటుఅందమిది
మాటరాని మౌనమిది మౌనవీణ గానమిది

చ: చైత్రానకూసేను కోయిలమ్మ గ్రీష్మానికాపాటందుకమ్మా
రేయంతా నవ్వేనువెన్నెలమ్మా నీరెండకానవ్వుదేనికమ్మా
రాగాలతీగల్లో వీణానాదం కోరింది ప్రణయవేదం
వేసారు గుండెల్లో రేగేగాయం పాడింది మధురగేయం
ఆకాశానా తారాతీరం అంతేలేని ఎంతోదూరం

ప: మాటరానిమౌనమిదిమౌనవీణగానమిది
అందరానికొమ్మఇది కొమ్మచాటుఅందమిది
కూడనిదిజతకూడనిది చూడనిదిమదిపాడనిది
చెప్పరానిచిక్కుముడి వీడనిది
మాటరానిమౌనమిదిమౌనవీణగానమిది
అందరానికొమ్మఇది కొమ్మచాటుఅందమిది

## చిత్రం: బృందావనం

సంగీతం: మాధవపెద్ది సురేష్
గానం: బాలు, జానకి

ప: మధురమే సుధాగానం మనకిదే మరో ప్రాణం
మదిలో మోహన గీతం మెదిలే తొలి సంగీతం

చ: చరణాలు ఎన్ని ఉన్నా పల్లవొకటే కదా
కిరణాలు ఎన్ని ఉన్నా వెలుగొక్కటే కదా
శతకోటి భావాలను పలుకు ఎద మరునా
సరిగమలు మారుతున్నా మధురిమలు మారునా

చ: వేవేల తారలున్నా నింగి ఒకటే కదా
ఎన్నెన్ని దారులున్నా గమ్యమొకటే కదా
ఎనలేని రాగాలకు నాదమొకటే కదా
అనుభూతులెన్ని ఉన్నా హృదయమొకటే కదా

## చిత్రం: ఆదిత్య 369

సంగీతం: ఇళయరాజా
గానం : బాలు, జానకి

రాసలీలవేళ రాయబారమేల
మాటే మౌనమై మాయచేయనేల
కౌగిలింత వేడిలో కరిగే వన్నె వెన్నెలా
తెల్లబోయి వేసవి చల్లె పగటి వెన్నెల
మోజులన్ని పాడగ జాజిపూల జావళి
కందెనేమో కౌగిట అందమైన జాబిలి
తేనెవానలోన చిలికే తీయనైన స్నేహము
మేని వీణ లోనపలికే సోయగాల రాగము
నిదురరాని కుదురులేని
ఎదలలోన సొదలుమాని ॥రాసలీల॥
మాయచేసి దాయకు సోయగాల మల్లెలు
మోయలేని తీయని హాయిపూల జల్లులు
చేరదీసి పెంచకు భారమైన యవ్వనం
దోరసిగ్గు తుంచకు ఊరుకోదు ఈ క్షణం
చేపకళ్ల సాగరాల అలల ఊయలూగనా
చూపుముళ్ళు ఓపలేను కలలు తలుపుతీయనా
చెలువ సోకు కలువ రేకు
చలువ సోకి నిలువ నీదు ॥రాసలీల॥

## చిత్రం: స్వాతికిరణం

సంగీత: కె.వి మహాదేవన్
గానం: వాణీజయరాం

కొండాకోనల్లో లోయల్లో
గోదారిగంగమ్మా సాయల్లో
కోరికోరి కూసింది కోయిలమ్మ ఈ కోయిలమ్మ
నేల పల్లవి పాడంగ
నీలి మబ్బు ఆడంగ
రివ్వున గువ్వే సాగంగా
నవ్వే మువ్వై మోగంగా
ఉంగా ఉంగా రాగంగా
ఉల్లాసాలే ఊరంగ
ఊపిరి ఊయల లూగంగా
రేపటి ఆశలు తీరంగ
తెలుగుదనం నోరూరంగ
తేటగీతి గారాబంగా
తెమ్మెరపై ఊరేగంగా
వయ్యారంగా ॥కొండాకోనల్లో॥
ఝుమ్మని తుమ్మెద తీయంగ
కమ్మని రాగం తీయంగ
జాజిమల్లె సంపెంగ
జానపదాలే నింపంగా
చెట్టు పుట్టా నెయ్యంగ
చెట్టాపట్టా లెయ్యంగ
చిలక పలుకులు చిత్రంగ
చిలికేతేనెలు చిత్రంగ
ఏటి పాటలాలించంగ
తోట తల్లి లాలించంగా
స్వరాలన్ని దీవించంగ సావాసంగా ॥కొండాకోనల్లో॥

# వెన్నెలకంటి సినీ గీతాలు

## చిత్రం: క్షణక్షణం

సంగీతం: యం.యం.కీరవాణి
గానం: మనో, చిత్ర

సాకీ: శ్రావణ వీణా స్వాగతం స్వరాల వీణా వెల్‌కమ్
లేత విరిపువ్వా నవ్వమ్మా
ఆనందంలో

ప: జుంబాయే ఆగుంబయే జుంబాయే ఆగుంబయే
జుంబాయే ఆగుంబయే హైగోహైగో హైగోహేహే బక్కీవా
చలిచంపుతున్న చమక్కులో చెలి చెంత కొచ్చింది
చెలి చెంతకొచ్చే తళుక్కులో గిలిగింత గిచ్చింది
వయసాగనిది రేగినది సరసములోనా
చలి దాగనిది రేగినది సరసకురానా
కల తీరదులే తెలవారదులే ॥జుంబాయే॥
ఇది చక్కని చిక్కని చక్కిలి గిలి

చ: అందిస్తున్నా వగరే చిరు చిగురే తొడిగి
చిందిస్తున్నా సిరులే మగసిరులే అడిగి
రమ్మంటున్నా ఎదలో తుమ్మెదలే పలికే
ఝుమ్మంటున్నా కలలో వెన్నెలలే చిలికే
గలగలమని తరగల తరగని కల కలిగిన కథలివిలే
కలకలమని కులుకుల అలుకలు గని చిలికిన
సుధ లివిలే
చెలువని గని కలువల చెలువని గని నిలువని
మనసిదిలే
అలుపెరుగని అలరుల అలలను గని తలపులు తెలిపిన
వలపుల గెలుపిదిలే తలబడకిక తప్పదులే

చ: ఊకొట్టింది అడవే మన గొడవే వింటూ
జోకొట్టింది ఒడిలో ఉరవడులే కంటూ
ఇమ్మంటుంది ఏదో ఏదేదో మనసూ
తెమ్మంటుంది ఏంతో నీకంతా తెలుసు
అరవిరిసిన తలపుల కురిసెను కల కలసిన మనసులలో
పులివిరిసిన వలపును తెలిపెను కథ పిలుపుల మలుపులలో
ఎదకొసరగ విసిరెను మధువుల వల అదిరిన పెదవులలో
జతకుదరగ ముసిరెను అలకల అల చిలకల పలుకులు
చిలికిన చినుకులలో తొలకరి సిరి జల్లులలో

## చిత్రం: చెట్టుకింద ప్లీడరు

సంగీతం : ఇళయరాజా
గానం : బాలు, చిత్ర

ప: చల్తీకానామ్ గాడీ చలాకి వన్నెలేడీ
రంగేళి జోడీ బంగారు బాడీ వేగంలో చేసెను దాడీ
వేడెక్కి ఆగెను ఓడి
అహో ఇక ముప్పుల తిప్పలు తప్పవా తప్పవా
దారి చెప్పవా చెప్పవా

చ: దేవతలే మెచ్చిన కారు దేశాలే తిరిగిన కారు
వీరులకు ఝూన్సీకారు హీరోలకు ఫ్యాన్సీకారు
అశోకుడు యుద్ధంలోనా వాడిందే ఈ కారు
శివాజి గుఱ్ఱం వీడి ఎక్కిందే ఈ కారు
చరిత్రల లోతులు చేరి రాతలు మారి చేతులు మారినదీ
జంపరు బంపరు బండిరా బండిరా
జగ మొండిరా మొండిరా

చ: ఆంగ్లేయులు తోలిన కారు ఆంధ్రానే ఏలిన కారు
అందాలా లండన్ కారు అన్నింటా ఎమ్మెన్ కారు
బుల్లెట్‌లా దూసుకు పోయే రాకెట్టే ఈ కారు
రేసుల్లో కప్పులు మనకే రాబట్టే ఈ కారు
హుషారుగ ఎక్కినచాలు దక్కును మేలు చిక్కు సుఖాలు
ఇదే సూపరు డూపరు బండిరా బండిరా
జగ మొండిరా మొండిరా

## చిత్రం: చిరునవ్వుల వరమిస్తావా

సంగీతం: విద్యాసాగం
గానం: బాలు, కోరస్

ప: చిరునవ్వుల వరమిస్తావా చితినుంచి బతికొస్తాను
మరుజన్మకు కరుణిస్తావా ఈక్షణమే మరణిస్తాను
పగలు నీవు రేయిని నేను కలుసుకోని జంట ఇది
పగలు నీవి సెగలు నావి మంచులోన మంట ఇది

చ: రేపులేని రేయిని నేనై చెపుతున్నా వీడ్కోలు
అశ్రువులే అక్షరాలుగా చేస్తున్నా చేవ్రాలు
నిప్పుచివర నివురుంటుంది వలపుచివర వగపుంటుంది
నింగిజార్చు కన్నీటి ధారలో నేల తడిసి పులకిస్తుంది

చ: ఊహలన్నీ శిథిలాలైతే ఊపిరున్న శిల నేను
కళ్ళులేని మనసున మరిగి కరుగుతున్న కల నేను
పగులుతున్న హృదయమిది పడమటింటి ఉదయమిది
ఎద ప్రమిదకు నెత్తురు నింపి ఎదురుచూచు దీపమిది

## చిత్రం: తెనాలి

సంగీతం: ఎ.ఆర్ రెహమాన్
గానం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, చిత్ర

ఆ: ఎదను దోచి ఏదో చేసి
కళ్ళనిండ కలలే దాచి (2)
చెంతకి చేరాక ఊరింతు వేలా

అ: ఎదనే నిదురించవా
ఎదురై మురిపించవా
పాటై పలికించవా తోడై పులకించవా
ప్రాణమా ప్రాణమా ॥ఎదను॥

అ: ప్రాయమా ప్రాయమా (2)
నన్ను చూసి నన్నే చూసి కళ్ళతోటి కలలే దోచి
తీయని మోహాల మరిగింతు వేలా ॥ఎదను॥

ఆ: కలిసిన కళ్ళే కలలకు ఇళ్ళయి
వయసును గిల్లే మన్మథ విల్లయి (2)

అ: హాయిగా ఊగే ఊయలలూగే
అందం ఎరవేసే చందం ఏదో సాగే

ఆ: ఆశల గోదారి ఎగిసినదంటా
తారల పువ్వులన్ని కోసుకుందమంటా

అ: నిదురించు ప్రేమయే ఉదయించె నేడే

ఆ: నిదురించు ప్రేమయే
ఉదయించె నేడే ప్రాణమా ప్రాణమా

అ: హృదయాన మ్రోగే ఈ రాగహేల
మధురం కదా ఇక మన రాసలీల

ఆ: రెక్కలు తొడిగే తలపులు చాలా
దిక్కులు దాటే ఎద ఈ వేళా

అ: ఎదవీణ దాచే మౌన గీతమేలే
పున్నాగ విరుల సన్నాయి నీవే

ఆ: జత నీవని నిన్నే వలచి వచ్చానే ॥ప్రాణమా॥

ఆ: ఎదనుదోచి అ... ఎదనుదోచి ॥ఎదనే॥







వెన్నెలకంటి

పుట్టిన రోజు (నవంబరు 30)ని

పురస్కరించుకుని

సంగీత సాహిత్యాభిమానులందరి తరపున

అభినందనలతో...

'హాసం'





RNI Regd. No.APTEL/2001/5503 HAASAM HAASYA SANGEETHA PATHRIKA Postal Regn. No.H-HD-997.

